## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస


అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..







"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా) నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్ఛంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul

గమనిక: భక్తి,జ్ఞాన,ధర్మ ప్రచారార్థం ఉచితంగా eBook రూపంలో భారత ప్రభుత్వపు డిజిటల్ లైబ్రరీ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఇది లాభార్జన దృష్టిలేని ఉచిత సేవ. ఈ సేవలో అంతర్జాలంలోని(ఇంటర్నెట్) లైసెన్సు / కాపీరైటు అభ్యంతరాలు లేనివి అనుకొన్న పుస్తకాలను గ్రహించటం జరిగినది. అనుకోకుండా ఏవైనా అభ్యంతరకరమైనవి ఉన్నచో మాకు తెలుప మనవి, వాటిని తొలగించగలము అని మనవి చేసుకొంటున్నాము.

Website: www.freegurukul.org | Mobile App: Free Gurukul | email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul | Help Line / WhatsApp: 904 202 0123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

సాధన గ్రంథ మండలి - ౮౫.

# జగద్గురు బోధలు

## ప్రథమ సంపుటము

శ్రీ కంచి కామకోటి జగద్గురు
శ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతీ శంకరాచార్యస్వామి



ఆంధ్రానువాదము :
"విశాఖ"

పరిశోధకులు :
శతావధానులు, శ్రీ వేలూరి శివరామశాస్త్రి

"ఆంధ్రప్రభ" నుండి పునర్ముద్రితం.





ప్రకాశకులు :
సాధన గ్రంథ మండలి, తెనాలి.

 * * * వెల రు. 2=50

# మున్నుడి

శ్లో॥ మూకం కరోతి వాచాలం పంగుం లంఘయతే గిరిం,
యత్కృపా తమహం వందే పరమానంద మాధవమ్॥

దాదాపు రెండేళ్ళ క్రితం ఎగ్మూరునుండి ప్రయాణం చేస్తూ లాల్‌గుడి అనే స్టేషనులో దిగినాను. ఉదయం నాలుగు గంటల సమయం. స్వామివారు లాల్‌గుడి స్టేషనుకు మూడు మైళ్ళ దూరంలో కొల్లడంతీరంలో ఉన్న ఒకగ్రామంలో మకాం చేస్తున్నారు. దర్శనార్థమై వెడుతున్నాను. బాట కిరువైపుల కెంకాయతోపులూ, వరిపొలాలూ. మసకమసక చీకటి. వేగు చుక్క పొడిచినా, ప్రాణికోటి ఇంకా నిద్రాభూతంగానే ఉంది. కావేరీ తరంగాలతో ముచ్చటలాడి వాటి శైత్యౌన్నత్యములో అంతర్లీనం చేసుకొని వీస్తున్న పిల్లగాలులు, మహాపురుష దర్శనంవలె మనస్సున కెంతో ఉత్సాహాన్ని, చల్లదనాన్ని ఇస్తున్నవి. స్వామివారి చిరునగవుల సోయగములను తలచు కొంటూ నడుస్తున్నా. ఆ హాసరోచిస్సులకోసం మూడుమైళ్ళు కాదు, మూడు వేలమైళ్ళయినను నడవవచ్చు. వారి స్మేరానన నంలో వాసుదేవస్ఫురణ లగుపడుతవి.

అదొక చిన్న గ్రామం. ఎక్కువ ఉంటే ఏ రెండో మూడో వీధులుంటవి. గ్రామస్థుల జలవసతికోసం కావేరినుండి త్రవ్వితీసిన కాలువలో కాళ్ళనుకడుగుకొని స్వామివారి విడిదికి దారితీసినాను. స్వామి మఠాధిపతి. పరివ్రాజకులు. గ్రామం గ్రామం తిరుగుతూ, ఆశ్రితకోటి చింతాభారాన్ని దూరీకృతం చేయడమే వ్రతంగా పెట్టుకొన్న జీవన్ముక్తులు.

స్వామివారున్నూ అప్పుడే వచ్చి కూరుచున్నారు. వెళ్ళి ప్రణామంచేసి, వారి ఆదరణాపూర్వక పరామర్శకు ఆనందిస్తూ ఆ మితభాషకులవాక్కులు కర్ణగతంకాక ఎక్కడ జారిపోతుందో అన్న ఉత్కంఠతో వారి సమక్షంలో ఆజ్ఞాపితుడనై ఉపవిశించి నాను. మద్రాసులో 1957, 1958 లో స్వామివారు విజయం చేసినపుడు వైదికధర్మంపై ఎన్నో ప్రవచనముల ననుగ్రహించి నారు. అవి అన్నీ అరవపత్రికలలో అప్పటికప్పుడే ప్రకటింప బడి మూడు సంపుటములుగా పుస్తకరూపమునూ దాల్చినవి. సంక్షిప్త అనువాదాలను ఆంగ్ల పత్రికలుకూడ ప్రకటించినవి. కానీ ఆంగ్లమూ, అరవమూ తెలియని ఆంధ్రజనులకు అవి అలభ్యంగా ఉన్నవనీ, వాని అనువాదాల అవసరం ఎంతైనా ఉన్నదనీ, శ్రీవారి ఆజ్ఞ ఐనచో యథాశక్తి నేనే అనువదించెద ననీ మనవిచేసితిని. స్వామివారు సమ్మతినిచ్చుటేకాక, 'ఆంధ్ర ప్రభ' పత్రికవారు వీనిని ప్రకటింపవచ్చుననీ, సంపాదకులకువ్రాసి తెలసికొనవలసినదనీ సూచించిరి. అంతటితో అనువాదముల ప్రారంభింపబడి ఆంధ్రప్రభలో వరుసగా ప్రకటింపబడి, ప్రస్తుతము సాధన గ్రంథమండలివారి సౌజన్యమున పుస్తకరూపము నందుచున్నది.

శ్రీ శ్రీ జగద్గురు చంద్రశేఖరేంద్ర సరస్వతీ శంకరా చార్యస్వామివారు కామకోటి పీఠాధిపత్యాన్ని గ్రహించి ఏబది ఆరేడు లగుచున్నది. గద్దె నెక్కినపుడు వారి వయస్సు పదుమూడేళ్ళు. అట్టి చిరుప్రాయమున పరివ్రాజకత్వమూ, మఠాధిపత్యమూ వహించి కాలక్రమేణ సకలశాస్త్ర పారంగతులై మహామతియై, ఘనతపస్వియై అద్వైతశిఖరాధిష్ఠాతలైరి.

ఆచార్యుల దైనందిన జీవనమే వేదాంతసత్యముల కొక సూత్రభాష్యము. శ్రీవారి కొక్కనిముసము విరామముండదు. గంటలకొలది పూజలు. ఉపవాసమునకు నిర్ణయమైన దినములు కొన్ని. మౌనమునకు నిర్ణీతమైన వేళలు కొన్ని. విధివిరామము లేక దర్శనార్థము వచ్చెడి భక్తకోటికి అంతు ఉండదు. వారెంత వైదిక ధర్మపరాయణులైనను, స్వమత పరమత భేదముకాని, స్వ పర దేశభేదముకాని మచ్చుకైన కానరాదు. సద్గురువునిమిత్తము అన్వేషిస్తూ 1930 లో భారతదేశమునకు వచ్చిన పాల్ బ్రంటను అను ఆంగ్ల దేశస్థుడైన యూధుజాతీయుని భగవాన్ రమణమహర్షుల వద్దకు పంపినది స్వామివారే. వెస్టుమినిష్టరు రాజకీయాలనుగూర్చి స్వామి తడవగా, స్వామి వారి రాజకీయపరిజ్ఞతకు బ్రంటను నివ్వెరపోయెనట. ప్రాచీన శాస్త్రములందేకాక నవీనములపై సహితము స్వామికి మక్కువయే. సార్వభౌమత్వమున్నూ కద్దు.

స్వామి అద్వైతులు కనుక సర్వమతసమానము వారికి సహజగుణము. వారు నిందాస్తుతుల కతీతులు. ఇతరులెంత ప్రకోపించినను, తమ ప్రసాదగుణమును వారు వదలరు. సాధారణ జనానీక మెరిగినది ఒక్కవిషయమే. అది స్వామివారి ఆకర్షణ. ఒకమారు వారిని చూచిన పౌనఃపున్యంగా వారి దర్శనము చేయవలెననెడు ఉత్కంఠత ప్రతియొక్కరికినీ సహజముగా కల్గుతుంటుంది. భక్తజనుల సాంసారిక కష్టములను వారు కడుశ్రద్ధతోను సాదరముగాను విని తమకు దోచిన సలహాల నిత్తురు. మనోనుకూలముగా మాటలాడి దీవించి ప్రసాదమునిచ్చి ప్రసాదచిత్తులనుచేసి పంపుదురు,

ఆచార్యుల మానస హంసిక ధ్యానమగ్నమై అద్వైత వీధుల విహారణచేయుగా వారికరాబ్జములు సగుణబ్రహ్మమును ఆరాధించును. ఈశ్వరారాధనకు దేశ కాలవర్తమానాదుల వారికడ్డులేదు. శ్రద్ధాభక్తులతో స్ఫటికలింగమును ఆయన క్షీర ధారలచే అభిషేకించి పుష్పాదులతో అలంకరింతురు. 'లోకా స్సమస్తా స్సుఖినో భవంతు' అనెడి ప్రార్థనతో అనుదినమూ వారి పూజ ముగియును.

స్వామివారి తపశ్చర్య అసమానము. ఆ తపోబలిమి వారి అనుగ్రహాశక్తిలో లీనమై అతులిత మహిమాన్వితము లైన వారి దీవెనలలో ప్రతిఫలించును. ఆయన కామకోటి పీఠాధిపతి. తదధిష్ఠాన దేవత శ్రీ కామాక్షి. విశ్వంభరియు, జగ న్మాతయు నగు శ్రీ కామాక్షీ కరుణాకటాక్షనిర్ఝరి ఆచార్యుల అనుగ్రహరూపాన్ని దాల్చి భవతప్తులమునూ, శోక దుఃఖ విమోహితులమునూ అగు మన జీవనమరుభూములను సుశ్యా మల మొనర్చి జ్ఞాన భక్తి వైరాగ్యము లనెడి పంటలను పండించుచున్నది.

స్వామివారు తఱచు బోధించునది శివవిష్ణువుల అభేదత. హైందవమున అర్చామూర్తి బాహుళ్యమున్ననూ, అవి పర మేశ్వరుని విభూతియొక్క విభిన్నాంశములేయని జగద్గురువులు బోధింతురు. పారమార్థిక చింతన శైశవమునుండియే పట్టుబడ వలెననియూ, భగవదారాధనతో చిత్తనైర్మల్యముకలిగి సకల దుఃఖములనూ తృణీకరించగల జ్ఞాన మేర్పడుననియూ స్వామి వారు సెలవిస్తారు. విహితకర్మాచరణము ప్రధానము. అది అతీంద్రియ రహస్యాలను అవగతము చేసుకొనుటలో సాయ

పడును. 'మన్మనాభవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు' అన్న గీతావాక్యాన్ని స్మరిస్తూ స్వామివారి పాదములను నమ్ముకొన్నవారి యోగక్షేమాలను స్వామివారే చూచుకొంటారు. సత్కర్మలను సర్వకాలాలలోను మనం చేస్తుంటే ఆ కర్మయే అకర్మణ్యతకు సాధనమవుతుంది.

కర్తవ్యము, జగద్గురు ప్రబోధముల నాలకించి యథాశక్తి ఆచరణలోనికి దేవటమే. వ్యక్తిగతంగా మన వర్తన చక్కబడితే సమాజమూ చక్కబడుతుందనీ, మోక్షమంటే పారలౌకికం కాదనీ, చిత్తశాంతియే మోక్షమనీ స్వామివారు సెలవిస్తారు. వేదాంత దేశికులును, గురుపాదులును అగు శ్రీ కామకోటి చంద్రశేఖరేంద్ర సరస్వతుల ప్రబోధమనే జ్ఞానగంగలో మనమందరమూ సుస్నాతులమై అమృతపుత్రులము కావలెననుటయే నా వాంఛ. ఆ వాంఛ నెరవేరడానికి స్వామివారు అనుగ్రహించాలి.

ఇత్యేషా వాఙ్మయీ పూజా, శ్రీమచ్ఛంకర పాదయోః,
అర్పితా తేన మే దేవః, ప్రీయతాం చ సదాశివః.

జయ జగదంబ శివే
జయ కామాక్షి జయ జయాద్రి సుతే,
జయ మహేశ దయితే
జయ జయ చిద్గగన కౌముదీ ధారే.

'శివశంకర దేశిక మే శరణం'

బొంబాయి
శోభకృత్-విజయదశమి

"విశాఖ"
(యం. వి. బి. యస్. శర్మ)

# మనవి - మాటలు.

సర్వశ్రుతి శిరోరత్న సముద్భాసితమూర్తయే,
వేదాంతాంభోజ సూర్యాయ తస్మై శ్రీ గురవే నమః॥

అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానాంజనశలాకయా,
చక్షు రున్మీలితం యేన తస్మై శ్రీ గురవే నమః॥

సర్వతోముఖవిజ్ఞానవిలసితమై, విశ్వరచనారహస్యాలను పరిశీలించి పైకి కానవచ్చే భిన్నత్వంలో ఏకత్వాన్ని చూచి నిరూపించిన సమన్వయదృష్టి మనవారిది. ఈ విధమైన అంతర్దృష్టిసమన్వయ దృక్ఫలితమే అద్వైతం. ఈ అద్వైతసిద్ధాంత నిరూపణ ఉపనిషత్తులలో పరాకాష్ఠ నందుకొన్నది. ఇదే భారతీయ వేదాంతం. భారతీయ జీవనవిధానానికి, సాంఘికవ్యవస్థకు జీవగఱ్ఱ అయిన ఈ వేదాంతానికి రూపుదిద్దిన మహనీయులు శ్రీ భగవత్పాదులు ఆదిశంకరాచార్యులవారు. పరమాత్మకూ, జీవాత్మకూ భేదం లేదు. ఈ రెండూ ఒకటే. పరమాత్మ నిర్గుణం అని బోధిస్తుంది. అద్వైతం 'ఏకమేవా ద్వితీయం బ్రహ్మ' 'ఏకం సద్విప్రా బహుధా వదంతి' 'సర్వం ఖల్విదం బ్రహ్మ' 'జీవో బ్రహ్మైవ నాపరః' 'తత్త్వమసి' వంటి వాక్యాలన్నీ అద్వైతసిద్ధిని చెపుతాయి జీవాత్మ పరమాత్మరూపమే. అయితే మాయాసంబంధంచేత జీవాత్మ ఈ సత్యాన్ని గ్రహించడంలేదు. జ్ఞానంద్వారా ఈ సత్యాన్ని గ్రహించగల్గుతుంది. ఈ జ్ఞానంపొందిన జీవాత్మ మోక్షం పొందగలుగుతుంది. అంటే పరమాత్మయై ఊరకుంటుంది. ఇదే సిద్ధాంతాన్ని భగవద్గీత కూడా ప్రతిపాదించింది.

ఇలాంటి జ్ఞానం పొందడం ప్రపంచలో అందరికీ సాధ్యం కాదు. అందుచే పరమాత్మకు రూపం కల్పించుకొని ఇష్ట దేవతగా భావించుకొని ఆ దేవత నారాధించడంద్వారా సంసారులు క్రమశః జ్ఞానంపొంది మోక్షసిద్ధికి ప్రయత్నించవచ్చు.

జగద్గురువుల అవతరణకు పూర్వం మన దేశంలోని హిందువులలో తొంభై ఆరు విభిన్నమతా లుండేవి. వాటిని ఆచార్యస్వామి ఆరింటిగా వర్గీకరించారు (1) శైవులు, (2) వైష్ణవులు, (3) సౌరులు, (4) శాక్తేయులు, (5) గాణపత్యులు, (6) కాపాలికులు. అందుకే ఆయనను "షణ్మత స్థాపకః" అని కూడా అంటారు. శ్రీ శంకరునికి పూర్వమే అద్వైతమతానికి పునాదివేసినవాడు గోవిందుడు. ఈ గోవిందుని గురువు గౌడ పాదుడు. వీరి పరమగురువు బాదరాయణుడు. ఈ బాదరాయణు డే వ్యాసదేవులు. మాండూక్యఉపనిషత్తుకు వ్రాసిన కారికల లోనే అద్వైతసిద్ధాంతానికి బీజావాపన జరిగింది. కాని దీనిని ఒక సిద్ధాంతంగా రూపొందించి జగత్తంతా ప్రచారం చేసిన వారు — 'జగమంతా మాయ, పరమాత్మ లీల' అని ఉప నిషత్తులలో మాయ మాయగా ఉన్న మాయాసిద్ధాంతాన్ని విపులపరచి, అద్వైతంలో ఒక అంతర్భాగంగా రూపొందించి ఒక మతంగా బోధించిన మహనీయుడు — శంకరులే.

చిన్నతనంలోనే సన్యాసాశ్రమాన్ని స్వీకరించి విద్యాభ్యాసం పూర్తికాగానే వేదాంతబోధకు పూనుకొని దేశమంతటా సంచారంచేసి, దిగ్గజాలవంటి పండితప్రకాండులను వాదనలో ఓడించి, అన్నిప్రాంతాలలోను అద్వైతపీఠాలను సంస్థాపించారు. వీటినే శంకరమఠాలనికూడా అంటారు. అటువంటి

మఠములు శృంగేరి, కాశీ, పూరీ, ద్వారక, కంచి, బదరీనారాయణ, పుష్పగిరి మొదలగుచోట్ల ఉన్న సంగతి అందరకూ తెలిసియున్నదే. ఆదిశంకరులు రచించిన గ్రంథాలలో ఉపనిషద్భాష్యాలు, వేదాంతసూత్రభాష్యం, భగవద్గీతాభాష్యం, సర్వసిద్ధాంత సంగ్రహం, వివేకచూడామణి, శివానందాదిలహరులు ముఖ్యమైనవి.

ఈ విధంగా శ్రీ శంకర భగవత్పాదులు ప్రతిపాదించిన అద్వైతజ్ఞానాన్ని పరంపరాగతంగా ప్రచారంచేస్తున్న సంస్థలలో కంచి కామకోటి పీఠంకూడా ఒకటి. దీని ప్రస్తుత అధిపతి జగద్గురువులు శ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతీ శంకరాచార్యులవారు. శ్రీ స్వామివారు హిందూధర్మ పునరుద్ధరణకు నిరహంకారంగా, నిష్పక్షపాతంగా, నిర్విరామంగా కొనసాగిస్తున్న సేవ అద్వితీయమైంది. సర్వసంగ పరిత్యాగి అయ్యు, పరమహంస పరివ్రాజకులయ్యు, కర్మపరిత్యాగం చేసిన జీవన్ముక్తులయ్యు సంసారులకు మార్గదర్శకంగా ఉండేనిమిత్తం సమస్తకర్మలను నిష్కామంగా ఆచరిస్తూ రూపెత్తిన హిందూ ధర్మంవలె, నిరంతర అవిరళ పదయాత్రలద్వారా జీవయాత్రను లోకహితకరంగా సాగిస్తున్న ధర్మావతారులాయన. ఆయనలోని శిశుసారళ్యం, ఆనంద పారవశ్యం, పరిపక్వ పరిజ్ఞానం చూపరులను ఇట్టే సమ్మోహితులను చేస్తాయి. శిశువుల సారళ్యాన్ని పుణికిపుచ్చుకొన్న ఆయన మధురమందహాసం — 'ఆర్థర్ కోయిస్లర్, పాల్ బ్రంటన్' వంటి పాశ్చాత్య మేధావుల మనస్సులపై చెరగని ముద్రగా నిలిచిపోయింది. జ్ఞానవయోవృద్ధులైన స్వామివారి ప్రశాంత వదనసీమలో మనకు

గౌరీశంకరశిఖరంపై ప్రాభాతవేళ కానవచ్చే ఉషోరాగం, హరిద్వారంలో కానవచ్చే స్వచ్ఛ సుందరమైన భాగీరథీప్రవాహం, మందమలయానిల సుఖస్పర్శ, పాదోధిమధ్యంలోని ప్రశాంతత కానవస్తాయి. శ్రీ స్వామివారు అత్యున్నత ఆధ్యాత్మిక శిఖరాగ్రస్థితు లయినప్పటికీ సర్వులకూ సులభ దర్శనులు. మాటల వేదాంతి కాదు; మరి చేతల వేదాంతి. అనుక్షణ నిష్కామ కర్మయోగిఅయిన స్వామివారి ఉనికిప్రభావం దక్షిణదేశమంతటా సర్వత్రా కానవస్తోంది. సందర్శన కుతూహలులయిన శిష్యగణం తెల్లవారకుండగనే వేలాదిగా గుమిగూడి తమ భక్తిప్రపత్తులను మౌనంగా వెల్లడించుకుంటూ ఉంటారు. మందహాస మధుర మంజులమైన ఆయన మౌనవ్యాఖ్య — బహువిధ శోకసంకులమైన శిష్యకోటికి అభయదానంగా, శ్రీరామరక్షగా భాసిస్తోంది. నిజానికి దుఃఖోద్విగ్నమైన నేటి ప్రపంచానికి ఆయన అందించిన ఆశాసందేశం సృష్టిరహస్యాన్ని విడమర్చి చెప్పే సత్యవ్యాఖ్యానం. సర్వవిధ పాపాలకు, దుఃఖాలకు నివృత్తికరమైన ఆత్మసాక్షాత్కారానికి స్వామివారి ఉపదేశాలు రాజమార్గం.

శ్రీ స్వామివారు బహుభాషావేత్తలు. లక్షలాదిశిష్యుల మనోభావాలను త్రుటిలో గ్రహించి వారివారి మాతృభాషలలోనే వారందరికీ సుబోధకము, సుగ్రహము, సులభసుందరమైన సరళభాషలో అల్పాక్షరముల అనల్పార్థమును ఇమిడించి హితమితవచనాలతో తనియించిపంపించే శిష్యవత్సలు డీయన.

"హిందూమతం అని చలామణి అవుతూన్న మతంలో అనేక లోపాలున్నవని అంటూవుంటారు. అయితే దానికిగల మూల నిత్య సత్య సుగుణాలు అసంఖ్యాకాలు. కనుక మనం ఈ మంచిని గ్రహించి ఆదర్శమానవులుగా మన ఉనికిని సార్థకం చేసికోవడం ఉభయతారకం కదా" అని స్వామివారు చెప్పుడూ ఉద్బోధిస్తూంటారు.

జ్ఞానంతోనే మనుష్యజన్మకు శోభ. "భూషలు కావు మర్త్యులకు భూరిమయాంగద తారహారముల్" మానవునకు జ్ఞానమే మహాభూషణం. జ్ఞానహీనుడు ద్విపాదపశువు. రూపాన్ని బట్టి వెదురుకర్రకు, రసాన్ని బట్టి చెరుకుగడకు విలువ కలిగినట్లే మనిషికి విలువ తాను సంపాదించిన జ్ఞానాన్ని బట్టే. జ్ఞానం వికసించేకొలది మానవజన్మ శ్రేష్ఠత హెచ్చుతుంది. నిజానికి జ్ఞానంవంటి పవిత్రవస్తువు లేదు. అజ్ఞానంవంటి అపవిత్రవస్తువు లేదు. అన్ని క్షేత్రములలోను ఒకే క్షేత్రజ్ఞుణ్ణి చూడడం జ్ఞానం. అనగా భిన్నభిన్నమైన క్షేత్రాలలో ఉపాధులలో అభిన్నమైన క్షేత్రజ్ఞపురుషుణ్ణి, ఆత్మదేవుణ్ణి దర్శించడమే జ్ఞానం. కనుక అభిన్నదృష్టి జ్ఞానం. శివదృష్టి జ్ఞానం. శవదృష్టి అజ్ఞానం. ఒక జ్ఞానం జ్ఞానం. అనేకజ్ఞానం అజ్ఞానం. అపరోక్ష సాక్షాత్కారజ్ఞానంచే శోక మోహ రూపమైన సంసారసాగరాన్ని తరించడం సులభం. ఆత్మ తానేనని ఎరగడం జ్ఞానం. ఆత్మే పరమాత్మ అని తెలియడం విజ్ఞానం. ఈ జ్ఞానవిజ్ఞాన సిద్ధికొరకు అవశ్యానుసరణీయమైంది సాధనమార్గం. ఈ సాధనకు ఉపకరించు ప్రధానగ్రంథం — 'సాధన గ్రంథమండలి' ప్రచురించిన శ్రీ కంచి కామకోటి జగద్గురు శ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతీ

శంకరాచార్యస్వామివారి బోధనరూపమైన ఈ "జగద్గురు బోధలు". ఈ ఉద్గ్రంథాన్ని జిజ్ఞాసువులు, ముముక్షువులు అయిన ఆంధ్రమహాజనుల కరకమలాలకు అందించగలుగుటకు సాధనగ్రంథమండలి ఎంతో వినయంతో సాధనచేస్తున్నది.

ఏ మహాశక్తి – కుంటివాడిచేత మహోన్నతపర్వతాన్ని దాటింపచేస్తుందో, మూగవాణ్ణి మహావక్తగా మార్చుతుందో, అల్ప వానరాలను మహావీరులుగా మార్చి ధర్మవిజయానికి తోడ్పడేటట్టు చేసిందో, కిరాతుడైన వాల్మీకిచేత ఆదికావ్యమైన రామాయణాన్ని రచింపచేసిందో – ఆ దివ్యశక్తే జగద్గురువుల అనుగ్రహరూపంలో మా చేత ఈ జగద్హిత గంభీర కార్యాన్ని చేయించింది. ఆంధ్రప్రభలో ప్రచురించిన వ్యాసములను మా సాధనగ్రంథమండలిలో గ్రంథరూపంగా రూపొందించుటకు తమ ఆమోద అంగీకారములను వెలిబుచ్చి, శ్రీవారి చిత్రములనుగూడ అనుగ్రహించి సహకరించిన ఆంధ్రప్రభా సంపాదకులు శ్రీ నీలంరాజు వెంకటశేషయ్యగారికి మా ధన్యవాదములు. సహృదయులు, ఆప్తమిత్రులు, శ్రీవారి బోధలు ఆంధ్రమున అనువదించినవారు అగు "విశాఖ" గారికి మా కృతజ్ఞతలు. ఆంధ్రప్రభలో ప్రచురించిన వ్యాసములను పరిశోధించియు, వ్యాసములలో శ్లోకములకు అర్థములు వ్రాసియు ఇచ్చిన శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారికి కృతజ్ఞతాపూర్వక నమస్కారములు. ఇక జానకిరాంప్రెస్ వారి తోడ్పాటుచే ఈ

గ్రంథము ఇంత త్వరగా సర్వాంగసుందరముగా వెలువరించ గలిగినందులకు క్షేమము సర్వదా వారికి కృతజ్ఞులము.

చైతన్యం శాశ్వతం శాంతం వ్యోమాతీతం నిరంజనం,
నాదబిందు కళాతీతం తస్మై శ్రీ గురవే నమః॥

శ్రీమత్పరం బ్రహ్మగురుం వదామి
శ్రీమత్పరం బ్రహ్మగురుం భజామి,
శ్రీమత్పరం బ్రహ్మగురుం స్మరామి
శ్రీమత్పరం బ్రహ్మగురుం నమామి.

శోభకృత్
విజయదశమి

బులుసు సూర్యప్రకాశశాస్త్రి
వ్యవస్థాపకుడు : సాధన గ్రంథ మండలి.

—•—

# విషయానుక్రమణిక



శ్రుతి స్మృతి పురాణానా మాలయం కరుణాలయమ్,
నమామి భగవత్పాదం శఙ్కరం లోకశఙ్కరమ్॥

ఓమ్

శ్రీ జగద్గురుభ్యో నమః

# జగద్గురు బోధలు

## జగన్మాత - జగత్పిత.

వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే,
జగతః పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ.

మహాకవి కాళిదాసు రఘువంశం అనే కావ్యం వ్రాస్తూ పై మంగళశ్లోకము వ్రాసినాడు. జగతః అనగా లోకమునకు ఈ ప్రపంచమునకు పార్వతీపరమేశ్వరులు మాతాపితరులవలె ఉన్నారని ఆమహాకవి అన్నాడు. ఇదేవిధంగా భగవత్పాదులవారున్నూ,

మాతా చ పార్వతీదేవీ పితా దేవో మహేశ్వరః,
బాంధవా శ్శివభక్తాశ్చ స్వదేశో భువనత్రయమ్.

అని ఒకచోట సెలవిచ్చినారు.

'పశుః' అన్న పద మున్నది. ఇందు రెం డక్షరము లున్నవి. ఈ రెండక్షరములనూ విన్నతోడనే మనమనస్సులలో ఒకరూపు గోచరిస్తున్నది. ఆపదము నిర్దేశించే వస్తువుయొక్క రూపు జ్ఞప్తికి వస్తున్నది. ఈ రెండు అక్షరములూ ఒక చిహ్నము లేక సంకేతము. 'పశువు' అనగనే ఆవు జ్ఞప్తి

కొస్తున్నది. లేదా అవును చూచినతోడనే దానికి సంకేతమైన పశుశబ్దము మనస్సునకు తట్టుతున్నది. వీనికి అవినాభావ సంబంధ మున్న ట్టున్నది. వీనినే నామరూపము లని పేర్కొంటున్నారు. వీనిలో ఒకదానినుండి మరొకదానిని మనము వేరు చేయలేము. ఒకటి వాక్కు, మరొకటి దాని అర్థము. ఈ వాగర్థములు ఎట్లు సంపృక్తములై యున్నవో, అనగా ఒక దానితో మరొకటి వదలక చేరియున్నవో, అట్లే పార్వతీ పరమేశ్వరులు ఒకరి నొకరు వదలక, జగన్మాతా జగత్పితలై ఉన్నారనీ, వారికి నావందనములనీ కాళిదాసమహాకవి మంగళా చరణం చేస్తున్నాడు. ఇదే అర్ధనారీశ్వరతత్త్వము. ఇటు చూచిన అంబిక అటు చూచిన పరమేశ్వరుడు. సంస్కృతభాషా భ్యాసం చేసే వారందరూ ఈ శ్లోకాన్ని చెప్పి మరీ నమస్కరిస్తారు.

మనకు రూపు నిచ్చేది మనతల్లిదండ్రులు. దేహమునకు కారణభూతుడు తండ్రి, పుష్టి నిచ్చే ఆహారమిచ్చి పోషించేది తల్లి. దేహానికి పుష్టినిచ్చే వస్తువు ఆహారము. ఎట్టి కొరతయూ లేకుండా, ఆత్మకు పుష్టి నిచ్చేవారెవరు ? ఆత్మ యనగా ప్రాణము. ప్రాణమునకు ఏది పుష్టి? ఆనందమూ, జ్ఞానమూ.

దేహధారణ ఏనాడు చేసినదో, ఆనాటినుండీ ప్రాణమునకు కష్టములే. అనగా ఈ కష్టములకంతా కారణము జన్మ లేక దేహధారణ మరొక జన్మ నెత్తిన మరి ఇన్ని కష్టములు. కన్నతండ్రి ఏదో సంపాదించి ఇంత నిలువచేసి పోయినాడు అని దేహమునకు శ్రమ లేదనుకొన్నా ఆత్మకు ఎన్నో కష్టములూ, శ్రమలూ, అవమానములూ, దుఃఖములూ. దేహ

మునకు గాని, ఆత్మకుగాని, ఏ విధమైన కష్టమూ ఉండ కూడదు అని అనుకొంటే, జన్మ లేకుండాపోవలెను. జన్మ ఎత్తితిమా ఆనందము స్వల్పము, దుఃఖము అధికము.

దుఃఖస్పర్శ లేక, ఏకాలములోనూ, ఆనందముగా నుండునట్లు చేయునది ఆత్మ. అందరి ఆత్మలకున్నూ పుష్టిని, ఆనందాహారములనుఇచ్చునది పరాశక్తియు, పరమేశ్వరుడును. ఆమె జగన్మాత, ఆయన జగత్పిత. వారిని శరణొందిన కాని జన్మ లేకుండాపోదు. జన్మరాహిత్య మనగా నిరవధికానందమే. జన్మ కల్గినదన్న ఆనందమునకు ఒక కొరత అని అర్థము. ప్రాణము లేక ఆత్మకు, ఆహారము అనగా పుష్టి, ఏమిటి అని ఆలోచించుచో ఎప్పుడున్నూ ఆనందముగా నుండుటయే. ఆ ఆనందమును ఇవ్వగలవారు తల్లిదండ్రులే. కొందరు ఈశ్వరో పాసననూ, కొందరు దేవీ ఉపాసననూ, మరికొందరు ఇద్దరినీ చేర్చియూ ఉపాసన చేయుదురు.

ఐనచో వీరివద్దకు వెళ్ళవలసిన అవసరము? వ్యాధితో బాధపడుతున్న వ్యక్తి వైద్యునివద్దకు వెళ్ళుతున్నాడు. ద్రవ్యము లేనివాడు యాచనమునకో, చేబదులునకో, శ్రీమంతుని వెదకుకొంటూ వెళ్ళుతున్నాడు. ఒక్కొక్క పని కోసం ఒక్కొక్కరివద్దకు వెళ్ళవలసి ఉంటున్నది. మనకు ఇది లేదు, అదిలేదు అన్నకొరత, మనలను ఫలానావాడు అవమా నించినాడు తగిన మర్యాద చేయలేదు అన్న దుఃఖమూ జన్మతః వచ్చినది. ఈ కొరతలను మనము పోగొట్టుకోవలె నంటే, మనస్సునకు ఒక పూర్ణత్వం సిద్ధించాలంటే, పరమేశ్వ రుని వద్దకు వెళ్ళవలె.

ఎప్పుడూ మనస్సున కొక చింత. దీనికి కారణమేమిటి? జన్మ. ధనములేనివాడు యాచనకు ధనికునివద్దకు వెళ్ళినట్లే, జన్మ ఇక మనకు వద్దు అని అనుకొన్నవాడు, జన్మలేనివాని వద్దకు వెళ్ళవలెను. అతని అనుగ్రహమాత్రమున జన్మరాహిత్యము సులభముగా మనకు సిద్ధించును. జన్మ లేనిచో చింత లేదు. అందుచే, జనన మరణములులేని ఈశ్వరునికడకు, పార్వతీ పరమేశ్వరులకడకు మనము పోవలెను.

మన కందరికిని చావుపుట్టువు లున్న వని తెలియును. పుట్టుకకు కారణము కామము. చావునకు కారణము కాలుడు. కామ కారణంగా కల్గిన వస్తువు కాలగ్రస్తమై నశిస్తున్నది. కామ వీక్షణంతో మోడుకూడా చిగిరిస్తున్నది. కాలదర్శనంతో శుష్కించి ఎండిపోయి జీర్ణిస్తున్నది. 'కాలో జగద్భక్షకః' కాలమువచ్చినదంటే, సూర్యచంద్రాదులున్నూ నశిస్తున్నారు.

కామములేకపోతే ఉత్పాదన లేదు. కాలములేకపోతే వినాశము లేదు. ఈ రెండిటినీ మనం జయించాలంటే పరమేశ్వరునివద్దకు వెళ్ళాలి. ఇట్టి అసామాన్యమైన వరాన్ని ప్రసాదించగల ఆ వరప్రసాది ఎల్లున్నాడు ? ఆయన.

కాముని కంటితో నీఱు చేసినాడట
కాలుని కాలితో తన్ని వేసి

మన్మథుని దృష్టిమాత్రమున దగ్ధమొనర్చినవానికి, కాలుని, కాల దన్నిన కాలకాలునికి, ఉత్పత్తి వినాశములు లేవు. ఆయన ప్రసాదమున్నయెడల మనకున్నూ పుట్టుటకాని, గిట్టుటకాని ఉండదు.

పరమేశ్వరు డొక్కడు చాలడా? అంబిక అవసరమేమిటి? పార్వతీపరమేశ్వరులు వాగర్థములుకదా! ఈశ్వరుడు కామనిగ్రహము చేసినది లలాటనేత్రముతో. అర్ధనారీశ్వర ప్రకృతులగు వీరికి మూడవ కన్ను ఉమ్మడి. అందులో ఆయనకు సాబాలు, ఆమెకు సాబాలు. కాలుని తన్నినది వామపాదముతో. ఆపాదము అంబికది. అందుచే కామవిజయమునకునూ, కాలనిగ్రహముకునూ దేవి అనుగ్రహము సైతము ఉండవలెను. మనము జన్మ వద్దనుకొన్న ఈ పురాణదంపతుల నిరువురినీ చేర్చి ఉపాసన చేయవలెను. ఏక శరీరులై యున్నందున మనకార్యము సులభమైనది. వారి అనుగ్రహ మున్న చాలును. చావుపుట్టుకల బాధ మన కుండదు.

సంగీతముద్వారా భగవదుపాసన చేసినవారిలో ముత్తయ్య దీక్షితులు, త్యాగయ్య, శ్యామశాస్త్రి యనెడు ముగ్వురు గాయకశ్రేష్ఠు లున్నారు. దీక్షితులవారు నవావరణ కీర్తనలను వీణపై పాడి, దేవిని ఆరాధించేవారు. శ్రీచక్రార్చన చేసేవారు. సంగీతమం దభిరుచి యున్నవారి కీ విషయము తెలిసియుండును. ఒకనాడు దీక్షితులవారు, ఆలాపన చేస్తూ అందే మగ్నులై యుండిపోయిరి. కార్తిక అమవాస్య. 'శ్రీ మీనాక్షి మే ముదం దేహి' అనే చరణాన్ని పాడుతున్నారు. పాటకొసలో 'పాశమోచనీ' యని వచ్చును. 'ముదం దేహి పాశమోచనీ' అని పాడుతున్నపుడే వారిశ్వాస అట్లే నిలిచిపోయింది. మరణదుఃఖమే లేదు. సంకీర్తన మొనరిస్తూ తన్మయులైపోయిరి. సదా దేనికై అర్థిస్తూ ఉండిరో, ఆ వస్తువే

ఐపోయిరి. మరణ మనునది లేక, ఆనందమున లయించి, జనన మరణ రహితస్థితిని పొందిరి.

చావుపుట్టుకలు రెండున్నూ దుఃఖకారకములే. జనన నివృత్తిని వెదకికొంటూ, జగన్మాతా జగత్పితలయిన పార్వతీ పరమేశ్వరులను స్మరిస్తూ 'జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ' అని మన మందరమూ శరణు పొందవలెను.

# అ ద్వై త సి ద్ధాం త ము

ఆదిశంకరులు ప్రతిపాదించిన సిద్ధాంతమునకు అద్వైత మని పేరు. శంకరులకు పూర్వము సయితము కొందరు ఈ అద్వైతసంబంధముగా వ్రాసిరి. శంకరుల అనంతరము అద్వైతానుభవసిద్ధులు అనేకులు తమతమ స్వానుభవములను ఉపనిషదుపదేశములతో చేర్చి ప్రబంధముల నెన్నియో వ్రాసిరి. వారు తమ అనుభవముల నితరులకు దెలియపరచు సందర్భమున కడపట "అంతా ఒకటే" అనే తత్త్వమును గూర్చి, గ్రంథము లనేకములు వెలువరించిరి. ఇట్లు అద్వైతసిద్ధాంతమునకు పుస్తకములు కొల్లలు.

అద్వైతగ్రంథము లన్నిభాషలయందును గలవు. సంస్కృతమున కలవు. తమిళమున మూలగ్రంథములే ఎన్నో వున్నవి. తెనుగునందును మూలగ్రంథములు కలవు. కన్నడ భాషయందును సరే. ప్రాంతీయభాషలలో అనుభవజ్ఞులు,జ్ఞానులు స్వతంత్రముగా ననేక పుస్తకములు వ్రాసిరి. అద్వైతగ్రంథములు మరాటీ, హిందీలలో సయితము చూడనగును.

అద్వైతమతమందే పరంపరగా వచ్చువారు అద్వైత మతమును శ్లాఘించి గ్రంథములు రచించుట అటుంచి, ఇతర మతస్థులు సయితము తమతమ స్వరూపానుభవముల తుది మెట్టు అద్వైతముగా వ్రాయుట విశేషము. ఇటుల అనేకు లనేక గ్రంథములు రచించిరి.

తమిళమున 'మస్తాన్‌సాహెబ్ పాట'లను నొక పుస్తక మున్నది. ఇది 'తాయుమానవర్' వ్రాసిన పాటలవలె ఉం డును. అద్వైతానుభవము తెలుపు పాటలు ఇందనేకము. మాధ్వులకు చెందిన తత్త్వరాయస్వామి యను గొప్పవా రొకరు 'శశివర్ణబోధము'అను గ్రంథమును, మరికొన్ని పాటలను వ్రాసియున్నారు. వేదనాయకంపిళ్ళె యనునతడు క్రైస్తవుడు. మున్సిఫ్ ఉద్యోగము చేసెడివాడు. ఆత్మానుభవమును చాటు పెక్కు గ్రంథము లీయన రచించెను. చరిత్రరూపమునగాని, పాటలరూపమునగాని, దేనిని వ్రాసినను, ఈయన అద్వైత తత్త్వమునుగూర్చి గొప్పగ చెప్పెను. వీరి గ్రంథములం దద్వైత తత్త్వము ద్యోతకమగును. ఇటీవల ఎ. వి. గోపాలాచారియార్ అనునాయన కొన్ని గ్రంథములు వ్రాసిరి. ఈయన మరణావ సానమువరకును ఆత్మచింతన యొనర్చిన వ్యక్తి. ఇట్లు పరం పరలుగా అద్వైతసిద్ధాంతావలంబకులు అద్వైతమునుగూర్చి వ్రాయుటయేకాక ఇతరమతస్థులుకూడా తమగ్రంథములందు అద్వైతానుభూతిని ప్రకటించియున్నారు.

కాని ఆదిశంకరులన్న అందరికి ఒకవిధమయిన ప్రీతి. ఏ మతస్థులకైనను వీరన్న ఒక విధమయిన ప్రేమ, గౌరవము.

వీరి సిద్ధాంతమునందును ఒకానొక ప్రీతి. ఇది నా అనుభవమున దెలిసికొన్న విషయము.

వాదనకు వచ్చువారుకూడా శంకరుల గ్రంథములే ఖండింతురుగాని, ఇతర మతగ్రంథములను దీసికొనరు.

మన దేశమున నింతవరకు వున్న సిద్ధాంతము లెన్నియో! మాధ్వసిద్ధాంతము, రామానుజసిద్ధాంతము, శైవసిద్ధాంతము, ఇవి కాక ఉత్తరదేశమున గుజరాత్ బొంబాయి ప్రాంతముల వల్లభాచార్యసిద్ధాంతము, సంస్కృతమున శ్రీకంఠాచార్యసిద్ధాంతము, తమిళమున శివాచార్యునిసిద్ధాంతము అను కొన్ని సిద్ధాంతములు కలవు. వీనిలో పరస్పరము భేదము స్వల్పము.

ఈశ్వరభక్తి, ఈశ్వరసాయుజ్యము అనుటలో ఏ సిద్ధాంతమునకూ అభిప్రాయభేదము లేదు. శంకరులు చెప్పిన రీతి ఈశ్వరభక్తిచేత ఈశ్వరసమాగమముతో ఆయన స్వరూపముతో నైక్యమగుదుము. మనము ఆయన అను బేధము లేక కలసి పోయెదము. ఆపరమాత్మ స్వరూపముతో నైక్య మగుటయే ఆనందమని భగవత్పాదుల సిద్ధాంతము.

అట్లు పూర్తిగా కలసిపోయిన మన మెట్లు ఆనందము అనుభవింపగలము? అనుభవింపలేక పోవుదుమే! అందుచే ఈశ్వరునితో మనము చేరునపుడు మనము వేరు, ఆయన వేరు, అనియే తలంచెదము. ఆనందము నిచ్చువాడు ఆయన అగు నెడల ఆనందానుభూతి నొందు మనము వేరుగా నుండవలెను గదా యని యొక స్వల్పబేధ ముంచుకొని యింకొక సిద్ధాంతము వెలువడెను.

కలసిపోదుము కాని, నీళ్ళలో కలిసిన పాలవలె కొంత వేరుగనేయుందుము అని మరొకరు. ఏ సిద్ధాంతమైనను సరే భక్తి నలవరచుకొని ఈశ్వరపాదాబ్జముల చేరుదము అన్న విషయములో ఎక్కడా భేదముండదు. ఈశ్వరునితో కలిసి నపుడు మనకు ఆనంద మేది ? సముద్రతీరమున నిలుచుండి ననే అలలను అందములను చూడవచ్చును. సముద్రముతో కలసిపోయిన, ఆనంద మేది ? అని కొంత కొంత భేదము కల్పించుకొని, తమ తమ మతములను కొందరు పైకి లేవ దీసిరి. రైల్వేజంక్షనులో ఒకపట్టానుంచి మరొక పట్టా కేగు నపుడు మొట్టమొదట మధ్యలోని దూరము కొంచెమే. దూరము పోను పోను, త్రోవలు వేరు వేరు. మధ్యనున్న దూరము అధికమగుచునేయుండును. కడకు అధికతమమగును. కాని ప్రారంభదశలో మధ్యదూరము స్వల్పమాత్రమే.

వల్లభాచార్యులని, చెప్పితినే, వారికి బాలకృష్ణమూర్తి యందు ప్రీతి అధికము. రామానుజాచార్యులకు నారాయణ స్వరూపమందు అధికప్రేమ. మధ్వాచార్యులు 'విష్ణు విష్ణు' అని యనును. శ్రీకంఠాచార్యులకు శైవులకు శివస్వరూపమునందు ప్రేమ. ఇటుల కొన్ని స్వరూపములు కొన్ని సిద్ధాంతములు కొందరాచార్యులు భిన్నులుగా కనబడుతారు. తమ ఉపాసనా మూర్తి గూర్చికాని, తమ సిద్ధాంతములగూర్చికాని, నిర్ధా రించు పుస్తకములు వ్రాయునపుడు మధ్వులు వైష్ణవసిద్ధాంత ములను, వైష్ణవులు ఐకమత్యముల సిద్ధాంతములను ఖండించ వచ్చునుకదా ! కాని వీరెల్లరు శంకరులు ఇట్లు చెప్పిరి, అట్లు చెప్పిరి, ఇది తప్పు, అది తప్పు అని వారిపైకే దాడి చేసిరి,

మీమాంసనో, సాంఖ్యమునో ఖండించి వుండవచ్చును. కాని వెదకి వెదకి తప్పులు పట్టుటకు, చర్చచేయుటకు, తక్కిన మతములు తగిన యోగ్యత కల్గినవిగా వారికి కనపడ లేదు. బౌద్ధులు వ్రాసిన పుస్తకములలోను, జైనులు వ్రాసిన పుస్తకములలోను అద్వైత భావగాఢత కాననగును. కాని ఒక్కొక్క తత్వమందును అనుభవశాలురు ముస్లిములైనను క్రైస్తవులయినను తమకు తెలియకయే అద్వైతమందడుగు వేయుదురు. ఇట్టి వైష్ణవులను ఇతరమతస్థులను నేను చూచితిని.

రామనాథపుర సంస్థానమున నొక గొప్ప తమిళ, విద్వాంసు డుండెను. ఒకపుడు రామనాథపుర సంస్థానమునకు పోయినపుడు ఆయన నాతో పెద్ద వాదన చేసెను. ఇంతకూ వాదన యేమనగా, శంకరులు శివభక్తులు కాదు, విష్ణుభక్తులు, అని. దీనిని నిరూపించుటకు శంకరభాష్యము, భాష్యగ్రంథముపై ఉపగ్రంథములు దేశీయ భాషలోని వేకాక పాశ్చాత్యులు వ్రాసిన గ్రంథావళులన్నియు ఆయన గ్రహించెను.

శంకరులు విష్ణుభక్తినిగూర్చి చర్చించిన తెరగుననే శివభక్తి ప్రాశస్త్యమును గూర్చి వర్ణించిరే యని నేనును శంకరభాష్యమునుండియే ఉదాహరించితిని. కాని వారు ఒప్పుకొనలేదు. వాదనలో వారు జయించిరా, నేను జయించితినా అన్నది కాదు ప్రస్తుతము "మీరో వైష్ణవులు, వైష్ణవుల గ్రంథముల నేల ఆధారముగా గైకొనరు ?" అని అడిగితిని. అందులకు వారు— "ఎవరినైనా పరిశీలించవలసిఉంటే ఆల వారిలో ఆచార్యలక్షణము లుండనక్కర లేదా ? శంకరులలోనే కదా ఆచార్యలక్షణముల పరిపూర్ణత" అని వారు బదులిడిరి.

ఇట్లు దూషణ భూషణలకు శంకరులే గురి. ఇది వారి ప్రత్యేకత. ఇట్లనిన మనకు పాపమా ? పుణ్యమా ? పాపమే యని తోచును. మనగురువులగు శంకరులను మనమే స్తోత్రము చేసిన, మనభక్తి విశ్వాసములు కారణముగనున్నను, మనలను మనమే పొగడుకొన్నవారమగుదుము. 'మావూరు పెద్దది, మాజాతి అంతకన్న' అని చెప్పిన, 'నేను చాలా శ్రేష్ఠుడను' అని అర్థము. అది ఆత్మస్తోత్రముగా తేలును.

ఒకొక్క మతమునందును ఆయా మతస్థుల గ్రంథములను వ్రాయునపుడు తమ మతముల గొప్పను చెప్పుకొనవలెనను ఆశ మిగుల బలీయము. సాధారణముగా తమమతము గొప్పతనము చెప్పుకొనుటకు ఇతరులను ఖండించినగాని తమ మతప్రాశస్త్యము వెల్లడి కాదని అభిప్రాయము. ఇతరమత సిద్ధాంతములోని, గుణముల గప్పిపుచ్చి దోషములనే ఎంతురు. "అట్లు వ్రాసిన ఇతరమతములు బలీయమగునేమో" యని భయమేమో. "మనమతమునుగూర్చి ఇతరులకు చెప్పుదుము" అన్న విషయమును వదలి పరమతముల రంధ్రాన్వేషణ నొనర్తురు. అట్లుకాక సమన్వయముగా వ్రాసియుండినవారే మతమునకు చేరినవారై యుందురు.

దక్షిణ బీహారమున గంగకు దక్షిణప్రాంతమున హిందీ భాష ప్రబలము. గంగకు ఉత్తరమున నాలుగు జిల్లాలలో మైథిలీభాష. ఇది సీతాదేవి తండ్రియగు జనకు డేలిన ప్రాంతమని ప్రతీతి బీహారునకు తూర్పు నేపాళమునకు సరిహద్దున నున్న జనక్‌పూరను చోట జనకు డుండినట్లుల చెప్పుకొనుచున్నారు. దర్భాంగ, చంపారణ్యము, ముజఫర్‌పూరు - ఇవి

ఆ జిల్లాలలో చేరినవి. ఆ దేశస్థుల పేళ్ల చివర 'మిశ్ర' యని ఉండును.

వేయేండ్ల క్రితము వాచస్పతిమిశ్ర యనువా రొక రుండిరి. వారు సకలశాస్త్రకోవిదులు. యోగశాస్త్రమందు అవధుల నెరిగినవారు. న్యాయశాస్త్రవిశారదులు. ఉపనిషత్తుల లోని జ్ఞానకాండను విచారము చేయు శాస్త్రము వేదాంతము; కర్మానుష్ఠానముల విచారణచేయునది మీమాంస. ఈ రెండిటి యందును వారిది పెద్దచేయి. ఆకాలమున వారికి తుల్యులు వారె. బ్రహ్మసూత్రములకు ఎందరో భాష్యములు వ్రాసిరి. శంకరులుకూడా వ్రాసిరి. శంకరసూత్రభాష్యమునకు వాచస్పతి 'వాచస్పత్య' మను వ్యాఖ్యను వ్రాసెను.

చిన్న వయసునందే ఆ పెద్ద వ్యాఖ్యానము వ్రాయుటకు వాచస్పతి ఉపక్రమించెను. వివాహమై భార్యయు నింటికి వచ్చెను. వారు గ్రంథమును వ్రాయుచునేయుండిరి. ఏకదీక్షతో ఆ పుస్తకము వ్రాసి, ముగించుసరికి వారికి అరువది యేండ్లు వచ్చినవట. పత్నికి ఏబది యేండ్లు దాటినవి. వీరు వృద్ధులైరి. ఆమె వృద్ధ ఆయెను.

"మీరు పుస్తకమును వ్రాసి యే పుణ్యము సంపాదించు కొంటిరి? నాగతి ఏమి? తిలతర్పణముల వదలుటకుకూడా తనయు డొకడు లేకపోయెనే?" అని ఆమె అడిగెను.

"అరెరె! పెళ్ళి చేసుకుని, నీకు చాలా ద్రోహ మొనరించితిని. సరి, విచారపడవద్దు, ఈ పుస్తకమునకు నీ పేరే పెట్టుదును. తత్త్వవిచారమునకు ఉపక్రమించువా రెల్లరు నిన్ను

తలచుకొనునట్లు చేసెదను." అని తాను వ్రాసిన వ్యాఖ్యకు ఆమెపేరే పెట్టిరట. ఆమె పేరు భామతి. ఆ పుస్తకమునకూ భామతి యని పేరు.

తత్వవిచారణగ్రంధములు శంకరుల భాష్యమునుండి ఉదాహరించిననూ, ఉదాహరించకపోయిననూ భామతినుండి కొన్ని వాక్యములనైనా యుదాహరించును. ఆ వ్యాఖ్య కంత ప్రశస్తి. వాచస్పతి ఇతరమతములకునూ ఏ భేదమును లేక పెక్కు గ్రంథముల వ్రాసిరి. వారి నిష్పాక్షికత అట్టిది. వారు వ్రాసిన గ్రంథములు బ్రహ్మతత్వ సమీక్ష (మండనమిశ్రుల బ్రహ్మ సిద్ధికి వ్యాఖ్య), న్యాయగణిక (మండనమిశ్రుల విధి వివేకమునకు వ్యాఖ్య), తత్వబిందు (పూర్వమీమాంసకు సంబంధించినది), సాంఖ్య తత్త్వకౌముది, న్యాయగణికా తాత్పర్యము, న్యాయ సూచీ నిబంధనము, యోగసూత్ర భాష్యవ్యాఖ్య.

విద్యారణ్యుల కాలమున 'సర్వదర్శనసంగ్రహ' మను పుస్తక మొకటి వ్రాయబడెను. అది ఆనాటి ఇరువదిసిద్ధాంత ములపై గ్రంథము. ఆయాసిద్ధాంతతత్వములను లక్ష్యములను వర్ణించు పుస్తకము. ఇందు నాస్తికమతమునుగూర్చికూడా రెండు మూడు పుటలు కలవు.

ఇటులే నిష్పాక్షికముగా వ్రాసినవారిలో అప్పయ్య దీక్షితులవారొకరు. వీరు మూడువందల సంవత్సరములక్రితము ఉండిరి. వీరు అద్వైతులూ గొప్పశివభక్తులూ ఐనను వీరు వివిధమత గ్రంథములను వ్రాసిరి. ఇట్లు వ్రాయవచ్చునా ? అని ప్రశ్న వేసికొని, తామే 'అద్వైతస్థితికి ఈశ్వరానుగ్రహము అవసరము అన్ని సిద్ధాంతములు ఈశ్వరభక్తి ప్రతిపాదకములు

కావున, ఏ మార్గమున నడచిననుసరే, అద్వైతస్థితిని పొంద వచ్చును' అని తామే సమాధానము చెప్పిరి.

యద్య ప్యద్వైత ఏవ శ్రుతిశిఖర
గిరా మాగమానాం చ నిష్ఠా
సాకం సర్వైః పురాణైః స్మృతినికర
మహాభారతాది ప్రబంధైః,
తత్రైవ బ్రహ్మసూత్రా ణ్యపి చ విమృ
శతాం భ్రాంతి విశ్రాంతిమంతి
ప్రత్నై రాచార్యరత్నై రపి పరిజ
గృహే శంకరాద్యై స్త్ర దేవ.

— శివార్క మణిదీపిక.

శిఖరము - శ్రుతి. (అనగా చెవులతో విని చెప్పినది.) శ్రుతిశిఖరములు అనగా ఉపనిషత్తులు, నాలుగు వేదముల తుది. అద్వైతము. యద్యపి అన తథాపి అని వెంటనే వచ్చును. శివాగమములు, పాంచరాత్రము, విష్ణుపురాణము, శివపురాణము, అగ్నిపురాణము, వాయుపురాణము, భాగవతము మొదలగునవి ఉన్నను అన్నిటికి తుదిమెట్టు అద్వైతమే. ధర్మశాస్త్రము, మనుస్మృతి, ఇతిహాసము, భారతము, ఆదిప్రబంధములు, వైద్యశాస్త్రము, కృషిశాస్త్రము - దేని నెత్తుకున్నను అన్నియు అద్వైతమునకే గమించి లయించును.

వైద్యశాస్త్ర ప్రయోజనము రోగనివారణము. శరీరమిచ్చిన పరమాత్మను సత్యస్వరూపుని పొందుటకు సాధనోప

కరణమగు శరీరమునకు వలసిన దార్ఢ్యముకలుగుటకు వైద్య శాస్త్రము. ఆ ఆయుర్వేదము సయితము అద్వైతమువంక కే దారితీయును.

సంగీతమున మనస్సు లయమగును. మనస్సు లయమగు నట్లు అలవాటు అయిన ఈశ్వరునిలో మనస్సు లయము చేయుట సులభము. సంగీతశాస్త్రప్రయోజన మింతియే. అన్న వస్త్రములకు లోప మున్న ఆత్మచింతనయూ కష్టమే. ఆత్మ చింతనచేసి అంతా ఒకటే అన్న అద్వైతస్థితి పొందుటకు కృషి శాస్త్రముపయోగపడును. ఆదిప్రబంధములు – సంగీతము, వ్యవసాయము, నాట్యము. వైద్యము మొదలగు కళలను గూర్చి చెప్పును. ఇవి యన్నియు ఈశ్వరునితో నైక్యమగుటకు నుపయోగకారులు.

అద్వైతమున గౌడపాదులు, శంకరభగవత్పాదులు, సురేశ్వరాచార్యులు, వాచస్పతిమిశ్ర, విద్యారణ్యులు ఆచార్య రత్నములు. వీరు వ్రాసినవానిలో నొకదాని కొకటి వైరుధ్య మున్నటుల తోచినను సునిశితవిమర్శనచే వైరుధ్యము లేదని తేలును.

"తథా ప్యనుగ్రహో దేవ తరుణేందుశిఖామణేః,
అద్వైతవాసనా పుంసా మావిర్భవతి నాన్యథా."

'ఇది పచ్చని దీపము, ఇది నీలిరంగు దీపము, ఇది టేప్ రికార్డరు' వీని కన్నిటికీ మూలాధారము విద్యుచ్ఛక్తి. అటు లనే అన్ని మూర్తులును బహిర్దృష్టులకు వేరుగ నున్నను, లోన ఉన్నది అద్వైతపరమైన వస్తువే.

అద్వైతస్థితికి ఈశ్వరానుగ్రహ ముండవలెను. అనుగ్రహమునకు భక్తియే సాధన. అద్వైతులు ఇతర మతగ్రంథములను వ్రాసి రనిన అహంభావము కాదు. శంకరులను జ్ఞప్తికి తెచ్చుకొన్నప్పుడు వారి మనోవిశాలత అందరికి రావలెను. మనకు ఇతరమతములతో విరోధము లేదు. వారి తత్వము మనము తెలిసికొందము. వారు అడిగిన మన తత్వము మనము చెప్పుదము. పరస్పరసహాయము చేసికొందము అన్న మనోభావము మనకు ఎక్కుడుగా కావలెను.

"దేహముతప్ప ఆత్మ అనునది లేదు. శరీరము భుజించి అనుభవించి పెరిగి అంతమొందును. ఆత్మ, పరమాత్మ అనునదేదియు లేదు" అని బోధించునది చార్వాకమతము. సర్వవిద్యలకు కారణము ఈశ్వరు డని వేదము లుద్ఘోషించుచున్నవి. అటులయిన, చార్వాకమునకుకూడా ఈశ్వరుడే కారణము. దానియందు మనకు అసహ్యము కలుగకూడదు అని సూతసంహితలో ఒక కాండలో విస్తారముగ నున్నది.

స్వామి లేడని చెప్పునది ఎట్లు మత మగును? అనిన, అదియును అద్వైతమతమునకు అనుకూలమే.

ఉదయమున ఏడుగంటలకు లేచుట ఆచారము. అనుష్ఠానము లేదు. వున్నది తినుట, నిద్రపోవుట. ఇటుల మాన మతమం దొకడు ఉండిన, అట్టి సోమరికంటె "స్వామి లేడు, ఆత్మ లేదు — అంతా ఈ దేహమే" అని చెప్పువాడు ఎంతయో శ్రేష్ఠుడు. అతడు తత్వవిచారణకు దిగెనుకదా! ఆత్మ యున్నదా? లేదా? స్వామి కలడా? లేడా? అను విచారణ

లోని కతడు దిగెను. అతడు కనుగొన్న తత్వము, "స్వామి లే డనియే" కావచ్చును – కాని అతడు ఏవిచారము లేని సోమరికంటె గొప్పవాడేకదా !

"స్వామి లేడు" అన్న మెట్టువరకు అతడు వచ్చెను. మరికొంత పురోగమించిన అనుభవము ముదిరి అద్వైతస్థితిని అందుకొనవచ్చును. కావున ఏమతమైననూ సరే, తత్వవిచారమునకు అనుకూలమే. దేనియందును ద్వేష ముండరాదని వేయి సంవత్సరములనాటి వాచస్పతియు, శంకరులునూ, ఇన్నూరు వత్సరముల క్రితము ఉన్న మహాపురుషులును చాటిపోయిరి.

## భక్తి - కర్మ

మనకు ఈశ్వరానుగ్రహము కలుగవలెనన్న మనము ఏఏకార్యములు చేయుచున్నామో వానినెల్ల ఈశ్వరార్పణము చేయవలెను. ఏదేని యొక కార్యమును చేయుచుండుట మనకు సహజము. దేనినీచేయక 'క్షణమపి' క్షణము సయితము ఉండజాలము. దేహముతో చేయుకార్యములేకాదు, మనసు ఏదియో యొక ఆలోచనను చేయుచునే యుండును. శరీరమునుగూడ ఈశ్వరార్పణ చేయవలెనను ఉద్దేశముచేతనే మనము దేహము నీడ్చుకొని దేవాలయమున కరుగుట. దేవతార్చన, వేద విధ్యుక్తకర్మల చేయుట సైత మీశ్వరార్పణము చేయుటయే. ఇటులనే 'మనసుచేయు కర్మలు సయితము ఈశ్వరార్పణ చేయవలెనను ఎన్నికతోనే ఆయనను సదా ధ్యానించుము' అని

పెద్దలు చెప్పుట. ఏది చేసిననుసరే, ఇది భగవదర్పితము అని మనఃపూర్వకముగా అర్పణచేసిన, దాని నేను అంగీకరింతునని గీతయందు భగవద్వాక్యము.

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్,
యత్ తపస్యసి కౌంతేయ తత్ కురుష్వ మదర్పణమ్॥

దేవుడు మనకు శరీరమిచ్చినాడు. దానిచే ఆకలి ఎత్తిన అన్నము తిందుము. ఎండ, వాననుండి రక్షించుకొనుటకు నీడ కావలెను జంతువులవలె కాక మనకు మానమనున దొకటి యున్నది కదా ! మానసంరక్షణార్థం వస్త్రము. అన్నము, వస్త్రము, గృహము ఈ మూడును ఒక త్రిపుటి. వీనికోసము ఒక ఉద్యోగము. ఇవి అక్కరలేదన్న మనుష్య డేపనిని చేయ వలసిన అవసర ముండదు.

ఈమూడిటిని వదలిపెట్టిన మహర్షులు, ఏకార్యమును చేయకుండా ఉండిరని తెలియుచున్నది. ఇప్పుడుకూడా అటు వంటి జ్ఞానులు ఒకరిద్దరు ఉండవచ్చును. మనకు తెలియదు. ఒకకార్యము చేయుటగాని దానిచే కలుగవలసిన ఫలితముగాని వారి కేదియును లేదు. ఏదేని కార్య మొకటి చేసిన అతడు జ్ఞాని కాదని యర్థము.

అన్నము వస్త్రము నీడ వీనికోసము మనము సతతము యత్నించి సతమత మగుదుము. దుఃఖరహితులమై సదా ఆనందముగా నుండవలెనన్న మనముచేయు కార్యముల నన్నిటిని ఈశ్వరార్పణము చేయవలెను. ఈశ్వరానుగ్రహము లభించిన ఏకార్యమును చేయనక్కరలేదు. ఆనందముగా

నుండవచ్చును. ఈశ్వరానుగ్రహము లభించనంతవరకు ఈ మాదిరి ఆవశ్యకత ఉండనే వున్నది. పలుకార్యముల భారము నెత్తినుండి కదలదు. కార్యములను శుద్ధముగను, చిత్తశుద్ధితోను, ధర్మమార్గమునను చేయవలెనన్న ఈశ్వరభక్తి అవసరము. అందుచేత భక్తిని మాత్రము నవలంబింతుమన్న ప్రయోజనము లేదు. కార్యాచరణము అవసరమే.

ఒక యజమానిదగ్గర ఇరువురు సేవకు లుండిరనుకొనుడు. ఒకడు యజమాని నెల్లప్పుడు ముఖస్తుతి చేయును. మరియొకడు యజమానునికి ప్రేమ లేకున్నను తానుమాత్రము వానియందు ప్రీతికలిగియుండును. యజమాని మూర్ఖుడైన తన్నెప్పుడును స్తోత్రముచేయు సేవకునియందు ప్రీతికల్గియుండును. అతడు బుద్ధిమంతుడగుచో ఎప్పుడునుపనిచేయువానిపైనగాని, స్తోత్రము చేయువానిపైనగాని ప్రీతి నుంచడు. భక్తితో యజమాని కార్యము, తన కార్యము అని భేదబుద్ధిలేక 'అంతయును ఈశ్వరునికొరకు' అని ఏకారతయు లేక కార్యములన్నిటిని ప్రీతితో చేయువానియందు అధిక వాత్సల్య ముంచును.

ఈశ్వరుడును అట్టి యజమానియే. అట్టి ధీమంతుని ఎప్పుడు స్తోత్రము మాత్రముచేసి తృప్తిపరపలేము. అతని ఆజ్ఞల శిరసావహించక ఊరక స్తోత్రము చేసినంత, అతడు సంతోషించి అనుగ్రహించడు. మనము స్తోత్రముచేసిన అతనికి కావలసిన దెద్దియును లేదు. దానివలన ఆయనకు గౌరవమూ లేదు, అగౌరవమూ లేదు. అటులనే మనము కర్మలుచేసిన అతనికి కావలసిన దేదియు లేదు. విహితమగు కర్మాచరణము మన చిత్తశుద్ధి కొరకమే.

నిత్యకర్మలు—స్నానము, సంధ్య, జపము హోమము, దేవపూజ, ఆతిథ్యములని ఆరుకర్మలు చేయవలెనని చెప్పు చున్నారు. ఈ ఆరు కర్మలను చేయుచుండిన అందులో అన్నియు అణగియున్నవి. ఈ కర్మలచేత ఈశ్వరానుగ్రహము కల్గును.

'షట్కర్మాణి దినే దినే'

శాస్త్రమునందు స్నానమెట్లు చేయవలెనో చెప్పబడి యున్నది. అట్లుచేసిననే ఆత్మశుద్ధి. వట్టి సబ్బుతో దేహమును తోమిన దేహముమాత్రము శుద్ధియగును. స్నానసమయమున చెప్పవలసిన మంత్రములు కొన్ని యున్నవి. ఏ మంత్రము తెలియకపోయినను, రామా కృష్ణా అనియైన చెప్పి స్నానము చేయనగును.

## న ల్ల న య్య
### (నీ ల మే ఘ శ్యా ము డు)

మహావిష్ణువును - కాలమేఘమనియు, నీలమేఘశ్యాము డనియు అందురు. ఆయన దేహచ్ఛాయ నీలోత్పలమును, నీలమేఘమును బోలినది. గగనమున విలాస విహారణ మొన రించుచుండిన యొక నీలమేఘమును దేవతలు చూచినపుడు ఈ నల్లమేఘము ఆ నల్లనయ్యవలె యున్నదే యని వారికి తోపించియుండవలెను.

'త్రిదశపరిషత్ కాలమేఘం దదర్శ' యని యొక శ్లోక మందు కలదు. త్రిదశపరిషత్ అన, దేవతాసమూహము.

మనకు బాల్య, కౌమార, యౌవన, వార్ధక్య దశలని నాలుగు దశలు కలవు. కాని దేవతలకు నాలుగుదశలకు బదులు మూడు దశలే. వార్ధక్యము లేదు. వెంట్రుకలు నెరయుట, పండ్లురాలుట, పలితకేశము - దళితదంతము - వారెఱుగని విషయము. త్రిదశులు మహావిష్ణు దర్శనార్థము వెళ్ళునపుడు పరిపూర్ణ జలధరము నొండు జూచిరి.

"సంతాపఘ్నం సకలజగతాం శార్ఙ్గ చాపాభిరామం
లక్ష్మీ విద్యుల్లసిత మతసి గుచ్ఛ సచ్ఛాయ కాయమ్,
వైకుంఠాఖ్యం మునిజన మన శ్చాతకానాం శరణ్యం
కారుణ్యాపం త్రిదశపరిషత్ కాలమేఘం దదర్శ॥"

విష్ణువును మేఘమనిన, మేఘమునకుండవలసిన లక్షణములన్నియు వారికి ఉండవలెను. మేఘమున్నచోట ఇంద్ర చాపము, తటిల్లత, మేఘాన్వేషకములగు చాతకములు ఉండవలెను. మహావిష్ణువను ఈ నీలమేఘమునకు, ఈ లక్షణ సంచయ మెక్కడ ?

'సంతాపఘ్నం, సకలజగతాం శార్ఙ్గ చాపాభిరామమ్'

వివిధవర్ణ భరితమగు ఇంద్రుని కోదండమువలె, రత్నమయమగు శార్ఙ్గమును దాల్చియున్నారు శార్ఙ్గపాణి.

'లక్ష్మీ విద్యుల్లసిత మతసీ గుచ్ఛ సచ్ఛాయ కాయం'

నీలమేఘపు చరియలలో, తటిల్లతవలె హృదయస్థయగు లక్ష్మి స్వర్ణ తేజముతో భాసించును. అతసి యనగా 'నల్ల అగిసె'. అతసీగుచ్ఛమువలె నల్లని దేహము. నల్లవాని నల్లని

యొకనుంచి లచ్చిమి మొయిలుచాటున మెరయు మెరపుతీవవలె దోబూచులాడును.

'వైకుంఠాఖ్యం ముని జన మన శ్చాతకానాం శరణ్యమ్,
కారుణ్యాపం త్రిదశపరిషత్ కాలమేఘం దదర్శ॥'

విష్ణువున్నచోటు వైకుంఠము — వైకుంఠుడనికూడా వారి కొక పేరు. "వైకుంఠో విష్టరశ్రవాః" అని అమరము.

కవులు కావ్యములందు రెండు అపూర్వమైన పక్షుల గూర్చి వ్రాయుట ఆచారము. అవి చాతక చకోరపక్షులు. చకోరముల ఆహారము చంద్రకిరణములట. అమవసనాడు వీనికి ఉపవాసమే చాంద్రాయణవ్రతమే. మిగిలినరోజులు చంద్రకళ లున్నరోజులు పండుగ. ఒక్కమారు నీరుత్రావి, ఇరువది దినము లైనను నిర్జలవ్రతమును బూను ఒంటెలవలెనే - చాతకములు వర్షించునపుడు నోరు తెరచుకొని జలబిందువులను గ్రహించి జీవనమొనర్చును. వాన కురియకపోయిన, 'వాన రాదా' యని ఆకాశాభిముఖములై ఎదురుచూచును. మేఘప్రశంస వచ్చి నపుడు చాతకములనుగూర్చి చెప్పుట మన కవులకు వాడుక.

ఈ పక్షులు కల్పనా ? లేక నిజముగా నున్నవా ? యని అడిగిన, నాకు తెలియదని చెప్పుదును.

చాతకములు నీలిమేఘము నెదురుచూచినరీతి, ముని జనులు నీలమేఘవర్ణుని కరుణామృత వృష్టికొరకై యువ్విళ్ళూరు చుందురు. సాధారణముగా మేఘములు ధవళములు. కొన్ని యొక్కింత నలుపు. మరికొన్ని నీలమేఘములై, నీరదములై భగ వానుని కృష్ణచ్ఛాయల ననుకరించును. ఆకసము మేఘావృతము

కాగానే – చల్లనిగాలి సుశీతలమై, తాపహారముగా మెల్లగా అల్ల నల్లన వీచును. తాపహారముగా నీలమేఘము తాపస చకోరముల తాపహారి – హరి. మునిజనములు చాతకములు. ఆ మునిచాతకములు "మనల సేవస్తువు రక్షింపదు, వరేణ్యా మగు ఈ నీలిమేఘునే శరణ్యా"మని చేష్టదక్కి చూచును.

క్షీరాంభోధే ర్జఠరమభితో దేహభాసాం ప్రరోహైః
కాలోన్మీలత్ కువలయదళా ద్వైతమా పాదయంతమ్,
ఆతన్వానం భుజగశయనే కామపి క్షౌమగౌరే
నిద్రా ముద్రాం నిఖిల జగతీ రక్షణే జాగరూకామ్॥

'క్షీరాంభోధేర్జఠరే భుజగశయనే' – పాలసంద్రమున భుజగశయనుడై యున్నాడు మహావిష్ణువు. తెల్లని తల్పము, తెల్లని ఉనికి; దేహచ్ఛాయమాత్రము కువలయదళములవలె– గాఢనీలచ్ఛాయ. తెలుపు, నడిమి నలుపు ప్రస్ఫుటము.

బ్రహ్మ సృష్టికర్త. విష్ణువు పరిపాలకుడు. రుద్రుడు సంహారకారకుడు. ఈ ముప్పురికి లోకములు నివాళులనిచ్చును. పరిపాలకులైన ఈ పెరుమాళ్ళ ఉద్యోగము భుజగశయనుడై నిదురబోవుట. నిద్రాముద్ర. ఆయన నిద్రాముద్రయే జాగరూకతతో లోకరక్షణ నొనర్చును.

వారి దేహచ్ఛాయ నీలము. వారి స్థానము, శయనము, శుద్ధసత్త్వము. ఉద్యోగము జగద్రక్షణ. ఉన్నది నిరంతర నిద్రాస్థితి. ఒకటికొకటి విరుద్ధము. దీనినే ఈశ్వరశక్తి యని, మాయ యని అందురు. ఏవి ఒకటితో నొకటి చేరవో వాటి నెల్ల చేర్చిపెట్టు శక్తి 'అఘటితఘటనా పటీయసీ మాయా.'

అఘటితమును ఘటితమొనర్చును అశక్యమును శక్యమొన ర్చును. దేనిని లేదని చెప్పలేమో అదియే మాయ.

ద్వైత మనగా అది వేరే, యిది వేరే యనుట. అద్వైత మనగా రెండునూ ఒకటే యనుట. పాలసముద్రము, నీలమేఘకాంతియును వేరుకాదు, ఒకటే. ద్వైతమువలెఉన్నను అద్వైతమై పాలసముద్రము నీలసముద్రముగా మారిపోవును.

ఏబదియేండ్ల క్రితము నేను ఈశ్లోకమును చెప్పిన, ఏ నాలుగువందలమందికో తెలిసియుండెడిది. ఇపుడో నగరమం దున్న నాల్గవభాగము జనులకు తెలియునేమో ? గ్రామము లలో అదియును తెలియదు. ఈ శ్లోకములెందున్నవో ఆసంగతి నేనే చెప్పి ముగింతును.

'నిద్రాణు డేకార్యమును చేయును ?' అని మన మను కొనకూడదు. 'చూచిరమ్మనిన, కాల్చివచ్చిన ఆసామికి సామి యగువాడు' ఒక్కక్షణమున పలుకార్యముల నొనర్చును. ఈ విషయము సింహవేషమున దంష్ట్రికరాళవదనుడై, స్తంభము నుండి బయల్వెడలినపుడు తెలిసినది.

"ప్రహ్లాదస్య వ్యసన మమితం దైత్యవర్గస్య దంభం
స్తంభం వక్షస్థల మపి రిపో ర్యౌగపద్యేన భేత్తుమ్,
బద్ధశ్రద్ధం పురుషవపుషా మిశ్రితే విశ్వదృష్టే
దంష్ట్రారోచిర్విశదభువనే రంహసా సింహవేషే॥"

ఇది తరువాత శ్లోకము. యౌగపద్యమన నొకేకాలమున చేయుటని. ప్రహ్లాదుని వ్యసనమును, దైత్యుల దంభమును,

స్తంభమును, రిపుని వక్షస్థలమును – ఏకకాలమున ఆయన విద ళిత మొనర్చెను. ఇవియన్నియు అతివేగముగా జరిగిపోయెను.

భోజరాజును గురించి మీరు వినియుందురు. ఆయన ఆస్థానకవి కాళిదాసు. రసవంతముగ కవన మెవరు చెప్పినను భోజుడు అక్షరలక్ష లిచ్చెడివాడట. అట్టి కవిజనపోషకుడు ఆతడు. అట్లు అక్షరలక్షలు గడించినవారిలో ప్రథముడు కాళి దాసు. వీరిరువురికి గాఢ స్నేహము, ప్రేమ. ప్రేమమధికమగుచో విరోధమును అధికముగా కల్గును. ప్రియాధికమైన వస్తువు దుఃఖాధికమునకుకూడా కారణమగును. మితిమీరిన వర్తన మున్న ఎల్లయెడల ఇది కనబడును. ఒకొక్కప్పుడు కాలము తలక్రిందులగును. వీరు అవినాభావముతో, మనోవాక్కాయ ములు ఏకమై కవితారసాస్వాదన మొనర్చుచుండిరి. ఇట్టి సమ యమున భోజునకొక విపరీతపు యోచన కల్గెను.

'చెడువాడు చెడ్డనుగూర్చి తలపోయును.'

ఇతరుల చెడ్డతనమును వదలి, తనగోతిని తానే త్రవ్వు కొనును. "కాళిదాసునకు కాళీప్రసాదమున వాక్కు పొంగి, కవితాలహరి ప్రవహించును. అతని కవితామృతమును తనివి తీర గ్రోలితిని. కాని నేను గతించిన, అతడు నా గురించి చెప్పి చివరి పద్యమల్లును గదా! దానిని నేను వినుటెట్లు?" అన్న యోచన మెదడులో మెదిలెను. వెంటనే భోజరాజు కవిని పిలవనంపి తనకోరిక వెలిబుచ్చెను.

"మహారాజా! ఇదేటి విపరీతపు కోరిక?"

"ఏమయినను సరే! నేను నాగురించిన కడపటి శ్లోక మును విందును."

"నేను వ్రాయుటయా? నాకేమి తెలియును? నేనొక గొఱ్ఱెకాపరిని. ఆతల్లి ఏదియో నానోట వేసినది. గొఱ్ఱె పెంటయేమో అని ధూ ధూ అని ఉమిసితిని. ఏదో ఆమె కటాక్షమున నాలుగు ముక్కలు వచ్చినవి. కాని నానోటితో నేదిచెప్పినను ఆవిధముగా జరుగును కదా! అందుచే ఈకోరిక వదలుడు."

"నీవు వ్రాయ సమ్మతించవా? అట్లయిన మనకు ముఖావలోకనమే యుండదు. రాజాజ్ఞ నుల్లంఘించిన నీవొక భ్రష్టుడవగుదువు. భ్రష్టుడు భోజరాజ్యమున నుండగలడా?"

కలహ మిట్లుత్పన్నమై బలీయమాయెను.

"మీరు సుఖులై యున్న అదియే చాలును. నేను రాజ్యమునువీడి వెళ్ళెదను." అని కాళిదాసు సభను వదలి చనెను. అత డారాత్రియే ఆదేశమును వదలిపోయెను

ఆకాలమున రాజు మారువేషముదాల్చి విషయపరి శీలనమొనర్చును. ఇపుడో యొక కమీషను ప్రప్రథమమున నియమింతురు. దాని రిపోర్టును మరియొక కమిటీకి నివేదింతురు. అటుతర్వాత సాక్ష్యశ్రవణము, విచారణ, తీర్పు. ఇది ఈకాలపు తీరు. ఇంత శ్రమపడినను ఈ రిపోర్టులలోని విషయావళి ఒక దాని కొకటి విరుద్ధముగా నుండును.

కాళిదాసు ఎచటికి వెళ్ళెనో కనుగొనుటకు భోజుడు గుప్తవేషమున బయలుదేరెను. సోదెచెప్పువారి పల్లెటూరి

వేషమును వేసికొనెను. కాళిదాసుగూడ జగత్ప్రసిద్ధుడగుటచే ఎవరికి తెలియబడకుండుటకు పిచ్చివానివలె, సన్యాసివలె పరమశివుని గుర్తుకుతెచ్చు జంగమువలె వేషము దాల్చెను.

ఒకనాడు వీరిరువురు కలియు సందర్భ మేర్పడినది. వేషమునకు దగిన భాష యుండవలెనని యేమో - కసాయి దుకాణము ప్రవేశించి కాళిదాసు కర్రతో మాంసమును తాకుచు 'వెల యెంత?' యని అడిగెను. దీనిని చూచిన భోజుని ఆశ్చర్యమింతింత అనరాదు. అతనిని సమీపించి "భిక్షో! మాంసనిషేవణం కిముచితం? - ఓ భిక్షూ! మాంసము దినుట ఉచితమా?" అని అడిగెను.

"కింతేన మద్యం వినా? - కల్లు లేకుండా, తింటేగా? అని బదులు చెప్పెను.

"నీవో సన్యాసివి. కల్లును, మాంసమునుగూడ దినుట మంచిదా?" అని భోజు డడిగెను.

"భ్రష్టస్య కావాగతిః - భ్రష్టునికి వేరేమిగతికలదు?" అని బదులిడినంతనే భోజుడు కాళిదాసును గుర్తించెను.

"ఇన్నిప్రశ్నలు అడుగుచున్నావే? నీ వూరేదయ్యా?" అని కాళిదాసు ఆ పల్లెటిదిక్కు వేషగాని నడిగెను.

"ధారానగరము"

"భోజుడు సుఖుడేనా?"

భోజుడిదియే సమయమనుకొనెను. "దానినేల అడిగెదవు! భోజుడు చనిపోయి ఆరుదినము లగుచున్నది."

తత్క్షణమే కాళిదాసు అతిదుఃఖితుడై—

"అద్యధారా నిరాధారా నిరాలంబా సరస్వతీ,
పండితాః ఖండితా స్సర్వే భోజరాజే దివంగతే॥"

యని ఆశువుగా చదివెను.

భోజుడు స్వర్గస్థుడైనంతనే ధారానగరము నిరాధార మాయెను. సరస్వతి నిరాలంబఅయినది. పండితులు ఆదరణలేక ఖండఖండము లైపోయిరి.

ఈ శ్లోకమును విన్నంతనే - ఎదుటివ్యక్తి నిట్టనిలువుగ గూలెను, అపుడు కాళిదాసుకు విషయము గోచరమైనది. "అయ్యో! నీవేనా భోజుడవు? చివరిపద్యము చెప్పనంటివే! నీ పిడివాదము వదలవైతివి" అని దుఃఖించెను. అతని దుఃఖమును చూచి సహించలేక - సరస్వతి ఆవిర్భవించి "జరిగిన దేమో జరిగినది. ఈ చివరిశ్లోకమును త్రిప్పి చదువుము. మూడు మువ్పాతిక ఘడియలు ప్రాణమిత్తును. ఇష్టమున్నది మాటాడు కొనుడు" అని వర మొసగెను. కాళిదాసు తాను చదివినది త్రిప్పి —

"అద్యధారా సదాధారా సదాలంబా సరస్వతీ,
పండితా మండితా స్సర్వే భోజరాజే భువంగతే॥"

అని చదివెను. భోజుడు కనులు దెరచెను.

"రాజా! ఇట్లు చేసితిరే? మూడుముప్పాతిక ఘడియలే మీరు జీవముతో నుండుట అని దుఃఖపడవద్దు."

"నేను గతించిన నేమి? గతించుటకు ముందు అమృత సమానములగు నీ వాక్కులను వింటిని. ఈ మూడుముప్పాతిక ఘడియలలో రామచరిత్రను సృష్టింపజేయుదము" అని అనెను.

ఏడుదినములలో మృత్యువున్నదనగా భాగవతము విన్న పరిక్షిత్తువిధమున, భోజుడు రామచరిత్రను విందునని యనెను. ఇరువురును కలసి కవనముచేసిరి అదియే భోజచంపువు. నేను చెప్పిన శ్లోకము లిందులోనివే.

"నారాయణాయ నలినాయితలోచనాయ
నామావశేషితమహో బలివైభవాయ,
నానాచరాచరవిధాయక జన్మదేశ
నాభీపుటాయ పురుషాయ నమః పరస్మై॥"

నాభీపద్మమునపుట్టిన బ్రహ్మ సృష్టికర్త. "పురుషాయ నమః పరస్మై" భగవానుడొక్కడే పురుషుడు. పరము అనగా పెద్దది. అపరమనగా చిన్నది. ఆయనకు అన్నీ అపరమే. అట్టి పెద్దవానినే పరమాత్మయనియు అందుము. పరమపురుషుడనగా పెద్దమనిషియని అర్థము. ప్రాతఃకాలమున చల్లనిదేవుని, చల్లని సమయమున స్వరూపధ్యానము చేయుదురు. ప్రాతఃకాలమున విష్ణువును, సాయంసమయమున ఈశ్వరుని తలచుట యొక వాడుక.

చావు మూడు ముప్పాతిక గడియలున్నదనగా భోజుడు రామాయణము వినెను. ఆ కాలమున భగవంతునిగూర్చి పాడుదము, నామజపము చేయుదము, అని ఆయన తలపోసెను. ఆయుస్సు ఇంతఅని చెప్పలేము. ఒకరోజు అయినను, కడకు ఒక

నిముసమైనను మనము వ్యర్థపరచరాదు. ఒక్క నిముసము దొరికిన, భగవన్నామస్మరణ జేయవలెను. వాని రూపదర్శనము చేయవలెను. ఒకపని ముగించి మరియొకపనిని ప్రారంభించు నంతలో నొకనిముసము దొరికిన - అప్పుడుకూడా భగవంతుని స్మరింపనగును. అనవరత భగవత్స్మరణ మన ఆచరణకావలెను. దీనినే పరీక్షిత్తు, భోజరాజు తమ జీవితనిదర్శనము గావించిరి.

అందుచే మనమెల్లరము ఉషఃకాలమున నిదురలేచి నంతనే చల్లనిదేవుని, నీలమేఘశ్యాముని చల్లని మనస్సుతో స్మరింతముగాక.

## చెఱకువిల్లు; పూవుటమ్ము

ధనుః పౌష్పం మౌర్వీ మధుకరమయీ పంచ విశిఖా
వసంత స్సామంతో మలయమరు దాయోధనరథః,
తథాఽ ప్యేక స్సర్వం హిమగిరిసుతే కా మపి కృపా
మపాంగాత్తే లబ్ధ్వా జగ దిద మనంగో విజయతే॥

మన్మథుని ధనుస్సు చెరకు అనియు, దాని అల్లెత్రాడు తేనెటీగలనియు చెప్పుదురు. మన్మథునికి పర్యాయపదములు - పుష్పబాణుడు, పంచబాణుడు అనునవి. చాపము మధురము; శరములు కుసుమసదృశములుకాక కుసుమములే. ఇట్టి మధుర ములును, మహిమాన్వితములు అగు ఆయుధముల సాయమున మదనుడు, అశేషప్రాణి మానసికవృత్తులను కామప్రవృత్తులను చేసి సురలకైన నసాధ్యమగు విజయము సాధించును. పశుపక్షి

కీటకములు మొదలు పెద్దవస్తాదువరకు ఎల్లరు తలలొగ్గినవారే ఇతనికి.

"ప్రపంచమునే పంచబంగాళ మొనరించు నాకు, పరమేశ్వరు డొక్క లెక్కయా?" అని అత డొకప్పుడు తలపోసెను. ఆయుధసముదాయములను గ్రహించినది అతనికి అంబిక, ఆమె అపాంగవీక్షణము. కాని ఇపుడామె అతనికి తలపునకురాలేదు.

ఒకకాలమున దక్షునిపుత్రికగా నవతరించినకతమున అంబిక దాక్షాయణిగా వ్యవహరించెను. కాత్యాయనుడను మహర్షికి కూతురయి కాత్యాయని నాబరగెను. మాతంగఋషికి కొమరిత అయినందున మాతంగీ, మధుశాలినీ యని కీర్తింపబడినది. హిమవంతుడు తీవ్రతప మొనరించినందున అతని కడుపునబుట్టి పార్వతియనియు, హైమవతియనియు కొంత కథ జరిపెను.

అంబిక దాక్షాయణిగనుండిన కాలమున దక్షు డొక యాగము చేసెను. కాని ఈశ్వరుని గౌరవించి ఆహ్వానించలేదు. అల్లుడేకదా యని అలక్ష్యముతో నుండెను. అంబిక మాత్రము 'నాతండ్రి యాగము చేయుచున్నాడు. నేను వెళ్లెదను' అని భర్తతో ననెను.

'పిలువనిపేరంటమునకు వెళ్ళడ మెందులకు?'

'మీరు రాకపోయిన పోనిండు. నేనువెళ్ళి ఎట్లు జరుగుచున్నదో చూచివచ్చెదను.' అని పుట్టింటిమీది మక్కువతో యజ్ఞమునకు వెళ్లెను. ఆమె మనసు ఆమెకే తెలియవలె.

ఆహూతులగు దేవతలందరు యాగమునకు వచ్చిరి. దక్షుడు శివుని యాగమునకు పిలువకపోవడమేకాక పైపెచ్చు

నిందచేసెను. ఈశ్వరనింద విన్న దాక్షాయణి ఓర్వలేక - తన శరీరమును యజ్ఞకుండమున నాహుతిచేసెను. ఆమెకు సతి యనియు పేరు. అందుచే స్త్రీలు పతిచితిలోపడుటకు 'సతి' యని పేరువచ్చెను. 'మహాదేవం హిత్వా తవ సతి సతీనా మచరమే' యని సౌందర్యలహరి. ఆంగ్లమున సైతము సహ గమనమునకు 'సతి' యనియే పేరు.

ఆనాటినుండి ఈనాటివరకు సహగమన నిషేధచట్ట మున్నను సంవత్సరములో ఏ ఇద్దరైనా సహగమనము చేసిరని పత్రికలలో చూచుచున్నాము. దాక్షాయణి శరీరత్యాగము ఈశ్వరునికి తెలియగనే దక్షునిపై క్రోధానలము పెల్లుబికెను. తన్ను నిందచేయగా, తనశక్తి ప్రాణత్యాగమును చూచుచు పూరకుండిన దేవతలను సైతము ఆయన శిక్షింపదలచెను.

రక్షణ శిక్షణములు రచించువాడు ప్రభువు. అట్టివాడు ఈశ్వరుడు. అడిగిన ద్రవ్యమిచ్చి జమాఖర్చు లడుగక దుర్వ్విని యోగ మొనర్చినను ఉపేక్ష చేయునతడు ప్రభువు కాడు. మనముచేయు తప్పులకై దండించుచు, ఖండించుచు, సహాయ మొకించుకైనను చేయనివానినికూడా ప్రభువని చెప్పజాలము. రక్షణ శిక్షణముల రెంటినీ జేయువాడు ఈశ్వరుడొకడే.

సముద్ర మథనమున హాలాహల ముదయించినపుడు తక్కినవారు పలాయనముచేయ విషమును మ్రింగి జగద్రక్ష గావించినది గరళకంఠుడు. ఇతరుల పాపమును ఈయనయే భరించెను. 'మనకర్త ఎల్లరి పాపములను హరించును.' అని ఇతర మతస్థులనుటయు ఈ తత్త్వమే.

దాక్షాయణి దేహత్యాగానంతరము హిమవంతుని పుత్రికగా జన్మించెను. పరమేశ్వరినే కొమరితగ బడయుటకు హిమవంతుడు ఎంత తపమొనర్చెనో? ఎట్టి పుణ్యముచేసెనో? తండ్రి కొమరితకోసము తపముజేయ, కొమరిత ఈశ్వరాను రక్త అయి భర్తకొరకు తపము మొదలిడెను. దక్షిణామూర్తి యోగమున ఈశ్వరుడుండెను. కనులు దెరచుటయు వెలివిషయములపై ధ్యాసయు ఆయనకు లేదు.

ఆదేకాలమున తారకుడను మహాసురుడు సురలను ముప్పతిప్పల బెట్టుచుండెను. వాని సంహారార్థము దేవతలు ఒక మహాతేజస్వియగు కుమారు డవతరింపగూడదా యని తలపోసిరి. వశీకరణచక్రవర్తి, మన్మథుని ఈశ్వరునిపై పురికొల్పిరి. ముఖస్తుతికి మన్మథుడు లొంగెను. పరమేశ్వరుని తపోవనమున కరిగి అందు రుద్రుని కభిముఖుడై ఎడమకాలు ముంగలికిచాచి విల్లువంచెను.

'ఏమిటది? మనశ్చాంచల్యము కలుగుచున్నదే?' యని ఈశ్వరుడు తన లలాటనేత్రమును దెరచెను. తత్క్షణమే మన్మథుడు గుప్పెడు బూడిద అయి అనంగుడాయెను.

పెనిమిటి బూడిదైపోగా రతి పెల్లుగ దుఃఖించెను దేవి రతి నూరడించి ఆమెకనులకు మాత్రము మన్మథుడు గోచరించునట్లు అనుగ్రహించెను. తారకాసుర సంహారార్థము, సర్వలోక రక్షణార్థము పార్వతి మన్మథుని వింటేని, బాణములను గైకొని ఈశ్వరుని ముందుంచి నమస్కరించెను. మన్మథుడు దండోపాయమున జయించని కార్యమును సామమున నామె నవలీలగా నెరవేర్చెను.

దానితరువాతనే కుమారసంభవము. రామాయణమున వాల్మీకి "కుమార సంభవశ్చైవ ధన్యః పుణ్య స్తథైవ చ" అని వ్రాసెను. కాళిదాసు కుమారసంభవమందును ఈ కథ వచ్చును. వీక్షణమాత్రమున కామాక్షి ఈశ్వరుని కామ వశుని గావించెను. అటుతర్వాత కల్యాణము, కుమారజన నము, సుబ్రహ్మణ్యావతారము. అతడో ఈశ్వరుని మించిన తేజస్వి. 'పుత్రా దిచ్ఛేత్ పరాజయమ్' ఈశ్వరునికే ప్రణవమంత్రోపదేశమును జేసెను. ఈశ్వరుడే కుమారుడుగ అవతరించెనని చెప్పినను – జ్ఞానమునన్నైననేమి, వీర్యముననైన నేమి ఈ రూపమున ముందుకంటె సహస్రవిధముల ఎక్కువగా ప్రకాశించెను.

ఈశ్వరుడు జ్ఞానస్వరూపి. పరతత్త్వస్వరూపముగా నున్న చాలదు. కరుణాసముద్రుడై ఎల్లరిని కటాక్షించవలె నని, అవతరించవలెనని జగన్మాత జ్ఞానస్వరూపునికే కామము పొంగునటు లొనరించినది.

"పుండ్రేక్షు పాశాంకుశ పుష్పబాణ హ స్తే నమ స్తే జగదేక మాతః" అని శ్యామలాదండకము. ఈ చెఱకువింటి యొక్కయు, పుష్పబాణముల యొక్కయు సూక్ష్మతత్త్వము లలితాసహస్రనామములలో "మనోరూపేక్షు కోదండా, పంచ తన్మాత్రసాయకా" అని చెప్పబడినది.

చెఱకు తీపి మనస్సును తీపే. లోకములోని అందరిజనుల సమిష్టిమనస్సు ఆమె వామహస్తమున గల ఇక్షుకోదండము. శ్రోత్ర, త్వక్, చక్షుర్, జిహ్వా, ఘ్రాణము లనుభవించు విషయ ములే తన్మాత్రలుగ – పుష్పబాణములుగ – దేవి తనచేతియం

దుంచుకొన్నది. మనుజుల కామనిరోధమునకును, మనోనిరోధమునకును ఆమె కారణ మగుచున్నది. ఆమె అనుగ్రహ మొకటి యుండవలెను. దీనినిగూర్చి మూక కవి తరచు, "నీ కటాక్షము శివునే మోహపెట్టుచున్నది. కాని జనులమోహమును మాత్రము శిధిలము చేయుచున్నది." అని చెప్పెను.

కేవలము జ్ఞానమయుడగు ఈశ్వరుని లోకక్షేమార్థము మోహింపజేయు శివకామసుందరి — కామాక్షి, మోహమున మునిగిన భక్తుల మోహనివృత్తి చేయుచున్నది. ఇదియే ఆమె విశేషము మూకకవి చెప్పినట్టు ఆమె అనుగ్రహ మున్ననే మనకు చిత్తములో అవికారము, సమదృష్టి, నిర్మోహస్థితి కల్గును.

ఆమె అనుగ్రహమున్నచో ఎంత కామము కలిగించు వస్తువులైనను మనల చలింపజేయజాలవు. ఎట్టి ఐశ్వర్యమును లోభపెట్టజాలవు. అరిషడ్వర్గము లంతరించి చిత్తశుద్ధి కలుగవలె నన్న దేవిని ధ్యానించవలెను. "అమ్మా! ఒక్క దుర్గుణమైనను లేకుండునట్లులు నా చిత్తమును పరిశుద్ధ మొనర్చుము" అని నిత్యమును వేడుకొనవలెను. ఈ వాడుక కల్గిన చిత్తశుద్ధి తానుగ వచ్చును అదియే ఆమెచరణారవిందము లాశ్రయించినందున కలుగు ఫలము. మనసులో లోపమున్నదనగా చిత్తశుద్ధి లేదన్నమాట.

ఆమెచరణముల నెప్పుడును స్మరించుటయే చిరంజీవిత్వము. చిత్తశుద్ధితో ఆమెబిడ్డవలె ఆమెస్వరూపధ్యానమును జేయుచు ఆత్మానందమున దేలియాడవలెను. శంకరుల సౌందర్యలహరి ప్రయోజనమేమంటే, అహర్నిశము జగన్మాతస్మర

ణచే దోషనివృత్తి చేసికొని మనఆత్మల సచ్చిదానందరూపిణికి అర్పించుటయే.

# వినాయకుడు

నేటి ఉపన్యాసమును ప్రారంభించుటకు ముందు త్యాగరాజు వంశమునకు చెందిన త్యాగరామయ్య అనువారిని కొన్ని కీర్తనలను పాడుమని స్వామి ఆజ్ఞాపించిరి. వారు 'గిరిరాజసుతా తనయ' అని విఘ్నేశ్వరునిపై కీర్తనతో మొదలిడిరి, వారు పాడి ముగించినపిదప స్వామి ఉపన్యాసము ఆరంభించిరి.

అనుభూతినొందిన మహనీయు లెందరో తమ అనుభవముల గూర్చి చెప్పియున్నారు. కొందరు కవనము చేసిరి. కొందరు కీర్తనల రచించిరి. దీక్షితుల కృతులు, శ్యామాశాస్త్రి కృతులు, త్యాగరాజకృతులు ఈ రెండవ తెగలోనివే. దక్షిణదేశమున త్యాగరాజకృతి కనీసము ఒక్కటైనను ఎరుగనివారు అరుదు. వీరు పాడిన 'గిరిరాజసుతా తనయ' అను కృతియు త్యాగరాజ కృతమే.

గిరిరాజసుతాతనయుడు - విఘ్నేశ్వరుడు. వీరుపాడిన కృతి వినాయకుని నుతి. మనము కొంత వినాయకుని తత్త్వమును పరిశీలింతము. ఏతత్త్వవిచారణయేని అగుఁగాక 'ఇది ఇంతయే' అని చెప్పలేము. యోచించుకొలది విషయములు పెరుగుచునే యుండును.

వినాయకునికి మనము కొబ్బరికాయల కొట్టుదుము. దీనికొక కథకలదు. విఘ్నేశ్వరుడు ఒకపుడు తండ్రి పరమశివుని

జూచి 'నీశిరస్సు బలిగానిమ్ము' యని యడిగెనట. అవిఘ్న ముగా కార్యసమాప్తి యగుటకు ఈశ్వరుని తలతో తూగు ఒకానొక గొప్పవస్తువును ఈవలెను. అందుచేతనే ముక్కంటి తలకుబదులు మూడుకన్నుల నారికేళమును కొట్టుట. అట్టివస్తు వొకటి సృష్టిలో నుండుటకూడా ఒక ఆశ్చర్యము. 'అవిఘ్నం కురు మే దేవ సర్వకార్యేషు సర్వదా' యని వినాయకునికి కొబ్బరికాయలను కొట్టండి అనియే వీనిని ఈశ్వరుడు సృష్టించి నట్లున్నది.

ఈకొట్టుటలోను ఒక నిబంధన కలదు. కొబ్బరికాయ జుట్టు పూర్తిగా తీసి కొట్టవలెను. సన్యాసులు చనిపోవునపుడు కూడా ఇదే విధముగా కొట్టుదురు. కనీసము మూడు ముక్క లగునట్లయినను కొట్టవలెను. ఈవాడుక తమిళదేశమునందే ఎక్కువగా నున్నట్టు గోచరించును.

చాతుర్మాస్య అనునది నాలుగు పక్షముల కాలము. అనగా రెండు నెలలు ఒక ఊరిలో సన్యాసులు నివసించవలెనని విధి. ఈ ఏర్పాటు వేయిసంవత్సరములుగా వచ్చుచున్నది. ఒక సంవత్సరము నాగపట్టణమునందు గడపితిని. అనుదినము దేవా లయమునకు వెళ్లుట వాడుక. సాయంసమయమున ఒకటే జనసందడి. ఆలయమునకు వెళ్ళుదారిలో నొక చిన్న వినాయ కుని కోవెలయుండెడిది. దానిముందు ఎప్పుడు పిల్లలసందడియే. భిన్నములగు నారికేళములు అసంఖ్యాకములు. వాని నేరు కొనుటకు - ఒకరిపై నొకరు పడి గాయపడురీతిని - వచ్చు బాలుర సంఖ్యయు లెక్కకు మిక్కుటమే. కొందరు పెద్దలు ఆ పిల్లలను కసరికొని తొలగిపొండని గద్దించిరి. అందులో ఒక కుర్రడు

'మమ్ములను ఏరుకొనవద్దని చెప్పుటకు మీకేమి అధికారము?' అని ప్రశ్నించెను. అపుడు నాకు – "ఈ చిట్టిదైవమునకు ఈ చిట్టిపిల్లలే స్వంతము" అని అనిపించెను.

ఈ దైవమునకు స్థూలకాయము. 'తొండము నేకదంత మును తోరపుబొజ్జయు' ఆకారము పర్వతమువలె. కానీ ఇత డేమో బాలుడే. బిడ్డలకు పుష్టియే యొక అందము. ఆహారపుష్టి ఆకారపుష్టి బిడ్డలకు అత్యావశ్యకము. సన్యాసియొకడు ముక్కు బంటిగా తిని స్థూలకాయుడగుచో అందమనిపించునా? వయస్సు ముదిరినకొద్ది ఉపవాసముండుట యొక మంచిఅలవాటు. చిన్న బిడ్డలు ఉపవాసముండుట యొక కూడనిపని. బిడ్డలు- బొద్దుగా నుండవలెననియే ఈశిశుదైవము చూపునట్లు దోచును.

ఇతని వాహనము మూషికము. ఇతడెంత గురువో, అది యంత లఘువు. వాహనమువలన స్వామికి గౌరవము లేదు. స్వామివల్లనే వాహనమునకు గౌరవము. కొలది మేను కల మూషికమునకు ఘనత రావలెననియే ఈయన దేహమును పెంచుకొనెను కాబోలు.

" అగజానన పద్మార్కం గజానన మహర్నిశమ్,
అనేకదం తం భక్తానా మేకదంత ముపాస్మహే॥"

అని పూర్వకాలమునుండి వచ్చుశ్లోకము ఒకటి యున్నది.

అగజానన పద్మార్కం = గమించనిది కొండ. అట్టి మంచుకొండ కూతురు పార్వతి. పార్వతి ముఖపద్మమునకు సూర్యునివంటివాడు అని అర్థము. సూర్యసమానుడైన తనయుని

వినాయకుని చూచినంతనే అగజాననపద్మము అట్టులే విక సించును. గజాననం అహర్నిశం ఉపాస్మహే = వినాయకుని అహర్నిశము ఉపాసింతును అని అర్థము.

అహర్నిశోపాసన మనదేశముననే సాధ్యము. ప్రతి వీథి కొసను (తమిళ దేశమున) వినాయకుని కోవెల యుండును. భక్తిరహితులు పిడివాదముతో నమస్కరింపనని తీర్మానం చేసిన ఏ కొలదిమందియో తక్క, మిగిలిన ప్రతియొక్కరు ఆలయము ముందు వెళ్ళుచు ఒక్క నమస్కారమైనను పెట్టి వెళ్ళుదురు. కొందరు మొట్టికాయలనుకూడా వేసికొందురు.

అనేకదం-తం-భక్తానాం అని విడదీయవలెను. భక్తులకు పలువిధములగు అనుగ్రహముల నిచ్చువా డాయన.

ఒక్కొక్క ప్రాణికి ఒక్కొక్క విషయమం దెక్కుడు ప్రీతి. చమరీమృగమునకు తన తోకయందు ప్రీతి. నెమలికి తనపింఛమే బంగారము. ఏనుగునకు తనసర్వస్వము దంతములు. దేహ మెట్టులున్నను దంతములను మాత్రము తెల్లనికాంతులు కక్కుచుండునటుల శుభ్రముగా నుంచుకొనును. కాని గజా ననుడు తనఅందము, చందము, గౌరవము, గరువము అన్నిటికీ మూలాధారమైన దంతమును, ప్రాణప్రదమగుదానిని ఒక్కు మ్మడిగా పెరికి మహాభారతరచనా సందర్భమున కలముగా చేసికొనెను. న్యాయము, ధర్మము, విద్య వీనికొరకై ఎంతటి త్యాగమయినా చేయదగునని నిరూపించెను. దైవమునకు ఉపకరణము నిమిత్తమాత్ర మనియు విద్యావ్యాప్తికి సత్యము, జ్ఞానము, ధర్మము వ్యాపించుట కొరకు ఎట్టిఉత్కృష్ట దేహ

భాగమైనను త్యజింప దగునని చూపుటకే మహాభారతమును వ్రాసెననియు గోచరమగును.

తమిళుల కెల్లరకును అవ్వైయార్ సంగతి పరిచితమే. ఆమె చెప్పినది ఒక్కవాక్యమైనను తెలియని తమిళుడుండడు. ఆమె వ్రాసిన గ్రంథములలో 'వినాయక అహావల్' అనున దొకటి. అదియొక యోగశాస్త్రము. ధ్యానమెట్లు చేయవలెను? కుండలినీ శక్తి సహస్రారమునకు లేవదీయుట ఎట్లు? అను పలుసూక్ష్మములగు యోగశాస్త్ర విషయము లెన్నో ఆ గ్రంథమున ఆమె వివరించియున్నది. 'అంతప్పాటి, అత్తిసూడి' అను ఇతరగ్రంథములనూ రచించినది.

'అత్తిసూడి' యనిన పరమేశ్వరుడు అని అర్థము. 'అత్తి పూవును చూడాలంకారముగ దాల్చినవా'డని అర్థము. ఇది చంద్రకళవలె నుండును. శివునికి మరియొక పుష్పమం దెక్కువ ప్రీతి. అది 'ఆరగ్వధము.' 'ఆరగ్వదే రాజవృక్ష శమ్యాక చతురంగులః' అని యీ పుష్పమునకు గలపేళ్ళను అమరము దెలుపును. (ఆరగ్వదము=శేల)

వినాయకుడు ప్రణవస్వరూపి. ఆప్రణవమును భ్రూమధ్యమున ధ్యానించి అవ్వైయార్ అనుగ్రహించిన పుస్తకమే 'వినాయక అహావల్'. అవ్వైయార్నుగూర్చి యొకకథ కలదు.

సుందరమూర్తి, చేరరాజూ వీరిద్దరూ ఏనుగునూ, గుర్రమునూ ఎక్కి కైలాసమునకు వెళ్లుచూ, అవ్వైయార్ను గూడా శీఘ్రముగా రమ్మనియు, వచ్చేపక్షమున తమతో పాటు తీసికొని వెళ్ళెదమనియు అనిరట. ఆమెయో వినాయకుని

పూజామధ్యమున నుండెను. ‘‘మీరు వెళ్ళండయ్యా, నాకు కైలాసానికంటే కరివదనుడే ముఖ్యం” అని చెప్పినదట. అంతటితో వారు వెళ్ళిపోయిరట. పూజానంతరము ‘వాళ్ళందరూ వెళ్ళిపోయారే - నేనిలాగు వెళ్ళేదిరా భగవంతుడా’ అని అనుకొనినదట. ఆ ప్రార్థనను ఆలకించిన వినాయకుడు ఒక్క చిటికెలో - వారు చేరునంతలోగా - తనతుండముతో ఆమెను కైలాసము చేర్చినట.

ఇంకొక విషయము. కొన్ని వస్తువు లెంతచూచినను తనివితీరదు. చంద్రుడు, సముద్రుడు, ఏనుగు ఈతరగతిలోనివి. వానిని చూడను చూడను ఆనందమే. ఈ దేవతాశిశువుకూడ అదేవిధము. చూడచూడ మరింత చూడదోచును. ఇదియొక ఆనందతత్త్వము. ఆరని ఆశాతత్త్వం.

‘కేదారమునకు వెళ్ళితిని. గణపయ్యను గాంచితిని. అటుపై కన్యాకుమారి వెళ్ళితిని, అందును బొజ్జగణపయ్యే ప్రత్యక్షమే-’ అని యొక గణపతి భక్తుడు పొంగే ఉత్సాహముతో నాతో ననెను.

పశ్యేయ మేకస్య కవేః కృతిం చేత్
సారస్వతం కోశ మవైమి రిక్తమ్ ।
అంతః ప్రవిశ్యాయ మవేక్షిత శ్చేత్
కోణే ప్రవిష్టా కవికోటి రేషాః॥

కావ్యము లనేకములు. ఒక కావ్యమును చదివితిమా, అది భారతీదేవి ముక్తాభరణమువలె నుండును ఆమె బొక్కసమే డొల్లి అయిపోయినదా యని అనిపించును. నిజముగా ఆమె

బొక్కసమునకు వెళ్ళిచూచిన కోటికోటి కావ్యాభరణములు వెదజల్లి బడియుండును. ఇటులనే వినాయకుని తత్వమును. మనము ఒక పంచపాత్రలో సముద్రపునీరు తెచ్చితి మను కొనుడు. ఎవరయినా ఏమిటిది యనిన 'సముద్రజలము' అని అందుము. కాని సముద్రములోని నీటినంతయు దెచ్చితిమా? మన స్వానుభవమునకు గోచరించునది మాత్రము విశదపరు తుము. అది ఏ లవలేశమో.

వినాయకుడు విఘ్నహంత. ఏ కార్యమునకూ ఆయన పూజ ప్రప్రథమము. ఆయన అనుగ్రహాబల మున్న అంతా అనుకూలమే. వినాయకుని ప్రధానమూర్తిగ ఆరాధనసల్పు వారిని గాణాపత్యులని అందురు.

వినాయకుని ముందు వేయు గుంజిళ్ళకు శంకుస్థాపన చేసినది మహావిష్ణువని ప్రతీతి. ఒక సమయమున అయన చక్రాయుధమును ఈ మేనల్లుడు నోటిలో వేసుకొనెనట. బిడ్డ చేతినుండి ఏవస్తువునూ లాగికొనుట కష్టము. గణపతిమాట సరేసరి. అతనిని ఏలాగైనా నవ్వించి దానిని లాగుకొనవలె నని మహావిష్ణువు నాలుగుచేతులతో తన రెండుచెవులను పట్టుకొని గుంజీలు తీసెనట. ఈ విచిత్రప్రవర్తనమునకు వినా యకుడు దొర్లిదొర్లి నవ్వెనట. చక్రము క్రిందపడినది. మహా విష్ణువు దీర్ఘనిశ్వాసము వదలి చక్రమును అందుకొని బయట పడెనట. ఇటులు ఒక ఐతిహ్యము.

లోకమున సమస్త కార్యములు విఘ్నరహితముగా జరుగవలెనన్న వినాయకుని అనుగ్రహాబల ముండవలెను.

అందులకే త్యాగయ్య 'గిరిరాజసుతాతనయ' అని నుతించెను. మనముకూడా ఆయన అనుగ్రహపాత్రుల మగునటుల నడచు కొనవలెను.

## భయమెందుకు?

రామావతారసందర్భమున భగవానుడు తాను మనుష్యుడననియు, మనుష్యులకు కలుగు సుఖదుఃఖములకు తానును పాత్రమనియు, వానిని అనుభవించుచూ ఇతరు లెవరయినను స్తోత్రముచేయుచో 'ఆత్మానం మానుషం మన్యే' యనియు చెప్పుచుండిరి. ఇదేవిధముగా శంకరభగవత్పాదులు పరమేశ్వరుని అవతారమూర్తులైయుండియు, మానవజన్మ మెత్తినందులకు మానవులరీతిగనే ఈశ్వరోపాసనచేయుచు, భక్తిప్రపత్తుల ఆవశ్యకతను ఇతరులకు ఉపదేశించిరి.

"కరలగ్నమృగః కరీంద్రభంగో
ఘనశార్దూల విఖండనోస్త జంతుః।
గిరిశో విశదాకృతిశ్చ చేతః
కుహరే పంచముఖోస్తి మే కుతో భీః॥"

అని శివానందలహరిలో శివునిగూర్చి చెప్పుచు 'పరమ శివుడు హృదయకుహరమున నుండగా భయమునకు తావేది?' యని ప్రశ్నించిరి.

ఈశ్వరుని కుడిచేతియందు జింకపిల్ల ఉన్నది. జింకస్వభావము అతిచంచలము. మనుష్యుని మనస్సుకూడా చంచలమే. 'చంచలం హి మనః కృష్ణ' యని అర్జునుడు కృష్ణునితో విన్న

వించుకొనెను. కాని శివునిచేతిలోని చంచలమగు హరిణము మాత్రము చేష్టదక్కి చాంచల్యరహితమై, ఈశ్వరుని కనుల సౌందర్యములో మగ్నమై ఆనందించును.

కరిచర్మమును పైనకప్పుకొన్న కారణమున ఈశ్వరునికి కృత్తివాసుడని పేరు. కృత్తియనగా కరిచర్మము. ఒకప్పుడొక పెద్ద ఏనుగు ఈశ్వరుని ఎదిరించగా, ఆయన ఊర్ధ్వతాండవము చేయుచు, దానిని కాలిచే నెగజిమ్మి, క్రిందబడగొట్టి, చర్మమొలిచి వస్త్రముగా ధరించెనట. వేదములందు సయితము 'కృత్తిం వసానః' అని కలదు. మరొకచోట 'కృత్తివాసాః పినాకీ' అనియున్నది. సంస్కృత నిఘంటువులలోని ఈశ్వరుని పేళ్లలో ఈ పేరుగూడ కనబడును.

నిఘంటువునకు పర్యాయపదము కోశము. అనగా శబ్దకూటముల కోశము. ఆదినుండి అంతమువరకు గల శబ్దసముదాయము ఇందు ఇమిడియుండుటచే దీనికి 'అకారాది' యనియు పేరు. కోశములన్నిటిలో అమరసింహుని అమరకోశమునకే ప్రశస్తి.

అమరసింహుడు జైనుడు. మహాబుద్ధిమంతుడు. అతనికి ఈడు ఎవరునులేరు. ఇతడు ఎన్నో పుస్తకములను వ్రాసెను. శ్రీ శంకరాచార్యులు దిగ్విజయముచేయు సమయమందు అమరసింహునికిని, ఆయనకును తర్కమొకటి జరిగెను. వేదబాహ్యములగు ఆచారములు జైనమతమునందు అనేకములున్నవి. వారికి దైవములేదు. బౌద్ధులకు అంతిమవస్తువు 'శూన్యము.' జైనులు 'ఏవస్తువయినా ఉంటే ఉండవచ్చును, ఉండకనూ పోవచ్చును. ఉండియూ లేకుండా ఉండవచ్చును.' అని అనేకాభి

ప్రాయములు కలవారు. 'ఆత్మయే సర్వవ్యాపకమగు వస్తువు; పరిపూర్ణవస్తువు.' అని ఉపనిషత్తుల అభిప్రాయము. వీనినంతయు పరిశీలింతమని ఆచార్యులు అమరసింహుని వాదమునకు పిలిచిరి. కాని వాదమున అమరసింహుడు ఆచార్యుల ప్రశ్నలకు సదుత్తరముల నొసగజాలడయ్యెను. జైనుడైనను అతడు 'సరస్వతీ' ఉపాసకుడు. అందుచే ఆమె కటాక్షించి 'నీవు నన్ను ఆవాహన చేసినచో శంకరాచార్యుల ప్రశ్నలకు నేనే బదులుచెప్పెదను' అని అనుగ్రహించినదట. అమరసింహుడు ఒక తెరగట్టి, కలశమున సరస్వతిని ఆవాహనచేసి, తెరముందు శంకరులను కూర్చొనుమని, తెరచాటున తాను కూర్చొని బదులు చెప్పెదనని ఆయనతో ఏర్పాటు చేసికొనెను. ఈకథ కొంతవరకు సాగినది. త్వరలోనే తానడుగు ప్రశ్నలకు బదులిచ్చునది అమరసింహుడు కాదనియు, వాగ్దేవియే ప్రతివాదినిగా తయారయినదనియు శంకరులు గ్రహించిరి.

"ఇట్టి భ్రష్టునిపక్ష మవలంబించియా నీవు నాకు బదులు చెప్పుచున్నావు; ఇతడు ఇతరులకు దేవుడు లేడని చెప్పువాడుకదా" యని ఆయన మనస్సులో తలచినంతనే ఇక నేను బదులు చెప్పనని సరస్వతి అంతర్ధాన మాయెను.

వాదమున పరాజితుడయిన అమరసింహుడు ఆచార్యుల పాదములకు ప్రణమిల్లెను. ఓటమి హృదయమున గాటముగా నాటుకొన్నది. తాను వ్రాసిన పుస్తకము లన్నియు అగ్ని కాహుతి చేయగోరి ఒక్కొక్కటిగ అగ్నిలో పడవేయదొడగెను. ఆదిశంకరులకు యిది తెలియరాగా, వారు అతనిని మందలించి "ఏ మతమునకు చెందినవాడ వయిననేమి? నీవు బుద్ధిమంతు

డవు. నీవు వ్రాసిన గ్రంథములు గొప్పవి. వీని నేల తగులబెట్ట వలె?" నని నివారించిరి. కడపటకు మిగిలిన దొక్క అమర కోశమేనట. ఇదియొక కథ.

సంస్కృతమున రఘువంశము, నైషధము, మాఘము, కిరాతార్జునీయము, కుమారసంభవము అనునవి పంచకావ్యములు. తమిళమునగూడ చింతామణి, విలైయాపతి యనునవి జైనగ్రంథములు. వీని తరువాతనే చోళరాజు శివభక్తుడై అరువదిమూడు నాయనార్ల (శివభక్తులు) చరిత్రను తెలుపు పెరియపురాణమును (పెద్దపురాణము) వ్రాయ నియోగించెను. జైనగ్రంథములే తమిళమున తొలుదొలుత వ్రాయబడినవి.

అమరసింహుడు జైనమతస్థుడైనను వైదికమతగ్రంథముల లోని పదములకు సరియగు అర్థమునే చెప్పెను. కాని బౌద్ధమత ప్రశంస వచ్చుసరికి బుద్ధునికి చెందిన పదములన్నియు, జినుని కన్వయమగునట్లు వ్రాసెను. మనస్తాపములూ, జగడములూ దూరమందున్నవారితో నేర్పడవు. కస్సు బుస్సు లన్నియు దాపుననున్నవారితోనే. బౌద్ధ జైనములు అక్కచెల్లెండ్రు కనుక బౌద్ధమత విషయమున మాత్రము అమరసింహుని నిష్పాక్షికత నిలువజాలక పోయెను. బుద్ధునికి తథాగతుడని పేరు. కాని అమరకోశమున తథాగత నామము జిననామములలో వ్రాయబడినది. ఇదియే కాదు, ప్రసిద్ధుడైన బుద్ధుని అంగరక్షకుడు సుగతుడు. ఇతని పేరుగూడ జినపర్యాయముగా వ్రాయబడినది. ఇది పక్షపాతమే. కాని వైదికమత సంబంధములగు పేర్లలో మాత్రము అమరసింహుడు పక్షపాతము కొంచెమైనను లేక ఈశ్వరుని పేళ్ళలో దేనినీ వదలక వ్రాసెను.

"శంభు రీశః పశుపతిః శివః శూలీ మహేశ్వరః
ఈశ్వరః శర్వ ఈశానః శంకర శ్చంద్ర శేఖరః,
భూతేశః ఖండపరశు ర్గిరీశో గిరిశో మృడః
మృత్యుంజయః కృత్తివాసాః పినాకీ ప్రమథాధిపః॥"

అని వేదములందును, పురాణములందును గల పదము లన్నిటినీ పేర్కొనెను. వేదములలోని కర్మకాండలో ఈశ్వర నామము బహుళ్యముగా నున్నది. 'కృత్తివాసః పినాకీ'యని అమరమున గలపదములు వేదమునందునూ, ఆయుష్య హోమమునందునూ కలవు.

ఈశ్వరుడు ఏనుగు చర్మము నొలిచి పైనతాల్చుట తానొక పెద్దవస్త్రాదని చెప్పుకొనుటకా? కృష్ణుడుకూడ ఏనుగును, కొంగను చంపెనందురు. కృష్ణునివలెనే తనకుకూడా కొద్దియో గొప్పయో పేరు రావలె ననియా? కాదు. ఈ ఏనుగు భౌతికమైనది కాదు.

ఒక కాలమున ఋషులందరు 'వేదోక్తములగు కర్మానుష్ఠానముల నాచరించిన జాలును. ఈశ్వరధ్యానము, ఈశ్వర భక్తి అనవసరము.' అని మిగుల గర్వముతోను,అహంభావము తోను వుండిరి. 'మనకు వేదములున్నవి. కర్మానుష్ఠానమున్నది. అదే ఫలము నిచ్చును. దీనికి మించిన ఈశ్వరుడు వేరెక్కడున్నాడు? ఆతని భక్తి, స్వరూపధ్యానము మనకెందుకు?" అని అనుకొన్నారట

ఈవిషయము గూర్చియే మండన మిశ్రులకును, శంకరులకును పెద్దవాదము జరిగి మండనమిశ్రులు ఓడిపోయిరని

శంకర విజయమునందు చూచుచున్నాము. వట్టి కర్మలను మాత్రము చేయుచు, తత్త్వవిచారణ చేయనిచో ప్రయోజనము లేదు. ఉపనిషత్తుల ముఖ్య ప్రయోజనము తత్త్వ విచారణమే.

"త్రైగుణ్య విషయావేదా నిస్త్రైగుణ్యో భవార్జున"

అని గీతయందు భగవానులు చెప్పిరి. వేదములు త్రిగుణ విషయములు. ఈ త్రిగుణములును సాధనముగా తీసికొని వానిని దాటుటయే వాని ప్రయోజనము. వేదములందలి కర్మానుష్ఠానముల నాచరించుచు, త్రిగుణములలో చిక్కుకొని యుండుటను చూపి, 'అన్నిటినీ ఈశ్వరార్పణ చేసినచో గుణాతీతుడవగుదువు' అని భగవానుడు గీతలలో చెప్పిరి. వట్టి కర్మానుష్ఠానము బుద్ధిమంతుని పనికాదు. కర్మానుష్ఠానమును మాత్రము నమ్ముకొన్నవారికి బుద్ధిలేదనియూ, వారిబుద్ధి హోమధూమమువలె మాయమగుననియూ వేదములే చెప్పుచున్నవి. అందుచేతనే 'నిస్త్రైగుణ్యో భవార్జున' యని నిస్త్రైగుణ్యముగూర్చి కృష్ణపరమాత్మ కడుశ్లాఘ్యముగ పలికిరి.

'ఈవేదము లన్నియు ఎవరి చరణారవిందముల నన్వేషించి, గమ్యముచేరి, అచట నిలిచిపోవుచున్నవో, ఆ పాదాబ్జములే నీవు పోయి చేరదగిన తుది' అని కఠోపనిషత్తు.

'కేవలము వైదిక కర్మలను చేయుచు ఈశ్వరుని తెలిసికొననివాడు, నిప్పులో కట్టెయలువేసి పొగపెట్టినవాడు అగును. ఆత్మస్వరూపమును వాడు ఒక్కనాటికినీ తెలిసికొనలేడు' అని శ్రుతిలో కర్మకాండయందే చెప్పబడినది.

'ఆత్మస్వరూపమును తెలిసికొన్న తర్వాత అతనికి వేదములతో పనిలేదు. దేవతలతో పనిలేదు. బ్రాహ్మణులతో పనిలేదు.' అని బృహదారణ్యకమున నాలుగవ అధ్యాయమున చెప్పబడినది.

కారణము - వారు అన్నిటికినీ మూలమైన వస్తువు ఏదియో ఆవస్తువు వేరు, మనము వేరు అన్న భేదభావము లేక దానితో కలసిపోయెదరు కనుక శంకర మండనమిశ్ర వాద పర్యవసానమును, కృష్ణభగవానులు గీతయందు 'నిస్త్రైగుణ్యో భవార్జున' యని చెప్పినదియు నిదియే. ఎవరికయిన విస్మరణ కల్గినచో - దారుకావన తాపసులకువలె - ఈశ్వరలీల యీ విషయమును మరల జ్ఞప్తికి తెచ్చును.

దారుకావన తాపసులు 'వేదచోదితములగు కర్మానుష్ఠానములు చాలును; ఈశ్వరు డనవసరము' అని అహంకారముతో నుండిరి. ఇది ఈశ్వరునికి తెలిసినతోడనే వారికి జ్ఞానము కల్గించవలెనని, బిచ్చగాని వేషము వేసి బయలు దేరెను. వేషము అధిక వశీకరణ పాటవము. భిక్షాపాత్రముతో ఈశ్వరుడు ఋష్యాశ్రమము జొచ్చెను. ఆ వేషమును చూచిన ఋషిపత్నులు 'నేను, నాది' యనునది మరచి స్వరూపానందమగ్నులై ఆయనవెంట బడిరి.

'నాది' యను చోటనే అందరికిని ప్రీతి. మన తల్లిదండ్రులయందు గల ప్రీతికి కారణము - 'మన' యనుటచేతనే. ఆ ప్రీతి ఇతరులయందు మృగ్యము. ఈ 'నేను, నేను' అను అభిమానము ప్రియము. ఇది కట్టకడపట ఆత్మస్వరూపమునందు లయ

మగును. భగవానుడే అందరికిని ఆత్మస్వరూపుడు. కృష్ణభగవానుని వెంట దవిలిన గోపికలరీతిని, వశీకరణచక్రవర్తి భిక్షాటనమూర్తిని చూచినతోడనే అహంకార విరహితులయి, భర్తల శుశ్రూష, హోమద్రవ్యసంచయము అన్నిటిని మరచి ఋషిపత్నులు ఆయనవెంట వెళ్ళసాగిరి.

కర్మానుష్ఠాతలైన ఋషి చక్రవర్తులకు భిక్షాటనచక్రవర్తిపై కోపమువచ్చెను. "ఈ బిచ్చగాడెవడు! శూన్యము పెట్టువానివలె నున్నాడే? మన ఇల్లాండ్రను మోహపెట్టి వశమొనరించుకొని తనవెంట దీసికొనిపోవుచున్నాడే"అని యతనిని ఎదిరించిరి. వీరిశక్తి ఆయన ముందెంతటిది? రోషముతో అభిచార ప్రయోగము లనేకము చేసిరి. ఒక మత్తగజమును సృష్టించి ఆయనపై వదలిరి. వారి అహంభావస్వరూపమో యనదగు ఆ ఏనుగు ఆయనపై ఘీంకరించెను.

వెంటనే ఈశ్వరుడు ఊర్ధ్వతాండవముచేయుచు దానిని కందుకమువలె పైకి నెగజిమ్మి ఛిన్నాభిన్నము గావించి దాని చర్మమును వస్త్రమువలె కప్పుకొనెను. అటుపై ఋషులకు జ్ఞానోదయము కల్గి, భక్తులై సద్గతిని పొందిరని ఒకకథ.

"కరలగ్నమృగః కరీంద్రభంగో,
ఘనశార్దూల విఖండనోఽస్త జంతుః॥"

ఎప్పుడూ చకితనయనములతో మృగశాబకము ఈశ్వరుని నయనవిలాస నైపుణిని తదేకదృష్టితో చూచుచున్నది. పులి యనిన అందరికిని భయమే. కానీ ఈశ్వర సమక్షమున పులిభయమును జింక మరచిపోయెను.

సృష్టి స్థితి సంహారములకు అధికర్త ఈశ్వరుడు. సర్వ ప్రాణులకు ప్రాణముగా నుండునది ఆతడే. అతనియందే చరాచర ప్రపంచములన్నియు అణగును.

'గిరిశో విశదాకృతిశ్చ చేతః
కుహరే పంచముఖోస్తి మే కుతో భీః'

ఈశ్వరునికి ఐదుముఖములు. నాలుగుముఖములందును నాలుగు వేదములు ఈశ్వరుని శ్వాసగానున్నవి. ఊర్ధ్వముఖముతో ఆయన ప్రణవము నుద్ఘాటించును.

ఏనుగుతోలు పచ్చడము. నడుములో పులితోలు, చేతిలో జింకపిల్ల. ఈ లక్షణము లెట్లున్నవనగా - గుహాలోని యొక పెద్దసింహము, ఒకజింకను పట్టుకొని, గోళ్ళతో పులిని చంపి, ఏనుగు కుంభస్థలమును వ్రయ్యలించి దాని చర్మము పైనవేసికొన్నరీతి నున్నది. ఆకృత్తివసానుడు మనకు స్వాధీనుడగువో భయమునకు తావేది ?

'కుహరే పంచముఖోస్తి మే కుతో భీః?'

'పంచముఖ' అనేది ఈశ్వరునికినీ, సింహమునకునూ పేళ్ళు. వ్యాకరణశాస్త్రరీతిని పంచ యనగా విస్తారము అని అర్థము. విశాలమైన ముఖముకల్గి, దానికి తగిన దేహము లేకుండుటచే సింహమును పంచముఖమని అందురు. పైభాగము వెడల్పుగ క్రిందిభాగము చిన్నగ ఉండుటచే, సంధ్యావందనాదులకు మనము ఉపయోగించెడిపాత్రకు పంచపాత్రమని పేరు. 'కుహరే పంచముఖోస్తి మే కుతో భీః?' అనుటలో గుహాలో సింహమున్నప్పుడు భయమేమిటని ఒక అర్థము. హృదయ

కుహరమున, దహరాకాశమున ఈశ్వరుడుండగా నాకేమి భయము? అని మరియొక అర్థము. 'కుతో భీః' యని శంకరులు శివానందలహరిలో స్తోత్ర మొనరించిరి. ఆదిశంకరులే ఈశ్వరావతారము. మన భయములను పోగొట్టుటకే వారి అవతరణ. ఉపదేశార్థము తాను భీతినందినట్లు కల్పించిరి.

శంకరుల దయాస్రవంతిలోని తరంగమే ఈ శివానందలహరి. మన కష్టములు, దుఃఖములు, భీతిని పోగొట్టునది స్వామి. అట్టి స్వామిని హృదయస్థునిగ జేసి ధ్యానించిన, భయనివృత్తియు, మృత్యునివృత్తియు కల్గును.

అప్పుడు ఆచార్యులతోపాటు మనమున్నూ 'కుతో భీః' అని గుండెపై చేయివేసి అనగలము.

## ఉపనిషత్తులలోని ఉమాదేవి.

ఉపనిషత్తులను వేదశిఖరములని అంటారు. వానిలో—

ఈశ కేన కఠ ప్రశ్న ముండ మాండూక్య తిత్తిరి,
ఐతరేయం చ ఛాందోగ్యం బృహదారణ్యకం దశ॥

అనే దశోపనిషత్తులు ముఖ్యములు. 'ఈశావాస్యమిదం సర్వం' అని ప్రారంభించేదానివల్ల ఒకదానికి ఈశావాస్యోపనిషత్తు అన్న పేరు కల్గింది. రెండవది కేనోపనిషత్తు. కొన్ని ఉపనిషత్తులు కథామూలకంగా తత్త్వబోధ చేస్తుంది. ఈక్రిందికథ కేనోపనిషత్తులోనిది.

ఒకప్పుడు దేవ దానవులకు ఒక యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో దానవు లోడిపోయి దేవతలు గెలిచారు. వారి సంతోషం ఇంత అంత అని చెప్ప తరముకాక పోయింది. జయించాముకదా ఇంకేం ఒక విజయోత్సవము చేసుకొందాం అని అనుకొన్నారు. ఆ విజయానికి కారణం అంతా తమశక్తి సామర్థ్యాలే అని అనుకొన్నారు. అహంభావం వారిలో అంద రికిన్నీ పెరిగింది. నేను ఇంతవాడిని నేను అంతవాడిని అని స్వోత్కర్షకు పూనుకొన్నారు. వీళ్ళ అహంభావాన్ని పరమాత్మ కనిపెట్టినాడు. వీళ్ళకున్న ఈప్రగల్భత పోతేకానీ వీళ్ళకు క్షేమం లేదనుకొన్నాడు. బుద్ధి చెప్పాలనుకొన్నాడు.

దేవతలకు అల్లంతదూరంలో భూమ్యాకాశపర్యంతం ఒక దుర్నిరీక్ష్యమైన ప్రకాశము ఆవరించినది. దానిని చూచిన దేవతలకు ఆశ్చర్యంవేసినది. 'ఇదేమిటో అర్థంకావటంలేదే? సర్వజ్ఞులమైన మనబుద్ధులకుకూడా ఇదేదో అతీతంగా ఉన్నదే?' అని వాళ్ళు అనుకొన్నారు. పోయి దానిని పరిశీలించిరమ్మని అగ్నికి ఆజ్ఞ నిచ్చారు. అగ్ని ఆ ప్రకాశమున్నచోటికి అడుగులు వేసికొంటూ నడచినాడు. ఆజ్యోతి భూమ్యాకాశాల మధ్య కట్టిన ఒక పెద్దవంతెనవలె అఖండంగా మహోన్నతంగా ఉండినది. దానికి ప్రాణమున్నట్టుకూడా గోచరించింది. 'నీవు ఎవ'రని అడుగుదామని అగ్ని అనుకొంటూ ఉండగానే ఆప్రకాశమే, ఆ యక్షస్వరూపమే అగ్నిని 'నీవెవరవు' అని ప్రశ్నించినది.

'నేనా? నేను అగ్నిని. జాతవేదుడిని.'

'నీకేమి శక్తులున్నాయి?'

'నేను దాహకుడిని. ఏవస్తువునైనా ఇట్టే కాల్చివార వేయగలను.'

'ఏదీ నీశక్తిని కాస్తచూద్దాం. ఈగడ్డిపోచను కొంచెం కాల్చిచూడు, కాలుతుందేమో?'

అగ్ని ఇంతేనా అని అనుకొన్నాడు. గడ్డిపోచను సమీపించినాడు. అది కాలలేదు. ఇదేం విచిత్రంగా ఉన్నదే! తన ఉష్ణాన్ని అంతటినీ కేంద్రీకరించినాడు. ఉహూ. ఆ గడ్డి పోచ యథాప్రకారంగా చెక్కుచెదరక ఉన్నది. అగ్ని అవ మానంతో వెనుదిరిగినాడు.

అగ్నికథను ఆశ్చర్యంగా విన్నారు దేవతలు. 'అగ్నికి చేతకాలేదు. పోనీ, నీవైనావెళ్ళి దానితంతు ఏమిటో కను క్కొని రారాదూ?' అని వాయుదేవుణ్ణి ప్రోత్సహించినారు. ప్రభంజనుడు సరే అన్నాడు.

అగ్నిది దాహకశక్తి. వాయువుది విచలీకృతంచేసేశక్తి. అగ్ని, యక్షముల కేవిధంగా మాటలు జరిగినవో అదేవిధంగా వాయు, యక్షములకున్నూ సంభాషణ సాగింది. వాయువు తాను దేనినైనా ఎగురగొట్టగల నన్నాడు; తనపేరు మాత రిశ్వుడన్నాడు. కాని పరీక్షలో అగ్నివలెనే ఓడిపోయినాడు.

సప్తజిహ్వుడూ, సమీరుడూ సాధించలేనికార్యం సహ స్రాక్షుడు కాకపోతే మరెవరు సాధించగలరు?

ఇంద్రుడు యోచించసాగినాడు. జయం కల్గిందికదా అని ఆనందంగా ఉంటే, ఈ ప్రకాశపు గొడవ ఒకటి వచ్చి పడినదే? ఈ ప్రకాశానికి ఎంతశక్తి ఉంటే, దాహకుణ్ణీ ప్రభం

జనుడినీ సులభంగా శృంగభంగంచేసి వెనకకు మళ్ళగొట్టగల్గు తుంది? యోచించేకొద్దీ, విచారించేకొద్దీ అహంభావము కొంత కొంత పోయి దేవుని గుర్తు దేవతాప్రభువుకు కల్గ సాగింది.

ఇంద్రుడు మెల్ల మెల్లగా నడుస్తూ ఆ కాంతిపుంజాన్ని సమీపించగానే, ఆప్రకాశమూ మెలమెల్లగా అంతరించి, ఆచోట ఆ ప్రకాశానికి బదులు పరమ కరుణాస్వరూపిణి ఐన ఒక స్త్రీ స్వరూపం పొడగట్టింది. స్వర్ణాభరణభూషిత, హిమ గిరి సుత - ఉమ ఆకాశమధ్యంలో గోచరించింది.

ఆ జ్ఞానస్వరూపిణికి, స్వర్గాధిపతి నమస్కరించినాడు. 'ఇంతవరకూ ఇక్కడనే ఉండి, దేవతలను చిక్కుపెట్టుతుండిన, ఆ ప్రకాశమేమిటో తెలియకున్నది. దాని తాత్పర్యమేమి తల్లీ!' అని ప్రశ్నించినాడు.

'నీవు చూచినది బ్రహ్మస్వరూపము. ఈ ప్రపంచానికీ, సమస్త దేవాసురులకూ, అన్నిటికీ కారణం ఆయనే. ఈ లోకంలో నానారూపాలతో నయనాలకు గోచరించేదీ ఆయనే' అని అంబ అమరేంద్రునకు బోధించింది.

మనం ఒకొక్కప్పుడు బుద్ధిచెప్పటకోసం ఒకనిని అవ మానింపవలసి వస్తుంది. దాని ఉద్దేశం మనస్సునకు నొప్పి కలుగచేయటం కాదు. అహంభావాన్ని తొలగించడం. అహం భావం పోయినక్షణమే అనుగ్రహామున్నూ చేయాలి ఇంద్రున కెపుడు అహంభావంపోయినదో, ఆక్షణమే అంబిక అతనిని అను గ్రహించినది. తక్కినవారు చూచినప్పటికీ బ్రహ్మస్వరూపము

వారికి అవగతంకాలేదు. వారికి వారివారి అహంభావమే అడ్డు వచ్చింది. ఇంద్రుడొక్కడు మొదట కొంత అహంభావ పడినా, దానిని అణచుకొన్నందువల్ల భగవంతుని గుర్తుతెచ్చుకొన్నందువల్ల బ్రహ్మస్వరూపాన్ని తెలుసుకోవడమే కాకుండా అంబికా దర్శనభాగ్యమూ, అజ్ఞానస్వరూపిణినుండి ఉపదేశ భాగ్యమున్ను పొందగల్గినాడు. అందుకే అతనిని ఇంద్రుడన్నారు.

జ్ఞానస్వరూపమే ఉమ. సర్వజ్ఞుడైన ఈశ్వరుని సహచారిణి ఆమె. అగ్ని - దాని దాహకశక్తీ, సుమమూ - దాని సౌరభ్యమూ, అమృతమూ - దానిమాధుర్యమూ ఎట్లు ఒకదానిని వదలి మరొకటి ఉండదో, అట్లే జ్ఞానప్రసూనాంబిక, ఉమ ఆసర్వజ్ఞుడి అర్ధాంగిగా అవినాభావంగాఉన్నది. ఆచార్యులవారు భాష్యము వ్రాస్తూ 'నిత్యమేవ సర్వజ్ఞే నేశ్వరేణ సహావర్తతే' అని సెలవిచ్చినారు.

అగ్నికి ప్రకాశ గుణమున్నది. ఉష్ణగుణమూ ఉన్నది. ఉష్ణం ఎక్కువైతే ప్రకాశాన్ని అనుభవించలేము. ఉష్ణరహిత ప్రకాశాన్నే అనుభవించగలము. మిణుగురుపురుగులది ఉష్ణరహిత ప్రకాశము. వానిలో ప్రకాశాంశము ఎక్కువ. ఉష్ణాంశము తక్కువ.

అంబికా స్వరూపము అత్యంత శీతలమును, అత్యంత ప్రకాశమును ఐనది. మేఘావృతమైన ఆకాశంలో మెరసే మెరపుతీగవలె ఉన్నది ఆమె ఆకృతి. నెవ్వారి ధాన్యమునకు మొనలు సూక్ష్మములు. అంబిక 'నీవార శూకవత్తన్వీ'. మూలాధారంనుండి సహస్రారంవరకు ఆమె సన్నగా సూక్ష్మాతి సూక్ష్మంగా తామరతూడులోని తంతువువలె వ్యాపించి

యున్నదని మంత్రశాస్త్రము చెప్పుతున్నది. దేవతల అహం భావాన్ని పోగొట్టడానికి పరమాత్మ జ్యోతిర్మయంగా భూనభో పర్యంతం నిలచినపుడు ఆయనలో అంతర్లీనమై నిలచినదీ ఆమెయే.

వేదశీర్షమగు కేనోపనిషత్తును ఆధారంగా ఉంచుకొని సౌందర్యలహరిలో ఆదిశంకరులు ఈవిధంగా వ్రాసినారు.

శృతీనాం మూర్ధానో దధతి తవయౌ శేఖరతయా
మమాప్యేతౌ మాతః శిరసి దయయా దేహి చరణౌ,
యయోః పాద్యం పాథః పశుపతి జటాజూటతటినీ
యయోర్లాక్షా లక్ష్మీ రరుణహరి చూడామణి రుచిః.

మనవారికి వేదములు ప్రధానం. ఒక కొండకు వేదగిరి, వేదాచలమనీ పేరు. దానినే తిరుక్కళికుంద్రమని ఇప్పుడు అంటున్నారు. వేదారణ్యమని ఒకక్షేత్ర మున్నది. అరవ భాషలో 'వత్తు' అంటే వేదము. తిరువత్తూరు అనే పదంలో వేదప్రసక్తి యున్నది. కొన్ని క్షేత్రములలోని అర్చామూర్తులకు ఋగ్వేదేశ్వరుడు, సామవేదేశ్వరుడు అన్న పేళ్లుకూడ ఉన్నవి. వేదములు క్షేత్రరూపంగాను, మహాలింగ స్వరూపంగానూ ఉన్నవనుట కివి నిదర్శనము. కేనోపనిషత్తు పరమాత్మయే అనుగ్రహము చేయుకాలమున ఉమగ ఆవిర్భవించెనని తెలుపుతున్నది.

పరబ్రహ్మమునుగూర్చి ఆరంభించునపుడు 'ఓం' అని ఆరంభించుట వాడుక. అకార ఉకార మకారములుచేరి ఓంకారమగుచున్నది. అనుగ్రహ కాలములో ఉమాదేవిగా, ఉకార

మకార అకారములుగ మారివచ్చునని చెప్పుదురు. 'ఉమాం ఓం ఇత్యుపాసీత' యని ఆమె ప్రణవస్వరూపిణియు నై యున్నది. పతంజలి తమ యోగసూత్రములందు మూలపరస్వరూపము నకు ఓంకారమే పేరు అని సెలవిచ్చిరి. వేదాంతమునందునూ ఈసత్యమే చెప్పబడినది.

శ్రుతీనాం మూర్ధానో దధతి తవ యౌ శేఖరతయా,
మ మాప్యేతౌ మాతః శిరసి దయయా దేహి చరణౌ॥

'శ్రుతీనాం మూర్ధానః' అనగా వేదశీర్షములు. శృతీ నాం మూర్ధానః' అన్న పదాలను చూచినవెంటనే, ఆచార్యులు కేనోపనిషత్తును మనస్సునందుంచుకొనియే ఈశ్లోకాన్ని వ్రాసిరని సులభంగా తట్టుతుంది. 'వేదశీర్షములైన ఉపనిషత్తులే నీచరణములను శిరోభూషణములుగా గ్రహిస్తున్నవి. అట్టి నీ పావనపదపంకజములను నామూర్ధమందు నిలిపి నన్ను పవిత్రుణ్ణి చేయి.' వేరొకచోట 'స్నపయ కృపయా మా మపి శివే' అని ఆచార్యులు అన్నారు. ఇచట'మ మాప్యేతౌ మాతః'అన్నారు. ఇవన్నీ మనబోటివారిని ఉద్దేశించి, ప్రార్థనా విధానాన్ని బోధించడానికే ఆచార్యులు వ్రాసినారని గ్రహించాలి మనం.

'దేవతల అహంభావాన్ని పోగొట్టినావు. అట్లే నాదురితములన్నిటినీ తొలగద్రోచి, నా అరిషడ్వర్గాలను హతమార్చి అజ్ఞానాన్ని ఆమూలంగా నశింపజేసి, చిత్తశుద్ధిని నీచరణ స్పర్శతో అనుగ్రహించేయి. శివుని జటాజూటంలో పుట్టిన గంగ నీకు పాద్యమౌతున్నది. మహావిష్ణువుయొక్క కౌస్తుభం నీ పాదముల లాక్షాలక్ష్మితో మరింత అరుణత్వ మొందుతున్నది.

అట్టి మహోత్కృష్టములైన నీ పాదాలను, నీవు దయతలచిన తలదాల్చేదానికి సిద్ధంగా ఉన్నాను' అని ఆచార్యులు సౌందర్య లహరిలో అమ్మవారితో మొరలిడుతున్నారు.

ఈరోజు శుక్రవారం. దేవీ ప్రధానమయిన దినం. కేనోపనిషత్తులో వర్ణింపబడిన జ్ఞానస్వరూపిణి ఉమాదేవిని ధ్యానించి, అందరము జన్మసఫలము చేసికొందుముగాక.

## ర త్న త్ర య ము.

'సాధారణే స్మరజయే నిటలాక్షిసాధ్యే
భాగీ శివో భజతు నామ యశః సమగ్రమ్,
వామాంఘ్రిమాత్రకలితే జనని త్వదీయే
కా వా ప్రసక్తి రిహ కాలజయే పురారేః॥'

అర్ధనారీశ్వరతత్త్వమున పార్వతీపరమేశ్వరులకు ఏకశరీరము. అర్ధశరీరము అంబిక, మిగులు సాబాలు శివుడు. వీరికి సమస్తజీవరాసులు సంతానప్రాయము. అరవభాషలో ఈశ్వరునికి 'తాయుమానవర్' అనియు, 'అమ్మైయప్పన్' అనియు రెండుపేర్లున్నవి. అమ్మ, అబ్బ రెండును వారే యగుటచే 'అమ్మైయప్పన్' అని వాడుక. ఈశ్వరుడు జీవరాసులకు జనకుడేకాదు, జననియు. అద్దాన వారిని 'తాయుమానవర్' అనియు అందురు. ( తాయుమే తల్లియు, అనవర్ అయినట్టి వారు. ) ఏకవస్తువగు అర్ధనారీశ్వరతత్త్వమున జననీజనకుల తాదాత్మ్యము చూడనగును.

అర్ధనారీశ్వరు లెటులో శంకరనారాయణుల మూర్తియు అట్టిదే. దక్షిణమున తిరునల్వేలిజిల్లాలో శంకర్‌నయినార్ కోయిల్ అను ఊరిలో ఒకేమూర్తిలో శంకర నారాయణ స్వరూపముగా భగవానుడుండుట నేటికిని మనము చూడ వచ్చును. ఇటులే మైసూరునకును, మహారాష్ట్రదేశమునకును మధ్య 'హరిహర' మనెడు క్షేత్రమున హరియు, హరుడును ఏకస్వరూపమునం దిమిడి యున్నారు.

శంకరనారాయణ స్వరూపమును, అర్ధనారీశ్వర స్వరూపమును రెండునూ ఒకటేయని చెప్పుటకు శాస్త్రములో ఆధారములు కలవు. మహావిష్ణువు ఈశ్వరునిలో నొకభాగము; ఈశ్వరుడును మహావిష్ణువులో నొకభాగమని చెప్పుటకు పురాణముల మూర్తులు, క్షేత్రములు ఆధారములు.

తమిళదేశమున వెలసిన మహాభక్తులు, పూర్వము విష్ణుక్షేత్రములు దర్శించు సందర్భమున, ప్రతిక్షేత్రమునను మంగళాచరణ స్తుతులను వ్రాసియున్నారు. శివభక్తులును ఇదే విధముగా స్తోత్రమొనరించిరి. అట్లు యీభక్తులుచేసిన స్తోత్రములుదివ్యప్రబంధములందును (ఇవి వైష్ణవములు), తేవారములందును (ఇవి శైవములు)చూడనగును. తిరుమంగైయాళ్వారు పెరుమాళ్లనుగూర్చి పాడునపుడు —

పిఱైదంగు చడయానై వలత్తేవైత్తు
పిరమనైత్తన్ ఉన్దియలే తోర్ట్రువిత్తు.

— పెరియతిరుమొళి 3-49.

అని నుతించిరి. పెరుమాళ్లు తన కుడిభాగమున చంద్రశేఖరుడగు శివుని ధరించెను. 'ఉన్ది' యనగా 'నాభి' యని అర్థము.

నాభీకమలమున నుండియే చతుర్ముఖబ్రహ్మ ఆవిర్భవించినది. దక్షిణపార్శ్వమున శివుడున్నరూపమే శంకరనారాయణుడు.

అదేవిధముగా, తేవారమునందును

'కుడమాడియ్యై ఇడత్తే కొండు'

అని కలదు. కుడమాడి అనుపేరు విష్ణువునకును, కృష్ణపరమాత్మకును చెందినది. కడవలను మోసి, గోపికలతో సయ్యాటలాడిరట. (కుడం=కడవలు = బిందెలు, ఆడిఆడినవారు) అట్టి 'కుడమాడి'ని యెడమభాగమునందు కలవాడు ఈశ్వరుడు.

ఆళ్వారు-విష్ణువు కుడిభాగమున శివుడున్నటులను, శివభక్తుడు-శివునికి ఎడమభాగమున విష్ణువున్నట్లును వర్ణించిరి. వీరి వ్రాతలనుబట్టి శివవిష్ణువు లొకేస్వరూపమనియు, హరియును, హరుడును, శంకరుడును, నారాయణుడును ఏకశరీరముతో నున్నారనియు తెలియుచున్నది.

ఈశ్వరుని వామభాగమున నారాయణుడున్నాడనిన, ఆచోటుననేకదా అంబికకూడ ఉండుట. అందుచే నారాయణునకును ఈశ్వరికిని అభేదమని తెలియును. నారాయణుడును సాక్షాదంబికయే. పరమేశ్వరీ స్తోత్రములందు కొన్ని యెడల పద్మనాభ సహోదరీ, కృష్ణ సహోదరీ యని చెప్పుట కలదు. అటులే విష్ణువును అంబికకు సోదరుడని వ్యవహరింతురు.

"మందిరకోండి యుడుత్తి మణమాలై
అందరిసుట్ట కణా క్కండేన్ తోళినాన్."

అని ఆండాళ్ పాశురము. మహావిష్ణువునే ప్రియపడి ఆయననే కళ్యాణము చేసుకొందునని పట్టుబట్టిన 'ఆండాళ్' కు

(ఆముక్తమాల్యద) అలంకారము చేయునపుడు వదినెగారగు అంబికవచ్చి 'మణమాలై' – వివాహమాల్యమును అలంకరించినదట. 'అందరి' యనగా అంబిక.

తిరుమళిసై యాళ్వార్ 'మాదాయమాలవనై మాదవనై' యని వ్రాసిరి. మహావిష్ణువు స్త్రీరూపము దాల్చెనని దాని అర్థము. క్షీరసముద్ర మథనసందర్భమున అమృతమునకై సురులకును, అసురులకును వివాదము వాటిల్లగా విష్ణువు మోహినీ అవతారమెత్తిరని యొకకథ.

మరొకపుడు భస్మాసురుడు శివునిగూర్చి ఘోరతపమొనర్చగా ఈశ్వరుడు ప్రత్యక్షమై వరమడుగుకొమ్మనెను. అతడు ఎవరిశిరస్సునందైననుసరే చేయియుంచిన వారు భస్మమగునట్లు వరమును కోరుకొనెనట. ఆ వరప్రభావమును పరిశీలించుటకై అతడు ఈశ్వరునే ఉపకరణముగాగొని 'ఏదీ నీ తల చూపుము, వరప్రభావమును చూచెదము' అని అడిగెనట. వరప్రదాతనెత్తికే కొరవిగాదలచిన భక్తుని భావౌన్నత్యమునకు భవుడు భయమంది పారిపోవదొడగెను. అపుడు మహావిష్ణువు 'ఇదేమి చిత్రము' ఈశ్వరునిగతియే యిట్లున్నదే, యని జాలిపడి కటాక్షమాత్రమున మోహపెట్టజాలు కామినీవేషమునుదాల్చి భస్మాసురునికడకు వెళ్లెను. అతడును కామవశుడై తన్నంగీకరింపుమని వేడెను. 'అది సరే నీవువెళ్లి స్నానము, ఆచమనము అన్నియు చేసిరమ్ము' అని చెప్పగా, అతడువెళ్లి ఆచమనము చేయుచు పద్మనాభ, దామోదర యని తలను చేతితో స్పృశించునరికి భగ్గుమని మండి భస్మమాయెను. 'మాదాయమాలవనై' యనుటకు మహావిష్ణువు స్త్రీరూప

ధారణ చేసెననుటయే ఆధారము. ఆయనయే అంబికయును. ఒకే వస్తువు విష్ణువుగను, ఈశ్వరుడుగను, అంబికగను ఆవిర్భవించి యున్నది. ఈ రూపములతో లోకానుగ్రహ కారణముగా వివిధ అవసరములలో వెలసిరని ఈ గాథలు తెలుపుచున్నవి. రత్నత్రయమని పెద్దలు చెప్పుదురు. మనము పూజించు ఈ మూడురత్నములు వేదమధ్యమున నున్నవి. అంబిక, విష్ణువు, ఈశ్వరుడు అను ఈ మూడు రత్నములును మనకు పూజనీయములు.

కాంచీపురమున ప్రత్యేకముగా కామాక్షి కొక ఆలయము, పెరుమాళ్లకు వరదరాజపెరుమాళ్ల కోవిల, ఈశ్వరునికి ఏకామ్రనాథ దేవాలయమును ఉన్నవి.

వాస్తవమున వీరు వేరుకాదనియు, ఒకటే యనియు, అర్థనారీశ్వర, శంకరనారాయణతత్త్వము ఏర్పడినది. కావేరీపాకమని యొక గ్రామము. కంచినుండి వేలూరు వెళ్లుమార్గమున ఇరువదిమైళ్ల దూరమున నున్నది. అచ్చటికి రెండుమైళ్ల దూరమున పాలార్ నది ప్రవహించును. ఆ నదీతీరమున ‘ తిరుప్పార్ కడల్ ’ అనునదొక క్షేత్రము. అందొక పెరుమాళ్లగుడి. ఈ దేవాలయముగూర్చి ఒక ఇతిహాసము పురాతనకాలము నుండి వచ్చుచున్నది.

ఆ ఊరిలో మొదట విష్ణ్వాలయ మనునది లేదు. శివుని గుడిమాత్ర ముండెడిది. శ్రీవైష్ణవులొకరు బహుక్షేత్రాటనము చేసి ఆ యూరికివచ్చిరి. అన్నియూళ్లలోను శివ విష్ణు దేవాలయములుండును. ఆయన ఏ యూరికి వెళ్లినను విష్ణు దర్శనములేనిది భుజించి ఎరుగరు. ఎన్నిరోజులు వరుసగా విష్ణు

దర్శనభాగ్యము లేకున్న, అన్నిరోజులూ ఆయన ఉపవాసమే. ఆయన 'తిరుప్పార్కడలు' గ్రామమునకువచ్చి, విష్ణ్వాలయము కొరకు వెదకసాగెను. కానీ చూచిన గుళ్లన్నియు శివునివే. ఇందు విష్ణువుండునేమో యని యీ గుడిలోదూరెను. చూచు సరికి ఈశ్వరుడు. వెంటనే బయటికి పరుగిడెను. ఆరోజు దర్శనము లేదనుకొని ఆకలిచే, దర్శనాభావముచే తల్లడిల్లుచుండెను. భక్తితోడి బాధ భరించలేనిస్థితి. దానినిచూచి మహా విష్ణువు ఒక వృద్ధబ్రాహ్మణవేషమునవచ్చి "స్వామీ! విష్ణు దర్శనము చేయవచ్చెదరా" యని యడిగెనట.

'ఈ ఊరిలో విష్ణుదేవాలయ మెక్కడిదయ్యా' అని ఆయన కోపముతో బదులిడెను.

'ఆ కనబడునది పెరుమాళ్ళకోవెలకదా!' ఆ వృద్ధుడు చూపినగుడికే తాను వెళ్లి హతాశుడై తిరిగివచ్చినది!

'ఎందులకయ్యా అసత్యములాడెదవు? అది ఈశ్వరుని గుడి.'

'కాదు, అసత్యము చెప్పునది మీరు. నేను కాదు. అది పెరుమాళ్ళ గుడియే. కావలయునేని వచ్చిచూడవచ్చును.' అని ఆయన చెప్పుటయు, ఈయన కాదనుటయు ఇట్లు కొంత తతంగము జరిగెను. మాధ్యస్థ్యమునకు వచ్చిన గ్రామస్థులు 'మనము అందరము కలిసి వెళ్లిచూతమ'ని అనిరి.

అక్కడికి వెళ్లిచూడగా ఆలయమేమో శివాలయమే మూర్తి శివలింగమువలెనే యున్నది. క్రింద బ్రహ్మపీఠము. కాని దానిమీద మాత్రము పెరుమాళ్లు. దానిని చూడగనే



రామేశ్వరంలో కొత్తగా నిర్మించబడ్డ శంకర మంటపం వద్ద

జగద్గురు శ్రీ శంకరాచార్య స్వామివారు

'మనము ఏమరిపోతిమే, మహావిష్ణువుకదా ఇక్కడ ఉండునది.' అని విష్ణుభక్తుడు మనమున నలరి స్తోత్రమొనర్చెనట. ఆయన క్షేత్రాటనము వదలి ఆయూరనే కాపురముండి పెరుమాళ్ళ సేవచేసెనట.

ఈనాటికినీ ఆక్షేత్రమున బ్రహ్మపీఠముపై లింగముండు చోట పెరుమాళ్ళ విగ్రహముండును. శివవిష్ణువుల ఏకత్వమునకీ క్షేత్రమొక దృష్టాంతము. శంకరనయనార్ కోయిలయందును ఒకేశరీరమున శంకరనారాయణు లున్నారు.

ఇపుడు నేను చెప్పిన ఇతిహాసములు రత్నత్రయమును గూర్చియు, వస్త్వేకత్వమునుగూర్చియే చాటును. అర్ధనారీశ్వర తత్త్వము శివపార్వతుల కభేదమును తెల్పును. శంకరనారాయణ స్వరూపము శివవిష్ణువుల కబేధమును తెలుపును. అభేదమయిన వస్తువు భేదము కల్గినదానివలె రెండు మూడు రూపములదాల్చి మనకు అనుగ్రహము చేయుచున్నదని శాస్త్రములవలనను క్షేత్రమునందలి మూర్తులవలనను తెలిసికొనవచ్చును. రత్నత్రయ పరీక్షయను గ్రంథమున రత్నములగూర్చి చెప్పునపుడు "ఒకేస్వరూపము ద్వివిధముగ త్రివిధముగ ప్రకాశించుననియు, ఏ ఏ కార్యము ఏ ఏ కార్యమునకు ఏ ఏ విధముగ భాసిల్లవలెనో ఆయావిధముగా భాసిల్లుననియు, నానారూపములతో భిన్నస్థితులున్నట్టు తోచినను, అభిన్నమగు వస్తువు ఇది" యని చెప్పబడినది. మూర్తిత్రయమందును ఇదేతత్త్వము ప్రకాశించుచున్నది. దీనిని మనము తెలిసికొని, ఆ పరమాత్మ స్వరూపానుగ్రహమును పొందెదము గాక.

# వేదము - ధర్మము.

వేదములం దనేకవిషయములు కలవు. అగ్నిహోత్రము, సోమయాగము, ఇష్టము పలువిధములగు కర్మలు, హోమములు – వీనికి వలసిన మంత్రములు ఇట్టివి ఎన్నియో. పెద్ద యాగమునకు సత్రము అనిపేరు. ఒకడు యాగమునకు సంకల్పింపగా, దానిని వేదవిదులగు బ్రాహ్మణులువచ్చి నడిపింతురు. యాగకర్త ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము తెలిసిన వారిని రావించుకొని, సామవేదులు గానముచేయగా, ఋగ్వేదులు హోమము చేయగా, యజుర్వేదులు మంత్రముల జపించగా యాగమును నడిపించును. తనద్రవ్యమును వెచ్చించియో లేక ఇతరులకడ యాచించియో దానిని జరిపించును. అందుచే ఆయాగమువలనగలుగు పుణ్యమూ, ఫలమూ అతనికొక్కనికే. అచటికివచ్చి యాగముచేయించిన బ్రాహ్మణులను ఋత్విక్కులని అందురు. వారికి ఆయాగము చేయించినందులకు యజమానుడు దక్షిణలిచ్చును.

సోమయాగములందు ఋత్విక్కులకు శాస్త్రనిర్దేశము చొప్పున పశువులను, స్వర్ణమును, వేరేవస్తువు లేవియైనను యజమానుడు సమ్మానముగా నిచ్చును. వేదములం దనేక విధములగు సోమయాగములు చెప్పబడినవి. మరియొకవిధమగు

యాగమునకు 'సత్రము' అని పేరు. సత్రమనిన చాలమంది సాపాటు చేసెడిచోటు అనియే యనుకొందురు. సత్రములు మూయబడుటచే ఇంక కొద్దిరోజులలో అదియును తెలియక పోవును. వేదములందు సోమయాగములవలెనే సత్రయాగము కూడా పెక్కువిధములుగా ఉన్నవి. ఇది అందరూ చాలకాలము కలసి, ఉమ్మడిగా చేయునది. ఈ సత్రయాగములో వేదగానము చేసి హోమమున ఆహుతులొసర్చినట్టి ఋత్విక్కులందరికి యాగఫలమువచ్చును. వారికి పుణ్యము, శ్రేయస్సు, చిత్త శుద్ధి, ఉత్తమలోకప్రాప్తి కలుగునని చెప్పబడియున్నది.

"సత్రే సర్వే యజమానాః"— సత్రయాగమున అందరూ యజమానులే. అందరికిని ఫలముకలదు. అందుచేతనే అందరు కలిసి సొంతయింటి కామందులవలె భోజనముచేయు స్థలమునకు సత్రమనిపేరు వచ్చినది. సత్రములో సాపడువారెల్లరు యజమానులే.

యజ్ఞయాగములేకాక వేరు ఉపాసనామార్గము లెన్నో వేదములందు చెప్పబడినవి. వివిధములగు ధ్యానములు పేర్కొనబడినవి. ఈ శరీరమునుండి ఆత్మ ఎట్లులేచిపోవునదీ, కడపట శరీరము ఏమియగునదీ, మరల మనుష్యశరీరమున ఆత్మఎట్లుప్రవేశించునదీ — ఈ విషయములన్నీ వేదములయందు కానవగును.

మరియు శరీరారోగ్యమునకు వలసిన వైద్యచికిత్సలు, శత్రుహింసలనుండి తప్పించుకొనుటకు కావలసిన శాంతులు — ఇట్లు పలువిషయములు వేదములందు చూడగలము. దీనినంతా మనము చూచినచో యొకసందేహము కల్గును.

వేదముయొక్క ఉద్దేశ్యమేమి? ఎందులకొరకు వేద మేర్పడినది? కొన్ని ఉపనిషత్తులలో చెప్పినరీతిని అన్ని వేదములును ఒకవస్తువును చూపించుచున్నవని తెలియుచున్నది. ఆ వస్తువేది? ఓంకారార్థముగా నుండు నొక పరమవస్తువునే అన్ని వేదములూ సూచించుచున్నవని ఉపనిషద్వాక్యము. వేదములు వేర్వేరువిషయములను గూర్చియు, వేర్వేరు దేవతలను గూర్చియు చెప్పుచున్నవే — యని మనకు సందేహము వచ్చుచున్నది.

జడ్జి సదాశివయ్యరు అను ఒకరుండిరి. మైసూరు రాజ్యమందుండిన పరమశివయ్యరు వీరికి సోదరులు. వేదములనగా భౌతికశాస్త్రమే. వేదము జియాలజీని గూర్చి (భూగర్భ శాస్త్రము) చెప్పుచున్నదని వారు వ్రాసిరి.

ఇంకను పలువురు పలువిధములుగా చెప్పుచున్నారు. ఆకాలమున మనదేశమున నున్నవారికి సూర్యుని, చంద్రుని చూచిన ఆశ్చర్యముగా నుండినది. అది అధికముగా విజ్ఞానము కలిగిన కాలముగాదు. అందుచేత వారికి దగినట్లు, వారివారి నైసర్గిక దృశ్యములను చూచి ఏవో వర్ణించినారు. దానిని పాటగాపాడు శక్తి అందరికిలేదు. కొందరికి మాత్రమే యుండినది. వీరు పాడినపాటలే మంత్రములని అనుకొని, వేదములుగా పూంకువులు కంఠపాఠము చేయుచు వచ్చుచున్నారని పాశ్చాత్యులు అభిప్రాయపడుచున్నారు.

వీనినంతయు చూచిన, వేదములన్నియు ఒకవస్తువును (పరమపురుషుని) చెప్పుచున్నవని ఉపనిషత్తులు చెప్పినను, వేర్వేరు

విషయములను గూర్చియే వేదములు చెప్పుచున్నవి కానీ, ఒక్కవస్తువునుగూర్చి చెప్పుచున్నట్లు మనకు తోచుటలేదు.

రామాయణముగూర్చి యొక శ్లోకము కలదు.

'వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే,
వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షా ద్రామాయణాత్మనా॥'

వేదవేద్యే-వేదముచేత తెలిసికొన దగినవాడు ఎవడు? పరే పుంసి - పరమపురుషుడు శ్రీమన్నారాయణుడు. వేదవేద్యుడగు నారాయణుడు రాముడుగ లోకములో నవతరించెను. నారాయణుడు దశరథాత్మజుడైన వెంటనే వేదములు వాల్మీకి శిశువుగ, రామాయణముగ అవతరించినవి.

వేదములందనేక విషయములగూర్చి ప్రస్తావన ఉన్నను అవి తీరా చెప్పునది ఒక్కవస్తువును గూర్చియే. అయిన అనేక విషయములగూర్చి ప్రస్తావన యెందులకు? అనేక వస్తువుల మూలముననే మనము ఒక్కవస్తువునుగూర్చి తెలుసుకొనగలము. యోగము, ధ్యానము, తపస్సు, యజ్ఞము, కర్మానుష్ఠానము ఇవి అన్నియు తుదగ ఏవస్తువును చూపునో ఆ వస్తువే వేదముల సత్యతత్త్వముగా నున్నది. ఆ సత్యమైన వస్తువుతప్ప తక్కిన వన్నియు మారిపోవునటువంటి వస్తువులు. కథలుగా పోయెడి వస్తువులు. అటుపిమ్మట ఆ కథలుకూడ మరచిపోబడును. వేదోక్తమగు ఆ సత్యవస్తు దర్శనమునకు, దాని మననము కొరకు చిత్తమునకు పలునియమము లేర్పడవలెను. యాగములు చేయుట, తపస్సుచేయుట, ధర్మముల

చేయుట, గోపురములు కట్టుట, నూతులను త్రవ్వుట — ఇవి అన్నియు చిత్తశుద్ధి, చిత్తవృత్తి నిరోధము చేయుట కొరకే. ఏకర్మలైనను పరమాత్మని పొందుటకై చేయవలసిన కర్మలే.

ప్రపంచమున ఎంతచిన్న దుఃఖము వచ్చినను మనము వ్యసనపడెదము, కష్టపడెదము. ఎట్టిదుఃఖమువచ్చినను, అవమానమువచ్చినను చలించని చిత్తవృత్తి ఏర్పడవలెనన్న కొన్ని సాధనములను చేయవలెను. దేహమును పెంచుటకొరకు మనము 'దండాలు' తీయుదుము, బస్కీలు చేయుదుము. ఇవి యన్నియు మిగుల నియమముతో చేసిననేగాని దేహము పెరుగదు. అట్లు ఆత్మాభివృద్ధికి కొన్నికట్టుబాట్లు కొన్ని ప్రయత్నములు అవసరము. వానినెల్ల వేదము చెప్పెను. వేదరీత్యా కర్మానుష్ఠానము చేసినచో ప్రయోజన మేమి? ఏదుఃఖమును మనదగ్గరికే రాదు. దానినే యోగమని గీత చెప్పెను.

తం విద్యా ద్దుఃఖ సంయోగ వియోగం యోగసంజ్ఞితమ్,
స నిశ్చయేన యోక్తవ్యో యోగో నిర్విణ్ణచేతసా॥

సంయోగ మనగా చేరిక. వియోగ మనగా విడిపోవుట. 'దుఃఖ సమూహమును తొలగించునదియే యోగము అని తెలిసికో' యని కృష్ణుడు అర్జునునికి ఉపదేశము చేసెను. అట్లు 'చేరునటువంటి' యోగము వియోగము చేయుచున్నది. ఎట్టి దుఃఖము వచ్చినను పోగొట్టును. దుఃఖము రాకుండగనే చేయుట యనునది కానిపని. మితిలేని దుఃఖము కలుగుచునే యుండును. ఏదుఃఖము వచ్చినను ఆదుఃఖమును మనలను

అంటనీయక వియోగము చేసివైచును. గచ్చకాయకు విభూతి అంటుపడనట్లు తామరాకుపైని నీటిబిందువులవలె మనకు వచ్చు దుఃఖములు మనలను అంటక పోవును. దానికే యోగమని పేరు. యోగమునకు గుర్తు ఏమి?

'యం లబ్ధ్వా చా పరం లాభం మన్యతే నాధికం తతః'

ఏ ఒక్కదానిని పొందిన వేరుపొందేదియు అధికమని తలచడో అది ఒక్కటియే పొందదగిన వస్తువు. దానిని పొందుటకు చిత్తశుద్ధి కావలెను. ఏకాగ్రచిత్తము కావలెను. చిత్తము యొక్క స్వభావము సదాచలించుట. ఒక్కనిమిషమైన వ్యవధి లేక అది తిరుగుచునే యుండును. ఇట్లు అలయుటచే దానికి చిత్తమాలిన్యము అమితముగా అంటుపడును. 'వద్దు వద్దు' అని చెప్పుచున్నను దానిదారి దానిది. అది పరుగిడుచునే యుండును. అలయకుండా కోపించకుండా ఉండుము అని తలచినను చిత్తము యొక్క తిరుగుడుచే మనకు మాలిన్యము వచ్చి చేరుచున్నది.

ఆశ, కోపము, మోహము - ఇవి అన్నియు చిత్తమాలిన్యములు. 'చిత్తమల మఱువిత్తు శ్శివమాక్కి' యని తిరువాచకము చెప్పుచున్నది. 'చిత్తమలము పోయిన శివుడు కాగలడు'. అంతవరకు జీవుడు. చిత్తమాలిన్యముతొలగినంతనే జీవుడు శివుడగును. ఈ చిత్తశుద్ధి కొరకే గుళ్లుకట్టుట, యాగములుచేయుట. ఇవి ఈశ్వరసంబంధమైన కార్యములు. బావులు త్రవ్వుట, గోపురములు కట్టుట మొదలగు కార్యములకు 'పూర్తము' అని పేరు. యాగములు చేయుటకు 'ఇష్టము' అని పేరు. రెండిటినీ కలిపి ఇష్టాపూర్తములని యందురు.

వేదాధ్యయనపరులు ఇష్టులనుచేసి చిత్తశుద్ధి పొందవలెను. అందరు పూర్తములనుచేసి చిత్తశుద్ధి పొందవచ్చును.

ఇష్టాపూర్తములు శరీరమును శుద్ధమొనర్చును. కాని ఇవి లక్ష్యములు కావు. చిత్తమాలిన్యమును పోగొట్టుకొనుటకు సాధనమాత్రములు. చిత్తవృత్తిని చాంచల్యమును నిరోధించి ఏకాగ్రచిత్తముతో తెలిసికొనదగిన సత్యమైన ఒకవస్తువును తెలిసికొనుటకు చేయు సాధనములు. ఆ వస్తుదర్శన మయిన తోడనే వేరుకావలెనని తోచదు. తోచినచో అతడు ఇంకను స్వామిని చూడలేదనియే అర్థము. 'యం లబ్ధ్వా చా పరం లాభం మన్యతే నాధికం తతః' మనము పొందదగిన వస్తువు పొందితిమాయని పరిశీలించుకొనుట కిదిగుర్తు. మరియొక గుర్తు ఏమనగా :

'యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణా పి విచాల్యతే'

గురుతమమయిన దుఃఖము వచ్చినను, కదలక మెదలక, విచలిత మొందక యుంటిమా మనము సత్యవస్తు దర్శన మొనర్చితి మని అర్థము. మనకు అనేక దుఃఖములు వచ్చును. ఊరి కంతయు అది మహాదుఃఖముగా తోచును. కాని మనకు అది అట్లు తోచదు. గచ్చకాయవలె, తామరాకుపయి నీరి బొట్టువలె దుఃఖము కొంచెంకూడా అంటక సదా ఆనంద ముగా, వేరొకటి కావలయునని కొంచెముకూడా తోచక, కూర్చున్నచో దానికే యోగమని పేరు. 'తం విద్యా ద్దుఃఖ సంయోగ వియోగం యోగసంజ్ఞితం'. దుఃఖమును అంటనీ యక దుఃఖసంయోగమును వియోగమొనర్చునది యోగము.

క్రమాచారము, నియత జీవనము చేతనే మనము మన శ్చంచలతను వదలించుకొని, ఏకాగ్రతను పొంది, ధ్యానమును పెంపొందింప వీలగును. ఈ శరీరమను పంజరమునుండి ఆత్మ వదలిపోవుటకుముందే సద్విద్యచేత యోగస్థితిని ఒక్కొక్కరు పొందవలెనని కాళిదాసు రఘువంశమున జెప్పెను. వేదవస్తువు రాఘవుడే. ఆ ఒక్కవస్తువును పొందుటకే ఇన్ని శాస్త్రములు, యజ్ఞములు, తపస్సు, ధ్యానము. ఆవస్తుదర్శనము చిత్తవృత్తి రాహిత్యమున గాని కలుగదు. ఈవృత్తి రాహిత్యము మెట్టు మెట్టుగా అలవడవలెను.

ఏవస్తువు తెలిసికొనిన మరొకటి కావలయుననితోచదో, అది ఎట్టిదుఃఖము నయినను పోగొట్టగల సామర్థ్యము కలది. అది ఎవరిపైనైనా కోపము కలుగనీయదు. మీదుమిక్కిలి కరుణ కల్గించును. మనకు ఏది వచ్చినను రానీ, ఇంకొక ప్రాణికి మనవలన కష్టము, దుఃఖము కలుగకూడదు అన్న కరుణ పుట్టును. ఈశ్వరుడు లోకసంహార మొనర్చుటకూడ యొక పరమకారుణ్యమనియే చెప్పవచ్చును. ఈ పరమకరుణ ఎంత దుఃఖము వచ్చినను, మనకు అది అంటనీయని – దుఃఖ సంయోగ వియోగస్థితి— అది కొంచెము కొంచెముగా రావల యును. దీనికొరకయియే శైశవమునుండి వేదాధ్యయనము చేయునది. అన్నివిద్యలు, శాస్త్రములు చదువునది.

'శైశవేభ్యస్త విద్యానాం' బిడ్డలుగానున్నప్పుడే మంచి ఆచార్యునివద్ద మంచి చదువును నేర్చి సన్మార్గమును ప్రవేశించు జ్ఞానమును పొందుట ముఖ్యవిధి.

'యౌవనే విషయైషిణామ్' యౌవన ప్రాయమున వంశము మంతో అంతరించకుండునట్లు తాము ప్రియపడిన ఒక స్త్రీని పెండ్లిచేసుకొని మంచి వంశమును వృద్ధిచేయవలెను. అనేక జీవములు తమతమ పాపములను కడిగివేసికొనుటకై వానికి శరీరము నిచ్చుటకు – వాని సహాయార్థము కళ్యాణము చేసికొనవలెను.

కొంచెము వయిసయిన తోడనే యోగస్థితిని పొందుటకు చిత్తనిరోధము, దుఃఖరాహిత్యముకై యాగములు, హోమములు, యజ్ఞములు చేయుదురు. ఇష్టాపూర్తముల చేయుదురు. ఆశ, కోపము, కామము కలుగకుండ చిత్తమును పరిశుద్ధ మొనర్చుకొందురు. 'వార్థకే మునివృత్తీనాం' వార్థక్య కాలమున గురులు, తాపసులను చేరి ఉపదేశమును పొంది తపస్సు చేయవలెను. తెలిసికొనదగిన వస్తువు, వేదవేద్యమగు వస్తువునకై సాధనలను కొనసాగించవలెను.

'యోగేనాంతే తనుత్యజామ్' కడపట శరీరమును యోగముతో వదలవలెను. గీతయందు యోగమన్న వియోగమే యని చెప్పబడినది; దుఃఖములేక సదా ఆనందముగా నుండుటయే. దేహమును ఏడుస్తూ వదలిన, మరల ఏడ్చెడి దేహమే వచ్చును. అందుచే దేహత్యాగసమయమున ఆనందముగా నుండవలయును. ఎట్టి దుఃఖసమయమునను మనశ్చలనము లేక ఆనందముగా ధర్మమునే అనుసరించెడి వ్యక్తి యొకడున్నాడని? అతడే రాముడు. రామశబ్దమునకే ఆనందముగా నుండువాడని అర్థము. అందుచేతనే వేదవేద్యే=వేదములందు తెలిసికొనబడు పరమపురుషుడు – జాతే దశరథాత్మజే=దశ

రథుని పుత్రుడుగా, దాశరథిగా ఆవిర్భవించెను. వేదమునకు శరీరిగ నుండువాడు దశరథాత్మజు డాయెను. వేదములు వాల్మీకి శిశువుగా, రామాయణముగా నవతరించెను.

అట్టి రామాయణ మేమి చెప్పుచున్నది ? 'వేదములు ధర్మమును గూర్చి చెప్పెను. అట్టి ధర్మస్వరూపుడే రాముడు' అని రాముని తల్లి కౌసల్యాదేవి రాముడు అడవికి పోవునపుడు చెప్పిన వాక్యమునుండి రాముడు ధర్మస్వరూపి యని గోచరించును.

పొరుగు ఊరికిపోవు బిడ్డకు తల్లి తినుబండారముల కట్టి ఇచ్చుట వాడుక. రామునికి కౌసల్య ఇచ్చిన భక్షణములేవి ? ఆమె ఇచ్చిన ఆశీర్వాదమే.

'యం పాలయసి ధర్మం త్వం ధృత్యా చ నియమేన చ,
స వై రాఘవ శార్దూల ధర్మ స్త్వా మభిరక్షతు॥'

'రాఘవా ! నీవు ఏధర్మమును ధైర్యముతో, నియమముతో ఆచరింతువో, ఆ ధర్మమే నిన్ను రక్షించుగాక.

ధృతియనగా ధైర్యము. ఒకడు పరిహాసము చేయునని లెక్కచేయక- ఎవరేమిచెప్పినను ధైర్యముతో నుండుటే ధృతి. ఎవరేమి చెప్పినను సరే యని కొందరు కొన్నిరోజులుమాత్రము ధైర్యముతోనుందురు. అటుతర్వాత వానిని వదలివేయుదురు. ఒక కట్టుబాటో, నియమమో యుండదు. అది ప్రయోజనము లేదు.

రాఘవుడు ధర్మమును నియమముతో, కట్టుబాటుతో ఒక్కనాడు, ఒక్కపూట అయినా వదలక రక్షించుకొనుచూ

వచ్చెను. మనశ్చలనము లేక చేయుచూ వచ్చెను. ఎవరు పరిహాస మొనర్చినను, అడ్డుపెట్టినను — మనధర్మము వీరికొఱకై వదలరాదు, అని ఆ ధర్మస్వరూపి ధర్మరక్షణ కావించెను. అందుచేతనే అడవికి పోవునపుడు తల్లి కొమారునికి ధర్మముగా నుండుమని బోధించక - ఏ ధర్మమును నీవు ధైర్యముతో, నియమముతో పాలించుచూ వచ్చెదవో ఆధర్మమే నిన్ను కాపాడునని, సకలఆపదలను నివృత్తిచేయు ఆశీర్వాదమును చేయుచున్నది.

ఒకకుక్క మనలను దొంగలనుండి కాపాడవలయునన్న, దానిని మనము చక్కగా గమనించవలెను. మనము దేనిని పరిపాలన చేయుదుమో, అది మనలను పరిపాలన చేయును. 'నీవు ధర్మమును పరిపాలించుచు వచ్చెదవు. అదియే నిన్ను పరిపాలించుగాక ...'అని ఇతరులు రాఘువునికి చెప్పుట అటుంచి, సొంతతల్లి తనబిడ్డ అడవికిపోవుచున్నాడే యని దుఃఖించక ఇట్లు చెప్పుచున్నది. కూడబుట్టిన సహోదరుడే 'అన్నా ! ధర్మము ధర్మము అని ధర్మమునకు కట్టుబడియుండుటచేతనే నీకు ఇంత శ్రమ, ఇంతకష్టము. దానిని వదలితివా నీకు ఈబాధ తప్పును'— అని చాలసారులు చెప్పియున్నాడు. ఎవరు పరిహాసముచేసినను 'రాఘవా ! ఏ ధర్మమును నీవు ధైర్యముతో, నియమముతో వదలక అనుష్ఠించుచున్నావో, ఆ ధర్మమే నిన్ను కాపాడును.' అని తల్లి ఆశీర్వదించుచున్నది.

'ధర్మము తలగాచును' యని యరవమున ఒక సామెత. రాఘువుని ధర్మమే అడవిలో అతనితలను రక్షించినది. రావణునికి పదితలలున్నప్పటికిని అతడుచేసిన అధర్మము ఒకతలనైనను

రక్షింపలేకపోయెను. పదితలలలో ఒకతల అయినా దక్క కుండా ఎగిరిపోయెను.

'వేదోఖిలో ధర్మమూలం' వేదమే ధర్మమును జెప్పుచున్నది. వేదములయందు వర్ణితుడగు పరమపురుషుడు దశరథుని తనయుడుగ నవతరించెను. అని యింతకుక్రితము ఉదాహరించిన శ్లోకము చెప్పుచున్నది. కౌసల్యాదేవి వచనమునుండి ధర్మస్వరూపియే రాముడు అని మనకు తెలియుచున్నది. మరొకచోట 'రామో విగ్రహవాన్ ధర్మః' అని యున్నది. ధర్మము అనునది మనోభావము. అది యొక రూపును దాల్చిన ఎట్లుండునో అదియే రాముడు. కోంచెముకూడా తప్పడు క్రోధపడక ఆపత్కాలమునకూడా ధైర్యముతో, నియమముతో కూడిన స్వరూపమునకే ధర్మమనిపేరు. ఆ ధర్మస్వరూపమే రామావతారము. వేదములనుండి తెలియదగిన వస్తువు సకలజనులకు దర్శనీయమగు వస్తువుగ నవతరించెను. అప్పుడే వేదము సహితము రామాయణమాయెను.

వేదగరిమను చెప్పలేము. ఏది చాలగొప్పదో వానినెల్ల వేదములని చెప్పుట వాడుక. ఆళ్వారు ప్రబంధములుకూడ వేదమే. ఒక రచయిత 'వేదములను తమిళముచేసిన శఠగోపుడు తన్ను చెప్పికొనెను. దీనిని చులకనగా చూడకుము. వేదములనే తమిళ ప్రబంధములుగా పాడియున్నారు.' అని చెప్పుటలో వేదము గొప్పది అని తెలియుచున్నది. భారతమును పంచమ వేదమని యందురు. వేద మనంతము అనంతమైనవస్తువు ఒక పరమవస్తువే. ఆ వస్తుజ్ఞానమున్నవాడు ధర్మమును ఎన్ని కష్టములు వచ్చిననుసరే, చింతా చలనమూ లేక రక్షించును.

సమర్థరామదాసు శిష్యుడు శివాజీ పరమధార్మికుడనియు, యుద్ధమునజిక్కిన విరోధియువతులను సహితము కడుజాగరూకతతో వారివారి నెలవులకు పనుపువాడనియు, ఆ విరోధులే అభినందన లొసగియున్నారు. సాక్షాత్ రామచంద్రమూర్తినే లక్ష్యముగా పెట్టుకొన్న రామమంత్రజప పరాయణులకు శోకము, మోహము, చిత్తమాలిన్యము ఏదియును కలుగదు. ధర్మపథమును వదలి వారు చనరు.

రామకీర్తన చేసెడి చోటులలో ఆంజనేయుడుండునట్లు చెప్పుట వాడుక. రాముని, ఆంజనేయుని తలచిన చాలును. వీరిరువురును లేక రామాయణమే లేదు. రామాయణమే వేదము. వేదోపదేశములు జ్ఞానమార్గమునకు చేరినవి. వేదాత్మకమగు రామాయణము ధర్మమార్గమునకు చేరినది.

వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే,
వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షాద్రామాయణాత్మనా॥

వేదవేద్యుడగు పరమపురుషుడు దశరథాత్మజుడుగ అవతరించి నందున రామాయణరూపమును దాల్చిన వేదముల యొక్క సారము రామనామమందు అణగియున్నది. ఆ రామనామము చిత్తమాలిన్యమును పోగొట్టి, వేరొకదానిపై ఆశ కలుగనీయక, సదా ఆనందముగా నుండునట్లు చేయును.

—♦—

# వేదాంతము

వేదాంతమను మాట మనము తరచు వినునది. పరిహాసమునకు కూడా ఒక్కొక్కప్పుడు 'ఏమి మహా వేదాంతము మాట్లాడుచున్నావే?' అని అందుము. తన్నుగూర్చి గీతయందు కృష్ణపరమాత్మ 'వేదాంతకృద్ వేదవి దేవ చా హమ్' అని చెప్పుకొనెను.

అంత యనిన తుది. వేదాంతమనిన వేదమునకు తుది. అంతములో చెప్పునదే తీర్మానము. పత్రికలలో కూడా ఒక ప్రసంగపుసారాంశము నెరుగగోరువారు ఆద్యంతములను చదివి తృప్తిపడుదురు. అదే విధముగా వేదముయొక్క ఆద్యంతముల మనము చూడనగును. ప్రారంభమున విషయవిస్తీర్ణతయున్నను వస్తువుయొక్క ప్రధానగుణము ఎందో ఒకందు సూచింపబడియుండును. కడపటికి వచ్చుసరికి అది తేటతెల్లమగును. ఆరంభమును ఉపక్రమమనియు, తుదిని ఉపసంహారమనియు అందురు. మధ్యలో ఎన్నో విషయనిరూపణలు, ఆధారములు ఉన్నను ఉపక్రమ ఉపసంహారములను జూచి మనము ఇదమిత్థము అని చెప్పగలము.

ప్రభుత్వముకూడా ఎన్నో చట్టములు చేయును ఆ చట్టములోని అభిప్రాయములపై ఏదేని సంశయములు, సందేహ

ములు కలుగునెడ ఆచట్టముననే యొక వ్యాఖ్యానముగ మరొక చట్టమును – 'లా ఆఫ్ ఇంటర్ ప్రిటేషన్' చేయుదురు.

వేదము అనునది మనకందరికి ఉమ్మడి చట్టము. ఇది అనాదినుండి వచ్చుచున్నది. అవధులు లేనిది. ఆద్యంతములు లేని నిత్యమైన చట్టము (ఎటర్నల్ లా). దీనికి దేశకాలాదులు లేవు. స్వామియును అంతియే. ఆద్యంతరహితుడు. దేశకాలముల కతీతుడు. ఆయన ఎట్లు నిరవధికుడో ఆయన చట్టమును నిరవధికము. వేదవాక్యములకు దేశకాలముల మార్పులు లేవు. అందుచేతనే ఎవరయినా వదలక, ఊరక వాదించిన 'నీవు చెప్పునదే వేదవాక్యమా?' (విస్సన్న చెప్పినదే వేదమా?) యని మనము అడుగుదుము.

వేదము అనాది. వేదమునకు ముందున్నది స్వామి. అందుచేతనే అదియును, వేదమునకు మూలమగు విష్ణువును అనాది. మూలమని అనుట అన్నిటికిని మూలము ఆయనయే అని అనుట. ఆయనయే 'మొదటి ఆసామి'. ఆయనయే చట్టమునకుకూడా మూలము.

"యో వేదాదౌ స్వరః ప్రోక్తో వేదాంతే చ ప్రతిష్ఠితః"

ఆ పరమవస్తువే శ్రుతియొక్క ఆద్యంతములందు ప్రతిష్ఠితముగా నున్నది. ఆచార్యులను దర్శించి పూర్ణకుంభ మును సమర్పించునపుడు ఈ మంత్రమునే ఉచ్చరింతురు.

వేదవాక్యము అభిప్రాయముల నెట్లు తెలిసికొనుట? వేదార్థములను తెలిసికొనుటకు కొన్ని విధులు కలవు. దానిని మీమాంసాశాస్త్రము చెప్పును. వేదమను చట్టమునకు

'లా ఆఫ్ ఇంటర్‌ప్రిటేషన్' మీమాంస. దానిలో వేదార్థములు తెలిసికొనుటకు ఉపక్రమము, ఉపసంహారము, అభ్యాసము, అపూర్వత, ఫలము, అర్థవాదము, ఉపపత్తి యనునవి ఏర్పరుప బడి యున్నవి

వేదము యొక్క ఆద్యంతములు ఒకే విషయమును గూర్చి చెప్పును. ఆరంభ మొకటి, ఉపసంహారము మరొకటిగా నున్న దీని తీర్మానమేమియని మనకు సందేహము రావచ్చును. మధ్యలో ఎన్నో విషయములు వచ్చినను, ఆద్యంతము లేవి చెప్పునో, అదియే దాని తీర్మానము అని మనము సందేహము లేక చెప్పవచ్చును. ఇవియే ఉపక్రమ ఉపసంహారములు.

ఒక ఉపన్యాసములోగానీ, ఒక వ్యాసమందుగానీ ఏవిషయము మరల మరల ప్రస్తావన చేయబడునో, అదియే ఆ ఉపన్యాసపు తీర్మానమని మనము దృఢముగా చెప్పవచ్చును. ఒక విషయమును మరల మరల చెప్పుటయే అభ్యాసము. దేనినైన మననము చేయవలెనన్న, మనము దానినే మరల మరల చదువుదుము. ఒక విషయమును తీర్మానము చేయుటకు ఉపయోగ పడునది అభ్యాసము. మరల మరల చెప్పబడునదే దాని తుట్టతుది తీర్మానము. (సిద్ధాంతము)

మరియొకటి అపూర్వత. ఒక ప్రసంగమును మొదటి రోజు విందుము. మరునటిరోజువిందుము. మరలగూడవిందుము. ముందురోజు చెప్పిన విషయమే ఈరోజుకూడా ప్రస్తావింపబడ వచ్చును. కాని, ఇదివరకు చెప్పని విషయమేదైనా నేడు చెప్పినచో, అదియే నేటిమాటలకు తీర్మానము. ఈరోజు దేనిని గూర్చి అధికముగా చెప్పబడినదో అదియే తీర్మానము. మిగిలిన

వన్నియు ఉండగా, ఇదియే అపూర్వత - క్రొత్తగా చెప్పబడు విషయము.

పుస్తకమునందు పలువిషయములను చెప్పి, ఇట్లు చేసినచో ఇష్టఫలము కల్గును అని చెప్పినయెడల దానిని ఫలమని అందురు. అదియే ఆపుస్తకమునకు తీర్మానము.

ఏవేవో సమాచారములు చెప్పి, మధ్యలో ఒకటిచెప్పి ఒకదానిని స్తోత్రము చేసినయెడల, స్తుతింపబడిన ఆ విషయమే ప్రధానము. దానిని చెప్పుటకే ఈ కథలన్నియు. ఇట్లు కథను ఆధారముగ చేసుకొని యొకదానిని స్తోత్రముచేయుట అర్థవాదము అని అందురు. ఒకదానిని చెప్పి దానికి కారణ నిరూపణము, ఔచితి మొదలగునవి చెప్పినచో ఆవిషయమే ఆవ్యాసమునకు ప్రధానాంశము దీనికి ఉపపత్తియని పేరు.

"ఉపక్రమోపసంహారౌ అభ్యాసో పూర్వతా ఫలం.
అర్థవాదోపపత్తీ చ లింగం తాత్పర్య నిర్ణయే."

అను ఈ ఆరువిధములగు లింగములచే తాత్పర్య నిర్ణయ మొనర్పవచ్చును అని మీమాంస చెప్పుచున్నది. దీనికి తాత్పర్యలింగమని పేరు. ఈ ఆరులింగములు - గుర్తులు - వున్న, ఇది ఈవిషయమునుగూర్చి తెలుపుచున్నదని తీర్మానము చేయగలము. ఒకటి యున్నను చాలును. ఆరునూ ఉండిన సందేహమున కాస్పదమే లేదు.

ఈ చట్టముచొప్పున వేదమును పరిశీలించిన వేదము యొక్క ఆరంభమే వేదమునకు అంతమందును ఉన్నది. వేదారంభమున ఏ స్వరమున్నదో అదియే అంతమునను కలదు.

సంస్కృతమున 'ఇదం' అనగా ఇది అని అర్థము. 'అదః' అనగా అది. అది యనుటకు 'తత్' అను పదమింకొకటి కలదు. ఇది అనుటకు 'ఏతత్' అను మరొక పదము కలదు.

'ఇదమస్తు సన్నికృష్టం' ఇదం అను సర్వనామము దగ్గరగానుండు వస్తువును, వేరుగాఉండు వస్తువును, ఎదురుగా నుండు వస్తువును చెప్పును.

'సమీపతరవర్తి చైతదో రూపమ్' — మనకు ఎదురుగా కంటిముందుండు వస్తువును చెప్పునది 'ఇదం'. దానికంటే మిగుల దగ్గరగానుండు వస్తువును చెప్పునది 'ఏతత్'.

'తదితి పరోక్షే విజానీయాత్' — 'తత్' అనగా మనకు తెలియక మరుగుననుండు వస్తువును చెప్పును.

'అతిదూరే విజానీయాః' చాలదూరమందున్నదే, అదియే స్వామి. అదియే తత్త్వమని వేదాంతము సయితము చెప్పుచున్నది. చాలదూరమున నుండునదియ తత్. దానిని తర్జని చూపును. దూరాతిదూరముననున్న స్వామివలన మన కేమి ప్రయోజనము? అనిన, చాలాదూరమందున్నతడే చాల సన్నిహితముగను ఉన్నాడు. 'దూరాద్దూరే అంతికే చ' యని వేదము చెప్పును.

ఈ సందర్భమున ఒక కథ జ్ఞాపకమునకు వచ్చుచున్నది. ఒక ఊరిలో అవివాహితయగు ఒకయువతి యుండెడిది. ఆ పిల్ల అందరిలో శ్రేష్ఠుడగు వరునినే పెండ్లిచేసుకొందునని పట్టుబట్టి, తల్లిదండ్రులు నిర్ణయించిన వరుని ఒప్పుకొనలేదు. తల్లిదండ్రులకు ఏమియు పాలుపోక నీ యిష్టమే కానిమ్మనిరి. పురుషు

లలో కెల్ల రాజు శ్రేష్ఠుడు. చేసుకొన్నచో రాజునే పెళ్లి చేసుకొనవలెనని నిశ్చయించి, ఆ ఊరి రాజువెంబడిపడి అతడు ఎచటికి పోయినా అచటికి పోయెడిదట ఒకరోజు పల్లకీలో ఊరేగుచుండిన రాజునకెదురుగా ఒకసన్న్యాసివచ్చెను. రాజు పల్లకిని దిగి సన్న్యాసికి నమస్కరించెను. ఆ అమ్మాయి 'రాజు శ్రేష్ఠుడని అనుకొంటిని. ఈ సన్న్యాసి రాజుకంటె గొప్పవాడు కాబోలు. లేకున్న, రా జితనికేల నమస్కారము చేయును?' అని రాజును వదలి సన్న్యాసివెంట బడెను. సన్న్యాసి ఇట్లుపోవుచుండగా, ఊరి వెలుపల ఒక చెట్టుక్రింద వినాయకునివిగ్రహామునుచూచి, దాని ముందు ఆయన గుంజిళ్ళు తీసెను. దీనినిచూచిన అమ్మాయి సన్న్యాసినివదలి వినాయకునిముందు ఆసీన ఆయెను. ఆ సమయమున త్రోవలోపోయెడి శునక మొకటి ఆ వినాయకునిపై మూత్రించెను. వినాయకుడే గొప్పవాడనుకొన్న పిల్లకు, ఇపుడు శునకము శ్రేష్ఠతరముగా దోచెను. అందుచే వినాయకునివదలి కుక్క వెంటబడి పోసాగెను. కుక్కనుచూచిన యొక పిల్లవాడు దానిపై రాళ్లురువ్వగా అది మొఱుగుచు పరుగెత్తిపోయెను త్రోవలోబోయెడి యొకయువకుడు — కుక్కను అనవసరముగా నెందులకు బాధించెదవని — పిల్లవానినిపట్టుకొని వీపుపై నాలుగు వడ్డించెను. అమ్మాయి శ్రేష్ఠవరాన్వేషణకూడ పూర్తి ఆయెను. అందరికినీ మించినవాడు ఆ పిల్లవానిపై చేయిచేసుకొన్నవాడే యని ఆ పిల్ల తీర్మానించెను. కడపటికి ఆ అమ్మాయి మెచ్చినవాడు, మొట్టమొదట తలిదండ్రులు నిర్ణయించిన వరుడే. ఎక్కడో అతిదూరమున స్వామియున్నాడని వెదకుచున్నావే? ఊరంతా చుట్టినను నీ వెట్లు ఆయనను చూడగలవు? ఆయన

నీ సమీపముననే యున్నాడు. "దూరాద్దూరే అంతికే చ" దూరముకంటె అతిదూరముననున్నాడనియు, సమీపముకంటె అతిసమీపమున ఉన్నాడనియు సూక్ష్మముగా చెప్పబడినది.

హొరైజను అనునది భూమ్యాకాశములు కలిసెడి చోటు. మనకు దగ్గరనేయున్నట్లు కన్పడును. హొరైజన్ వంకకు వెళ్ళసాగిన అవి దూరమగుచునే యుండును. ఇట్లు 'అది అది' అనబడుస్వామి, చాలదూరమందున్న స్వామి, నీయందే యున్నాడు. తత్ - త్వం అది నీవే యని వేదము చెప్పెను. నేను నేను అని దేనిని తలచుకొనుచున్నావో ఆ స్ఫురణయే దైవము. ఆ ప్రకాశము లేనిచో నీవు దేవుని తలచుటకే ఎడముండదు. నేను తెలిసికొనుచున్నాను - నేను తలచుకొనుచున్నాను - అనెడి - ఈ తెలిసికొను, తలచుకొను స్ఫురణయే చాలదూరమం దుండునదికూడా. అది 'త్వం' = నీవు.

ఇదియే వేదమున కంతమున చెప్పబడినది. ఆతత్వము నే వెదకికొనుచు దూరముగా పోవునది. వెదకికొనుచూ పోవడమునకు వలసినశక్తి నీలోపలనే యున్నది. అది నీవే. తత్ తత్ అని చెప్పబడు దైవము నీవేయని వేదము చెప్పుచున్నది.

వేదాంతమున నుండు భాగములను ఉపనిషత్తులని యందురు. ఇది ఇది యని ఏది చెప్పబడుచున్నదో ఆ 'ఇదం' మూలము లేనిది. మూలములేని వస్తువు, విత్తులేని చెట్టు ఎందైనను కలదా? ఇంతటి ప్రపంచము పర్వతములు, సముద్రము, ఆకాశము, భూమి, పశువులు, మనుష్యులు, కోపము, భయము, ప్రియము, ఇంద్రియములు, శక్తి ఇది అని చెప్పబడు

వస్తువులకెల్ల ఒక మూలము వుండనేయున్నది. చూచుట, తలచుట, శీతోష్ణములను తెలుపు స్పర్శ, మనస్సుద్వారా, ఇంద్రియములద్వారా అనుభవించుట - వీటి కన్నిటికిని 'ఇదం' అని పేరు. బుద్ధిశాలితనము, ఆశ్చర్యకరమగు విజ్ఞాన పరిశోధనలు వీటి కన్నిటికి ఒక మూలకారణముగా నుండు నతడును 'అతడు'. మూలములేని వస్తువొకటి వుండదు. మనుష్య శరీరమున కొక బీజమున్నట్టే పరమవస్తువునకు సహితము యొక బీజ మున్నది.

చింతగింజ మొలకెత్తినపుడు చూచినచో తెలియును. మొలకెత్తగనే విత్తనము పగిలి అందున్న అంకురము మొలకెత్తి ఒక చెట్టు ఆకృతి వహించును. ఆ విత్తులో మహావృక్షమగు శక్తి యున్నది. ప్రపంచమున గల సమస్త శక్తులకును, సామర్థ్యమునకును, మేధా సంపదకును మూలము దైవమే. మూలమునందుండు శక్తియే ప్రపంచమునం దెల్లయెడలను వ్యాప్తమై యున్నది. ఇది ఇది యని చూడబడు వస్తువులలో నెల్ల ఉండి చూచుచున్నదే మూలము. ఒక నిలువుటద్దము ముందు నిలుచుని చూచిన మన స్వరూప మొక్కటి కనబడును. నాలుగు అద్దములు వరుసగా నుంచి చూచిన అనేక రూపములు కనబడును. ఇది ఇది యని చూచువాడే దేవుడు. చూచువస్తువే చూడబడు వస్తువునకు మూలము. ఆ మూలమనునది స్ఫురణమే. ఆస్ఫురణమే జగత్తునకు కారణము. అది నీయందే యున్నది. అఖండముగా నుండవలసిన ఇది నీయొద్దనే ఖండ ఖండముగా నున్నది. దీపములు, పంకాలు అని అనేక రూపములున్నను, మూలశక్తియగు విద్యుచ్ఛక్తియేమో ఒక

టియే. విద్యుత్తంత్రులలో నుండునదియు, మేఘములచాటున ఉరుములతో మెరయు మెరుపులీగల శక్తియు ఒక్కటే. ఇట్లా వేదమునకు అంతముగానుండు 'తత్' యొక్క సారము 'త్వం' నీవే. నీయందుండు మూలమే సర్వజ్ఞుడును, శక్తిమంతుడును.

ఇదే గీతయం దొక శ్లోకమందు చెప్పబడినది. ఒక్క శ్లోకమేమి? అందుండు 700 శ్లోకములందును ఈతత్త్వమే చెప్ప బడినది. ఒక్కటి చెప్పిన చాలును. ఇన్ని చెప్పనక్కరలేదు. అయినప్పటికిని తధారూపముగా ఇన్ని చెప్పినను ఏదో ఒకటి చదివినా, చదివినవారి మనస్సునం దంటుపడదా అనే ఉద్దేశము చేతనే ఇన్ని శ్లోకములు చెప్పబడినవి.

అవిభక్తం చ భూతేషు విభక్త మివ చ స్థితమ్,
భూతభర్తృ చ తద్ జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ॥

భగవద్గీతలో ఎక్కడనో విన్నట్లు ఈశ్లోకము జ్ఞాపకమునకు వచ్చును.

అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥

మన యోగక్షేమముల భగవంతుడే వహించెదనని చెప్పి యున్నందున ఈశ్లోక మందరికిని తెలిసియుండును.

యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత,
అభ్యుత్థాన మధర్మస్య తదా త్మానం సృజా మ్యహమ్॥

ఈశ్లోకముకూడ అందరికిని జ్ఞాపకముండును. ఇట్లుకొన్ని శ్లోకములు తెలియును. కొన్ని చెప్పినచో విన్నట్లే తోచదు.

నేను మొదట చెప్పిన శ్లోకము విన్నట్లు తోచుచున్నదా? బహుశా అట్లు తోచదేమో?

జ్ఞేయమనగా తెలిసికొనబడు వస్తువు. ఏది తెలియదగినది? 'తత్' అనునది. ఆ తత్ అనుదానికి భూత భర్తృ, గ్రసిష్ణు, ప్రభవిష్ణు అని మూడు విశేషణములు.

మొదటి గుణము 'భూత భర్తృ'. భర్తఅనగా భరించువాడు. పెండ్లి అయినచో ఒక కన్య భారమును భర్త భరించును. అప్పుడే ఆపదము సార్థకమగును. భార్య సుఖ దుఃఖములకెల్ల అతడు భర్త కావలెను.

భూతభర్త యనగా భూతములను భరించువాడు. సకల ప్రాణులును, జడవస్తువులును భూతములు. ఆకాశము, భూమి, అగ్ని, గాలి, నీరు ఇవి పంచభూతములు. స్థావరజంగమములు, ఖేచర భూచరములు సకలము భూతములే.

'ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి'

అని గీతయందే మరొకచోట కానవచ్చును. సర్వభూతముల హృదయమందుండువాడే ఈశ్వరుడు. భూతభర్త. భరించుచు రక్షించుచుండు వస్తువే 'తత్'. ఇవి జీర్ణములయినచో వానిని భక్షించునది, గ్రసించునదియు అతడే. వృక్షము భూమిలో పుట్టగా దానిని భరించి, రక్షించునది భూమియే. జీర్ణించి రాలిపోయినచో దానిని గ్రసించునదియు భూమియే.

ఇట్లు సమస్త భూతములను, ప్రాణులను, స్థావర జంగమాదులను భరించువస్తువే గ్రసించుచున్నది. వానిని జీర్ణించుకొని మరల 'ప్రభవిష్ణుచ' పుట్టించుచున్నది. శ్లోకముయొక్క

పూర్వార్థమందు 'అవిభక్తంచ భూతేషు విభక్తమివచ స్థితమ్' అని యున్నది. అప్పటి కపుడు ఉత్పత్తియగు నానావిధ వస్తు జాతములు వేర్వేరుగా కనిపించినను అవి యెల్ల అవిభక్తములే; విభక్తములైన సమస్త భూతములలో అవిభక్తమగు వస్తువున్న కారణమున ప్రపంచమునందలి సమస్త వస్తువులు ప్రాణము ప్రజ్ఞ కలవి లేనివి - వీటికన్నిటికీ మూలమైన వస్తువు- అది - అవిభక్తము=వెర్వేరుగా ఉన్నను ఇది చెట్టు, అది చేను యని వేరువేరుగా కనపడినను ఇవి యన్నియు నిజమునకు ఒక్కటే. వేరువేరు చోటులలో నుండుటచే విభక్తమువలె తోచుచున్నది.

తన్ను తెలిసికొన్న చో 'తత్' నీయందేవస్తువు వున్నదో అదియే భూతములనన్నింటినీ భరించుచూ, గ్రసించుచూ, ప్రభవించుచూ ఉన్నది.

'అవిభక్తం చ భూతేషు విభక్త మివ చ స్థితమ్,
భూతభర్తృ చ తద్ జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ॥'

" ఒకసూర్యుండు సమస్తజీవులకు తానొక్కొక్కడై తోచు పోలిక " దోసెడు నీళ్ళు క్రిందజల్లిన, అందులో ప్రతి జలకణము సూర్యుని ప్రతిబింబించును. ఒక్క సూర్యుడే అనేకుడై కన్పట్టును. అని "అతఏవచ ఉపమా సూర్యకాదివత్" అను బ్రహ్మసూత్రమున చెప్పబడియున్నది. అన్నిటికి మూలమగు శక్తియేదో, చైతన్యమేదో అదియే మనయందు ఖండఖండముగా దోచుచున్నది. ఆఒక్కవస్తువే వేదాంతమందుండు 'తత్'. అదియే 'తత్'. అదియే 'త్వమ్'. అదియే 'తత్త్వమ్'.

ఇపుడు మనకు పూర్తిగా అర్థమయినట్లు తోచుచున్నది. ఇటులనే ఎప్పుడును - అన్నిటియెడలనుఉన్నచో దుఃఖము లేదు. అబద్ధములచే నేర్పడు బాధలూ లేవు. నిజముగానుండుటకు నిజమైన వస్తువును పట్టుకొనవలెను.

అఖండముగానుండు ఒకవస్తువును ఖండఖండములుగానుండు నొక వస్తువు ఖండఖండములుగా ధ్యానముచేసి కడపటి స్థితిలో నిర్గుణధ్యానము చేయ నారంభించినచో కయ్యములు, వాదులాటలు ఏవియును వుండవు. ఇదియే ఆచార్యులు ఉపనిషద్వృక్షమునుండి మనకు గిల్లియిచ్చిన ఫలము. ఈ పక్వస్థితిని పొందుటకు ముందు మొగ్గగా, పువ్వుగా, కాయగా క్రమేణ ముదిరి పక్వస్థితి వచ్చువరకు ఓర్మి వహించవలెను. తొందర పడినచో ప్రయోజనము లేదు. కాయ వమ్మిపోయి రాలిపోవును.

పక్వస్థితి కలుగు వరకు జప తపము లుండవలెను. వేదాంతమునందుండు తత్త్వమను నిజస్థితిని పొందువరకు ఇవి అవసరము. అపుడే కాయ నాశముగాక పండును. కడపటి 'తత్త్వము' ఎందున్నది? నీయందే యున్నది. చూచెడి స్ఫురణలో ఉన్నది. ఖండము సాధన. అఖండము అంత్యము. విభక్తము సాధనకాలమున నుండవలసిన మనోభావము. అంతమున అఖండస్వరూపముతో నైక్య మగునపుడు, వేరు అనునది మాయమగును. విభక్తము అవిభక్తమగును. ఇదియే ఆచార్యులవారి ఉపదేశము.

—♦—

# ఆనందతాండవమూర్తి

నటరాజ తాండవ సమయమున పతంజలి, వ్యాఘ్రపాదుడు, నందికేశ్వరుడు, భృంగి యను నలువురు పార్శ్వమున నిలిచి ఆ ఆనంద నర్తనముగాంచి హృదయములు పొంగగా ఆనందమున మునిగియుండురట.

శివనర్తనము చిదంబర మందేనా ? వేరుచోటులలో లేదాయన్న ప్రశ్న కలుగవచ్చును. సూర్యుడు చిదంబరమందుదయించునని మనము చెప్పిన, మనఊరియందును ఉదయించును అని అర్థము. సూర్య చంద్రు లుదయమగుకాలమున అన్ని చోటులలోనూ ఉదయమగునట్లే, ప్రదోషసమయమున ఈశ్వరుడు ఒక్క చిదంబరముననే యననేమి — అన్ని యెడలను నర్తనము చేయును. తన నర్తనముతో విశ్వమునంతను నింపును.

పతంజలి, వ్యాఘ్రపాదుడు అనువారిరువురును మహర్షులు. నంది, భృంగి యనువారు దేవాంశసంభూతులు. నందియు భృంగియు ఛాయలవలె సర్వకాలములందును ఈశ్వరుని అనుసరించెడివారు. పతంజలి, వ్యాఘ్రపాదులు నర్తనసమయమున మాత్ర ముండెడివారు.

శివనర్తనపు లయతాళగతుల ననుసరించి పతంజలి యొక స్తోత్రమును వ్రాసెను. ఈయన ఆదిశేషుని అవతార మట. చిత్తరువులలో సయితము ఈయనను సర్పదేహము తోడను, మనుష్య శిరస్సుతోడను చిత్రింతురు. వ్యాఘ్రపాదు లకు పులిపాదములు, మనుష్యముఖము. వ్యాఘ్ర సర్పములు భీతిని కల్గించునవైనను, నిజస్వభావమును మరచి శివతాండవ దర్శనౌత్సుక్యమున ఆనందపుటవధులను చేరుచున్నవి.

నందికేశ్వరుడు రెండు కొమ్ములవాడు, నాలుగు పాద ములవాడు. వ్యాఘ్రపాదుడును నాలుగు పాదాలవాడే. కాని ఆపాదాలలోంచి గోళ్లు వెలికి ఉబికి ఉంటవి. భృంగి త్రిపాది. వీరిలో పాదరహితుడు పతంజలియే. అందుచే తక్కిన ముగ్వురు ఏమయ్యా! నీకు కొమ్ములు లేవు; కాళ్లు లేవు. మంచి ప్రకృతి కలవాడవని పరిహాస మొనర్చిరట.

నే నెట్లున్న మీకేమి? మీలోటు మీకు తెలియదు. మీకు కనులు లేవు, కర్ణములు లేవు. శివనర్తనమునుచూచునపు డేమో చెవులతో తాళగతులను సరిగా వినలేరు. చెవులతో వినునపుడేమో సరిగాచూడలేరు. నాకట్లుగాక కనులూ కర్ణ ములూ ఒకటేయైనందున 'వినుకలికంటి' అని పేర్వడిన నేను దృక్కర్ణుడనగుటచే దృక్కర్ణనామకుని నర్తనానై పుణీ, తాళ సరళీ రెంటినీ ఒకే ఇంద్రియముతో ననుభవింతును. అంత అదృష్టము మీ కెక్కడిది? యని బదులిడెనట.

వ్యాకరణమహాభాష్యమును వ్రాసినవారు పతంజలి. నటరాజు తాళస్వరములకానుగుణ్యముగ మహేశ్వరసూత్రము

లేర్పడినవి. వానిమూలముననే వ్యాకరణభాష్యమును వ్రాయ వీలయినది.

ఈశ్వరుడేదో నన్నిట్లు పుట్టించినాడు. నాకు కొమ్ములున్న నేమి? లేకపోయిననేమి? నాకేకాదు, నా స్తోత్రమునకుకూడా కొమ్ములూ, కాళ్లూ లేవు.

బాగుబాగు. ఈశ్వరుడు నీకు ఆకారమే ఇట్లు ప్రసాదించినాడనిన, నీవు వ్రాసిన స్తోత్రమునకుకూడా నీ ఆకారమేనా? ఏది నీవు వ్రాసిన ఆ కొమ్ములూ, కాళ్ళూలేని స్తోత్రము?

అక్షరసముదాయమునకు మనముచేర్చెడి దీర్ఘములు, గుడులు, కొమ్ములు, ఉత్వములు — కాళ్ళు అని చెప్పవచ్చును. దీర్ఘములు లేక హ్రస్వాక్షరములతో ఒక శ్లోకము వ్రాసిన దానిని కాళ్ళు, కొమ్ములు లేని శ్లోకమని చెప్పవచ్చును. పతంజలి వ్రాసిన శ్లోకమిది:

అనంతనవరత్న విలసత్కటక కింకిణీ
ఝళం ఝళ ఝళం ఝళ రవం
ముకుందవిధిహస్త గతమర్దల లయధ్వని
ధిమిద్ధిమిత నర్తనపదం,
శకుంతరథబర్హి రథనంది ముఖదంతి ముఖ
భృంగిరిటి సంఘనికటం
సనంద సనకప్రముఖ వందితపదం పరచి
దంబరనటం హృది భజ॥"

నర్తనసమయమున ఆయన పాదములనుండి వెలువడు కింకిణీ ఝళంఝళ రవములు ఈ శ్లోకమందును ధ్వనితములై

యున్నవి. శ్లోకపు సదకసయితము ఈశ్వరుని నర్తనము వలెనే యున్నది.

"ముకుంద విధిహస్తగత మద్దల లయధ్వని ధిమిద్ధిమిత నర్తనపదం"-బ్రహ్మయు, విష్ణువును మద్దెలవాచగా ఈశ్వరుడు ఆ తాళగతుల ననుసరించి 'ధిమిద్ధిమి'యని నర్తనము చేయును. ఈ నర్తనమునకు ప్రేక్షకులు నంది, దంతిముఖుడు, భృంగిరిటి. వీరందరు పతంజలిని పరిహాస మొనర్చినవారే. అందుచే వారి నందరిని చేర్చియే ఆయన స్తోత్రము చదివెను.

"సనంద సనక ప్రముఖ వందితపదం" - సనకసనందనాదులచేత స్తుతింపబడిన చరణారవిందుడు నటేశుడు. ఆనందమే రూపెత్తినదో యనునట్లు కుంచితపాదుడై నృత్యముచేయును. 'పరం చిదంబర నటం హృది భజ' పరతత్త్వముగానున్న నటరాజును హృదయమునందు భజింపుము. అని ఈ శ్లోకము చెప్పుచున్నది. ఇట్టివే పదిశ్లోకములు. వానిలో ఇదియొక శ్లోకము :

హరం త్రిపురభంజన మనంతకృత కంకణ మ
ఖండ దయ మంతరహితం
విరించి సురసంహతి పురందర విచింతిత పదం
తరుణచంద్రమకుటం
పరం పదవిఖండితయమం భసితమండిత
తనుం మదనవంచనపరం
చిరంతన మముం ప్రణత సంచిత నిధిం
పర చిదంబర నటం హృది భజ॥

హరుడనగా హరించువాడని యర్థము. ఈశ్వరుడు దేని నపహరించును ? తన భక్తుల తాపత్రయములను, కష్టములను, దుఃఖములను, పాపములను అన్నిటిని మొదట అపహరించుకొని పోవును. అటుపిమ్మట వారికి భక్తి పెరిగిన తర్వాత వారిభక్తి ప్రవృద్ధహృదయములను అపహరించుకొని పోవును. జ్ఞాన సంబంధులు ఈశ్వరుని 'మానసచోరుడా' యని సంబోధింతురు. ఆయన ప్రళయమున సకలచరాచర భూతములను తనయందు ప్రలీనమొనర్చుకొనును. ఇట్లు అన్నిటిని హరించుకొనిపోయెడి వాడు హరుడు.

'హారం త్రిపురభంజన మనంతకృత కంకణ మఖండ దయ మంతరహితమ్॥'

ఈశ్వరుడు త్రిపురాసుర సంహారము చేసెనని స్థూలముగా నొకపురాణకథ కలదు.

మూడు కోటలతో గూడిన యొకపట్టణమున ముగ్గురు రక్కసులుండిరి. దేవతలకు మానవులకును వారివలన అనేక ఉపద్రవము లేర్పడెను. వీరిని సంహరించుట కీశ్వరుడే సమర్థుడని వారు తీర్మానించి తామును తోడ్పడెదమని శివునికి విన్నవించుకొనిరి. భూమి రథముగను, సూర్యచంద్రులు రథచక్రములుగను, బ్రహ్మ సారథిగను, వేదములు గుఱ్ఱములుగను, మహావిష్ణువు బాణముగను - ఇట్లు శివునికి పరికరము లేర్పడెను. ఆయనయు త్రిపురాసుర సంహారార్థము బయల్వెడలుచు ఇట్లు చింతించెను. మన కార్యమునకు ఎంతమంచి పరికరములు ? భూమియే రథము. అది కదలనిది. సూర్యచంద్రులు చక్రములు. ఒకడు ఉదయించిన మరియొకడు అస్తమించును. ఒకడు ముందు

నకు పోయిన మరియొకడు వెనుకకుపోవును. బాణమో విష్ణువు. ఆయనది సతత యోగనిద్రాస్థితి. ఇట్టి పరికరములతోడనా నేను త్రిపురాసుర సంహారముచేయుట? ఆయనకు నవ్వు వచ్చెను. నవ్వెనో లేదో ఆనవ్వు బలిమి యెట్టిదో త్రిపురములు ఆక్షణముననే దగ్ధములైనవి. ఇట్లు ఒకకథ.

మన దేహమే పట్టణము. మొత్తముమీద గమనించి చూచిన దేహమున మూడు భాగములు కలవు. చేతులు, కాళ్ళు, మాంసము, ఎముకలు, నరములు, రక్తము ఇవన్నియు చేరి స్థూలశరీరమనునది యొకటి. చూచెడిశక్తి, వినెడుశక్తి, స్పర్శశక్తి అను పలువిధములైన శక్తులున్నవి. మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అను నాలుగు మనోభాగములున్నవి. ఒకవిషయమును ఎట్లు చేయుటయని ఆలోచించి నిశ్చయించునది బుద్ధి. ధృతితో కొనసాగించునది చిత్తము. నేను చేయుచున్నాను అనెడి తలంపు అహంకారము. ఈ కార్యమెట్లు ముగియునోయని తపించునది మనస్సు. ఇట్లు పలువిధములగు అంతశ్శక్తి సమూహమునకు సూక్ష్మశరీరమని పేరు. నిద్రించునపుడు అంతయు సురిగిపోయి యొకటే అంధకార మగును. నిదురబోవునపుడు కనులు మూసియున్నను, తెరచియున్నను చూడటమనునది లేదు. కాని నిద్రాసమయమున దేహము నందు ఒకవిధమగు శక్తి, ఆనందమును స్ఫురింపజేసెడి శక్తి యొకటియుండును. ఆ ఆనందమును పొందెడిశరీరమును కారణ శరీరమని యందురు. ఈ మూడు శరీరములు కలసియే పర మాత్మస్వరూప మగును. ఈ మూడును హతమగుచో మన కును, దానికిని సంబంధము లేదు. అపుడు సదా ఆనందమే.

ఈ త్రిపురసంహారమును నవ్వుచూ నవ్వుచూ చేయవలెను. నవ్వుచేతనే అన్నికష్టములను, దుఃఖములను సంహరించి ఆనంద మయుఁడుగా ఆనందస్వరూపముతో నైక్యము కావచ్చును. ఇది చాల సూక్ష్మము.

'అనంతకృత కంకణమ్' అనంతుఁడే. ఆదిశేషుఁడే ఆయన చేతియందలి కంకణము. 'అఖండదయమంతరహితం' ఆయన దయ అఖండమైనది. మనదయ కొక నియతికలదు. ఆ నియతి దాటిన కోపము, తిట్లు ప్రారంభమగును. మనవలె ఖండమగు దయకల్గినవాఁడు కాఁడు ఈశ్వరుఁడు. ఈశ్వరునివలెనే ఆయన దయయు ఆద్యంతరహితము.

> "విరించి సురసంహతి పురందర విచింతిత పదం
> తరుణచంద్ర మకుటం"

ఇంద్రాది సకలదేవతలచే చింతింపబడిన పదసరోజముల వాఁడు; బాలచంద్రుని జటామకుటమున దాల్చిన తరుణేందు శేఖరుఁడు.

చిదంబరక్షేత్రమున నృత్యము చేయుటనుగూర్చి వ్రాసిన శ్లోకమిది. నాయనమార్లు, ఆళ్వార్లు(శివభక్తులు, విష్ణుభక్తులు) వీరు అందరు ఒకక్షేత్రమునకు బోయిన ఆ క్షేత్రమునందు ఈశ్వరునిగూర్చి స్తుతించుట వాడుక. ఆ స్తుతులలో క్షేత్రో న్నతినిగూర్చిన నుతియు యుండును. అచట ప్రతిధ్వనించు వేదా ధ్యయనము, హోమధూమము, క్షేత్రవాసుల దానధర్మగరిమ- ఇవన్నియు వారు వర్ణింతురు. నాలుగు వేదములు, ఆరు ఆగమ ములు, అరువదినాలుగు కళలుకల ఈ పూరిలో విభూతినిదాల్చి

హోమధూమము లాకసమునంటునట్లు వ్రేల్చెడి అంతరంగికులచే అర్చింపబడెడి ఓ ప్రభూ! అని పెక్కుస్థలములలో శివభక్తుడు 'అప్పర్' కీర్తించెను. నాయికా నాయక భావమున ఆళ్వార్లు సయితము స్త్రీలు తమ భర్తలకు తమ్మెట్లు అర్పణచేసుకొందురో అట్లు అర్పణచేసుకొని పెక్కుగీతములను వ్రాసిరి

శరీరమున్ననుసరే, పోయిననుసరే ఆమరణాంతము అవమానములు లెక్కసేయక భర్త ఇచ్ఛానుసారము నడచుకోవడమే మహావిధ్యుక్తధర్మము. పతియొక్క కార్యము క్రమమైనను, అక్రమమైనను చింతలేదు. అది చేయవలసినదే యనెడి మనోభావము పతివ్రతలది. ఒకపతివ్రత తన్నెక్కడికో తీసుకొనిపొమ్మని భర్త చెప్పినందున ఆతనిని గంపయందిడుకొని మోసుకొని వెళ్ళుచుండగా భర్తకాలు కొఱుతమాసిపై కొట్టు వేయబడిన యొకమునికి దగిలి బాధకల్గించెను ముని బాధకు తాళలేక యాతని శపించెను. కాని తన పాతివ్రత్యమహిమచే నాతని శాపమునే కుంఠితమొనర్చినదట ఆ ఇల్లాలు. ఇటులే — ఈశ్వరుడొక్కడే పురుషుడు. తక్కినవారందరు స్త్రీలే యని భగవంతుని పురుషునిగను, తమ్ము స్త్రీలుగను భావించుకొని భక్తినెఱపెడుస్థితి నాయికా నాయకభావము ఈ భావముతో జ్ఞానము, భక్తి, శృంగారములతో వ్రాయబడిన పాశురము లెన్నో కలవు

మీరాబాయి ఇట్లే తన్ను గిరిధరగోపాలునికే అర్పించుకొన్నది ఆమె ఉత్తరమధురను విడచి కృష్ణభగవానుని విలాసస్మృతుల కాటపట్టగు బృందావనమునకు తరలిపోయెను. ఉత్తరదేశమున సూరదాసువలె వల్లభాచార్యులనెడు గురువులొకరు

ఆకాలమున నుండిరి. ఆసమయమున బృందావనమునకు వారును విచ్చేసి యుండిరి. దర్శనార్థము మీరాబాయి వారికి కబురు పంపినదట. అందులకు వారు తాను స్త్రీముఖమును చూడనొల్లనని బదులు పంపిరట. స్త్రీని చూడనని ప్రతినబట్టిన వానికి తాను పురుషుడన్న భావమున్నట్లు గదా. ఈ బృందావనమున నుండు పురుషుడు ఒక్కడే. అతడు కృష్ణుడు. తక్కిన వారందరును స్త్రీలే. అట్లుగాక ఎవరికయినా తాను పురుషుడ ననుభావ మున్నచో నతడు బృందావనమును వీడి బయటకు పోవచ్చునని మీరాబాయి తిరుగు బదులు పంపినదట. దాని విన్న వల్లభాచార్యులు ఈమె ఉత్తమ జ్ఞానివలె నున్నదే. ఆహా! ఎట్టి 'అపచారము' అని వ్యసనపడి ఆమెదగ్గరకు వెళ్ళి నమస్కరించెనట అయిపిమ్మట వీరు పరస్పరము గురువులైరి. అని మీరాబాయి చరిత్రమున చదువుచున్నాము

ఈవిధముగా నాయికానాయక భావమున ఆళ్వార్లుసయి కవనము చెప్పిరి. ఆళ్వార్ అనిననే యువతి అని యర్థము. వేయి సంవత్సరముల క్రితపు పురాతన శిలాశాసనములను చూచిన అందు ఫలానిరాజు, ఫలానిఆళ్వారును కళ్యాణముచేసి కొనెను – అని చెక్కబడి యుండును. అందుచే ఉత్తమలక్షణ ములు కల స్త్రీలను ఆళ్వారు లనుచుండెడివారని తెలియు చున్నది. అప్పటినుండి నాయికా నాయక భావమున భక్తి జేసినవారికి ఆళ్వార్లు అని పేరు వచ్చినది.

ఒక కన్యక విరహోత్కంఠిత. తనవిరహమున నేమేమి చేయునో, దానినెల్ల ఆ కన్యకతల్లి చెప్పునట్లు ఒక ఆళ్వారు

వ్రాసియున్నారు. అట్లు చెప్పునపుడు - "విభూతి దాల్చినవాడు వీధిలోపోవగా, అదో విష్ణుభక్తుడు వెళ్ళుచున్నాడు - తులసి మాల దాల్చినవాడు వెళ్ళుచుండగా అదో విష్ణుభక్తుడు" అని పిల్ల చెప్పునట్లు తల్లి చెప్పుచున్నది. తులసీమాలను దాల్చిన వాడు విష్ణుభక్తుడు కావచ్చును. కాని విభూతిధారి విష్ణుభక్తు డెట్లగును? దీనినుండి ఆ కాలమున అందరూ విభూతి ధరించెడి వారని తెలియుచున్నది. కంఠమున తులసీమాల, దేహమున విభూతి, నాభిలో విష్ణునామము, నాలుకయందు విష్ణునామము, హృదయమున విష్ణుస్వరూపము ఇట్లుండిరని తోచుచున్నది. వైష్ణవులెవరయిన - అమ్మాయి పిచ్చిదియనిన-పిచ్చి విభూతిని దాల్చినవాడు విష్ణుభక్తుడన్నందులకేగాక, తులసిమాలను దాల్చినవానిని విష్ణుభక్తుడని చెప్పినందులకు కూడా వుండ వలెనుగదా! ఒకటి సరిగా చెప్పడము, మరియొకటి సరిగా చెప్పకపోవడము అనునది యుండదు. ఉన్మాదస్థితిలో సామా న్యముగా ప్రాచీనపద్ధతిని చూచినచో అందరు భస్మమును దాల్చిరనియు, విష్ణునామకీర్తనము చేసిరనియు తోచుచున్నది.

ఇటీవల సద్గురు బోధేంద్రస్వామికాలమునగూడ భస్మ ధారణ, హరినామకీర్తన చేసెడువారని తెలియుచున్నది. గోవింద పురము, మరుండా, నల్లూరు అను వూళ్ళలో మఠములున్నవి. నేటికిని నామసంకీర్తనమనిన బోధేంద్రస్వామికి నమస్కారము చేసియే ప్రారంభింతురు.

యస్యాంగం కనకాభ కాయ సదృశం

ఫాలం త్రిపుండ్రాంకితం

వాణీ శ్రీరఘునాథరామ సుధయా
ప్యార్ద్రా సకృద్ధారయా
చేత స్యంబుజలోచనో యదుపతిః
ఖేల త్యలం రాధయా
తం వై వెంకటరామదేశికవవరం స
ర్వాత్మనా హం భజే॥

భజన సమయములలో నేటికిని ఈ శ్లోకమును చెప్పు కొనుచున్నాము. నెత్తిన విభూతి, నాభిలో విష్ణునామము, వెంకటరాముడని పేరు. వీరు మొనమొన్నటివారు. సాయ మొనర్పగోరి తంజావూరురాజు ద్రవ్యమీయబోవగా, ఆయన నిరాకరించెనట. అందుచే రాజుగారు మాన్యములను వ్రాసి పెట్టి ఈభాగవతులు ఉంఛవృత్తికి వచ్చినపుడు వీరికి న్యాయము చేయవలసినదని భాగవతపురమును భక్తపురి అగ్రహారముగా నేర్పరచిరని చెప్పుకొందురు.

ఈతత్త్వమునే ఆదిశంకరులును ఉపదేశముచేయుచు వచ్చిరి. ఆయన అవతారమును చాలించుకొని కైలాసమునకు పోవుటకు ముందు శిష్యులందరు — "ఈశ్వరకృపను సులభముగా పొందుటకొరకు మీరుచేయు సూక్ష్మమైన ఉపదేశమేది?" యని ప్రార్థించగా, వారు అపుడు ఐదు శ్లోకములను సూక్ష్మముగా వ్రాసి యిచ్చిరి.

"వేదో నిత్య మధీయతాం
తదుదితం కర్మ స్వనుష్ఠీయతాం॥"

అని ప్రారంభించి ఐదు శ్లోకములను చెప్పిరి. నిత్యము వేదాధ్యయనము చేసికొనుచుండుడు. ఎవరి కర్మలు వారు చేసికొనుటయే ఈశ్వరుని పూజ ! యని చెప్పిరట.

వేదో నిత్యమధీయతాం- ఇట్లు చేసినయెడల ఫలమేమి? కలియొక్క ఉపద్రవము దూరమగును. వేదోక్తములగు కర్మలను చేయువారి హృదయాకాశమున (దహరాకాశమున) ఈశ్వరుడు నర్తనమొనర్చును.

"వేదో నిత్య మధీయతాం
తదుదితం కర్మ స్వనుష్ఠీయతాం
తే నేశస్య విధేయతా మపచితిః –"

'పరంపదవిఖండితయమం' పరమనగా అంతకంటె గొప్పది లేని గొప్పవస్తువు. 'పదవిఖండితయమం' యముడిని కాల దన్నినవాడు, శివుడు. భసితమండితతనుం — భస్మోద్ధూళిత గాత్రుడు. ఎట్టి గొప్పవస్తువులయినను సరే ఒకనాటికి అవి బూడిదకావలసినవే. కాని బూడిదమాత్రము బూడిదగనే యుండును. విభూతియే శాశ్వతాలంకారము. నిత్యమగు అలంకారము. శేక్కిళార్ అనువారు అరువత్తిమూవురు అనెడి అరువదిమూడు శివభక్తుల చరిత్రను వ్రాసిరి. వీరు శివభక్తులను గూర్చి వర్ణించునపుడు వారెల్లరు శివునివలెనే భసితమండిత గాత్రులని చెప్పిరి. సుందరమూర్తి – 'ఏఏ చోట, ఏఏ భక్తులు మోక్షమొందిరో వారి కందరికి నేను సేవకుడను' అని చెప్పుకొనెను. ఇదేరీతిని భక్తశిఖామణి త్యాగయ్యగారు 'ఎందరో మహానుభావులు అందరికిని వందనములు' అని కీర్తించిరి.

భసితమండితతనుం మదనవంచనపరం చిరంతనముఖుం'

చిరంతనమ్ - ఎల్లప్పుడును ఉండునది. ప్రణతసంచితనిధిం - నమస్కరించెడు జనులను గాచెడి నిధి - ఐశ్వర్యము, పరమేశ్వరుడు.

భగవానుడు ఆనందనర్తనము చేయునపుడు వాచు మర్దళమును శుద్ధమర్దళమని యందురు. అపుడు అందరి హృదయములు పరువులెత్తును. చిత్తము, మనసు అణగును.

పసిబిడ్డలు నయితము ఆనందము పొంగుచో కట్టుబట్టలను విప్పి గంతులిడుదురు. అటులనే ఆనందము పొంగునపుడు విశ్వజనమోహనముగ ఈశ్వరుడు సంధ్యాసమయమున తాండవము చేయును. వివిధచింతాకులిత మనస్కులమగు మనము ఆ ఆనందమును ఊహింపనయినను ఊహింపజాలము.

ఈశ్వరనర్తన సమయము సంధ్యాకాలము. అట్టివేళ మనము ఈశ్వరధ్యానము చేసిన మనశ్చంచలత అణగి శాంతి అలవడును. నర్తననైపుణి, లయ సొబగు నేకకాలమున నాస్వాదించిన పతంజలి శివతాండవ స్తోత్రమును వ్రాసెను. దానికి నటేశాష్టకమని పేరు. శంభునటన మనియు దానిని చెప్పుదురు. నేడు సోమవారము కనుక ఈశ్వరుని నేనును కొంచెము స్మరించి దీనిని చెప్పితిని.

---

# దక్షిణామూర్తి.

"గురోస్తు మౌనవ్యాఖ్యానం
శిష్యాస్తు ఛ్ఛిన్నసంశయాః"

దక్షిణామూర్తిస్వరూపమును మహర్షులు ప్రత్యక్షముగా దర్శనము చేయుచుండిన కాలమున ఆయననుగూర్చి చెప్పిన శ్లోకమొకటి యున్నది.

చిత్రం వటతరోర్మూలే వృద్ధా శ్శిష్యా గురు ర్యువా।
గురోస్తు మౌనవ్యాఖ్యానం శిష్యాస్తు ఛ్ఛిన్నసంశయాః॥

అను శ్లోకము పెద్దలనాటినుండి పరంపరగా వచ్చుచున్నది.

గురువు వటవృక్షమూలమున చిన్ముద్రాధారియై, మౌనియై, శిష్యపరివేష్టితుడై కూర్చుండియుండును. దక్షిణాభిముఖముగా అమర్చిన యీ దక్షిణామూర్తిగురువు విగ్రహమును ప్రతి శివాలయమునందును దక్షిణదిశ గోడమీంద మనము చూచుచుందుము. అన్ని మూర్తులకంటెను సితడు శాంతుడు. భైరవుడు మిగుల ఉగ్రమూర్తి. భిక్షాటనమూర్తి మిక్కిలి వశీకరణమూర్తి. సోమస్కంధుడు కరుణాపూర్ణుడు.

ఈశ్వరుడు జటలనువిప్పి నర్తనముచేయుచో జడలన్నియు ఒక్కచుట్టుచుట్టి నర్తనవేగమున అల్లే సూటిగ

నిక్కబొడుచుకొని పార్శ్వాభిముఖములై యుండును. నటరాజ విగ్రహమును చూచిన తెలియును ఆ నర్తనోద్ధృతము. కాని మఱ్ఱిచెట్టుక్రింద కూర్చుండియున్న దక్షిణామూర్తి జటలన్నియు క్రిందికి వేలాడుచు జటామండలముగా నుండును.



ఆ జటామండలమధ్యమున నొక చంద్రకళ అదియే జ్ఞానకళ. జ్ఞానము దిన దిన ప్రవర్ధమాన మగునది. ఇందుకు చిహ్నమోయనునట్లు ఈమూర్తి తదియనాటి చంద్రుని శిరసున దాల్చి యుండును. చంద్రావతంసుడై, శాంతమూర్తియై వెలయు దక్షిణామూర్తి స్వరూపదర్శన మాత్రమున మనకు ఎక్కడలేని శాంతత తానుగ వచ్చును. కోపిష్ఠిని చూచిన మనకును కోపమువచ్చును; దురాలోచనపరులతో చేరిన మనకును దురాలోచనలు కల్గును. ఎట్టి విపరీత మనోభావములతోనైననుసరే, మనము దేవాలయమునకు వెళ్ళి దక్షిణామూర్తిని చూచినంతనే ఆయన 'మనోవేగము వదలి కాస్సేపు శాంతముగా కూర్చుండి మరీ వెళ్ళు'మని చెప్పక చెప్పినట్లు తోచును. అచట ప్రశ్నలడుగ నవసరముండదు. బదులు చెప్పనవసరము లేదు. మాట్లాడక మౌనముగా, శాంతముగా మనమును చతికిలబడవలసినదే.



దక్షిణామూర్తి శిల్పమును పరిశీలించిన శల్యావశిష్టులగు నలుగురు ఋషులు సాధారణముగా నుందురు. కాంచీ మండలమున మాత్రము సప్తఋషులు గలరు. ఎన్నియుగములుగా తపస్సుచేయుచున్నారో వారి దేహమున ఎముకలు తప్ప వేరేదియు కనుపించదు.

కృతయుగమునందు అస్థులు మాత్రము కల్గిన వారికి గూడ ఆయుస్సు కలదని చెప్పెదరు. వారు అస్థిగతప్రాణులు. అటుతర్వాతి యుగమువారు మాంసగత ప్రాణులు. మాంసమున్నంతవరకు ప్రాణము లుండును. అటుపైని రుధిరగత ప్రాణులు. రుధిరమున్నంతవరకు ప్రాణములుండును. ఈ యుగమునన్నో అన్నగతప్రాణులు. అన్నమున్నంతవరకే ఆయుస్సు.

కృతయుగమున అస్థిగతు లగువరకు తపము చేసెడి వారు. ఆ కాలమున భృగువను ఒకాయన, తండ్రి వరుణుని కడకు వెళ్ళి 'పూర్ణమగు వస్తువేదియో, దానినెట్లు నేను పొందుదును?' అని ప్రశ్నించెను 'బ్రహ్మమనునదియే పరిపూర్ణమగు వస్తువు అగుచో, నది సర్వకాలికముగను, సార్వదేశికముగను, లోపరహితముగను ఉండవలయును. అట్టి పూర్ణమైన వస్తువును నాకు మీరు చూపుడు' అని అడిగెనట.

'నీవు వెళ్ళి తపస్సుచేయుము: అపుడు నీకే తెలియును' అని ఆయన చెప్పెను.

భృగువు తపమొనర్పసాగెను. చేయగాచేయగా అతనికి ఈశరీరమే చాల గొప్పవస్తువు అన్నిటిని తెలుసుకొనునది ఇది. ఇది జ్ఞాత జ్ఞేయముకంటె జ్ఞాత శ్రేష్ఠము అనిఆయనకు తోచినదట. వెంటనే తండ్రికడకు వెళ్ళి 'అన్నిటికంటె మహత్తైన పూర్ణమైన వస్తువును నేను తెలిసికొంటిని. అది ఈ దేహమే.' అని తన తపఃఫలమును తెల్పెను, వారు మరికొంతకాలము తనయుని తపస్సుచేయ కట్టడిచేసిరి.

ఇట్లు కొంత తపస్సుచేయడము, కొంత గ్రహించడము, తండ్రికడకు వెళ్ళి తాను గ్రహించినది నివేదించడము, మరల కొంతకాలము తపోనియతి - ఇట్లు ఐదుమార్లు జరిగినది. కడపటి సారి మాత్రము 'మీరు చెప్పినట్లు ఇన్నిరోజులు తపమొనర్చితిని. ఇప్పుడేదో హృదయమున నొకవిధమగు ఆనందము స్ఫురించుచున్నదే. ఇది ఏమి?' అని అతడు తండ్రి నడిగెనట

నీకు ఒక్కొక్కసమయమున ఆనందము స్ఫురించుచున్నదని యనుచున్నావే - ఆ ఆనందమే పూర్ణమగు వస్తువు నీకు అది కొంచెము కొంచెము కలుగుచున్నది. ఎక్కువయగుచో అది పూర్ణానందము అకుంఠితముగా సార్వకాల దేశికముగా నుండునది అని తండ్రి పల్కెను. ఇటుల ఒక కథ.

ఆ పూర్ణానంద మహోదధిలోని ఒకతుంపర ఎపుడో ఒకపుడు మనకు అందును. ఘనచ్ఛాయాచ్ఛన్నమును, లతా పుష్పఫల భరితమును అగు ఒకపెద్ద వృక్షముక్రింద కూర్చున్నయపుడు గాలివీచి, ఆకులుకదలి, వానిసందులనుండి మిలమిల లాడు సూర్యకిరణములు ప్రవేశించి నీడను పారద్రోలినపిదప మరల ఆకులు స్వస్థానము చేరినంతనే ఆకిరణములు మాయమగును. అదేవిధముగా మనకు అప్పుడప్పుడు ఆనందము కొంత కొంత గోచరించుచుండును. కాని, నిరవధికానందము మనకు చిక్కదు. చెడుకర్మలు, చెడ్డబుద్ధి దానిని దరిచేరనీయవు సత్కర్మల సంఖ్య పెరుగను పెరుగను ఆనందసముద్రపు టలలు దగ్గరదగ్గరికి ద్విగుణీకృతోత్సాహముతో వచ్చును. ఆనందలహరుల తెఱగు తెలియని మనము ఈ తుంపరకే ఆశ్చర్యపడి 'ఆహా ఎంత ఆనందము ఎంత ఆనందము' అని ఉవ్విళ్ళూరు

కుము. తపస్సు చేయుచు చేయుచు తత్త్వవిచారము చేసినచో అనవరతము ఆనందమయులమై ఆ ఆనందజలధిలోని తరంగములలో కలసి పోయెదమని అనుభవజ్ఞులు చెప్పుచున్నారు.

అటుల వేలకొలదియేండ్లు తపస్సుచేసి శల్యావశిష్టులైన ఋషులు ఏ ఆనంద శాంతస్వరూపుని కడకు వచ్చిరి? సాక్షాదీశ్వరుడే దక్షిణామూర్తియై వటవృక్షముక్రింద కూర్చుండి జ్ఞానప్రదానము చేయుచుండగా, ఋషులు తమ తపఃఫలముగా ఆయనకడకు వచ్చిరి.

'ఆహా ఏమిశాంతి! ఏమి ఆనందము!' అని అటులనే వారును ఆయనయుంబు శాంతస్వరూపులై, ఆనందమయులై కూర్చుండిరి.

నటరాజతాండవము పొంగెడి ఆనందమునకు చిహ్నము. పొంగెడు ప్రతివస్తువును ఎప్పుడో యొకప్పుడు అణగిపోవలసినదేకదా! కట్టెయలు కాలి కాలి మండి మండి సిద్ధమయిన బూడిదను మరల నిప్పులో వేసిన ఏమగును? బూడిదగనే యుండును. అటులనే నటరాజులో పొంగెడి ఆనందము అణగవచ్చును. నరసింహస్వామిలో పొంగెడికోపము అణగవచ్చును. కాని దక్షిణామూర్తి శాంతి అణగిన శాంతి, ఆయన ఆనందము అణగిన ఆనందము. దానికిపైగా ఏమియును లేదు. అన్నియు ఎచట అంతమగునో అదియే శాంతి. అట్టి అపారమూర్తిని దర్శనము చేసిన చాలును. పొంగెడి ఎట్టి హృదయమైనను శాంతమగును.

'చిత్రం వటతారో ర్మూలే వృద్ధా శ్శిష్యా గురు ర్యువా॥'

ఈ వటవృక్షముక్రింద ఎట్టి చిత్రము! సాధారణముగా గురువులు అనుభవశాలులుగను వృద్ధులుగను, శిష్యులు యువకులుగను ఉండుట వాడుక. కాని ఈవాడుక ఇచట తలక్రిందు లయినది. గురువో యువకుడు పదియారు పదియేడేండ్లవాడు. శిష్యులో అతివృద్ధులు. చిత్రము ఇది ఒక్కటియే కాదు. గురువు శిష్యులకు పాఠములు బోధించునపుడు, ఒక్కొక్క తత్త్వమును క్షుణ్ణముగా పరిశీలించి, మారుమూలల ఛేదించి, బోధించిన కదా విద్య అలవడును. అనిన - 'గురో స్తు మౌనవ్యాఖ్యానం' గురువు మౌనముతోడనే వ్యాఖ్యానించుచుండిరి. వారి ఉపన్యాసము మౌనమే. ఉత్తరదేశమున వ్యాఖ్యానము ఉపన్యాసము, లెక్చరు అని అర్థము.

ఒకే సంస్కృతపదమునకు ఒక్కొక్క దేశమున ప్రాంతీయ భాషలో ఒక్కొక్క అర్థము. ఒక్కొక్కచోట సంస్కృతార్థమునందే మారుదల కానవగును. ఉదాహరణకు - వృత్తి యనగా అరవదేశమున జీవనము అని అర్థము. కాని మళయాళ భాషలో వృత్తియనగా శుద్ధము అని అర్థము. ఆచారములేక శుద్ధిలేక ఎవడైన ఉన్నచో 'ఛీ ఛీ వాడొక వృత్తిచెడిన శనైశ్చరుడు' అని అక్కడివారందురు. అటులనే వ్యాఖ్యానము అన్న ఇచట ఉపన్యాసము అని అర్థము. ఔత్తరాహులు 'వ్యాఖ్యాన్ దేతా హై' అని ఉపన్యాసమిచ్చు సందర్భమున అందురు. అటులనే ఉపన్యాసము అనగా అచట నవల యని అర్థము. 'ఉపన్యాస్ లిఖ్ తా హై' అనియే వారందురు. ఇట్లు ఒక్కొక్కమాటకు ఒక్కొక్క అర్థము.

ఇచట గురువుగారిది మౌనవ్యాఖ్య. శాంతి మౌనముల మూర్తిత్వము. శాంతి తర్వాతిఘట్టము మౌనమేగదా! నోరు తెరచిననే సందేహములు. ఋషులకు ఎన్నియో సందేహము లుండెను. కాని ఆ శాంతస్వరూపిముందు అవి తామగ నివృత్తము లాయెను. ఒక్కమాట లేదు. ఒకటే శాంతి. ఒకటే ఆనందము. ఇన్నిరోజుల తపస్సుకు ఈనాడు ఫలితము

మనముగూడ వృద్ధాప్యమనునది లేక నిత్యయౌవనులమై యుండవచ్చును. ఏయోచనము లేక, ఏపనియుచేయక శాంత ముగ, ఆనందముగా నుండిన నిత్యయౌవనమే. కాని మనలను వదలక ఏదియో యొకటి వేధించుచునే యుండును. ఏదో యొక దుఃఖము ఏదో యొక వ్యసనము. ఏదో యొక కొరత. అందుచేతనే ముసలివాళ్ళమగుట. నిశ్చలమగు మనసుకలిగిన వారికి ముదిమి దూరమగును ఎన్నో కోరికలను పెంచుకొని మనస్సును లెక్కలేనన్ని యోచనలతో నింపి వ్యాకులితమొన ర్తుము. ఇది మౌన మానసికావస్థ.

ఈశ్వరుడు ఏకార్యములేకుండ సుస్థిరుడై, ఉన్మీలిత నేత్రుడై. మనశ్చాంచల్యరహితుడై, సదా యువకుడై, దీర్ఘ జటాధారియై, శాంతుడై, ఆనందరూపియై, శిష్యపరివేష్టితుడై సంశయవిచ్ఛేద సమర్థమగు మౌనవ్యాఖ్య చేయుచు, వట వృక్షముక్రింద కూర్చుండెను. దేశకాలములకతీతుడై పరిపూర్ణ మును, మనోజ్ఞమును అగు స్వరూపముతో కూర్చున్న ఈశ్వ రునిచేరి తాపసులు తమచింతలను బాసి ఆనందమయులై ఛిన్న సంశయులైరి.

కొంతలేనివస్తువే కొంతలదీర్చు సామర్థ్యము గలది. మహాత్ముల సందేహ నివృత్తిచేయవలెనను కోరికగూడ ఒక కార్యమగును. ఆ మనోవృత్తియు లేక తన హృదయానుభవమగు ముద్రను దాల్చి కూర్చుండెను దక్షిణామూర్తి. "అన్నియు ఒకటే; రెండు అని తలచునదెల్లయూ ఒక్కటే" అనువారి అనుభవమే చిన్ముద్ర. ఆ ముద్రాధారణసహితము మనోవృత్తిజన్యముకాదు. మనకు కోపముకల్గినపుడు కండ్లెర్ర నగును. మీసములు సైతము కదలును. ఇది మనకు తెలియకయే జరుగును. మనసులోని అనుభవము ఏదియో దాని చిహ్నములు వెలుపలనయితము పొడసూపును. అటులనే శాంత ఆనంద పరిపూర్ణమూర్తి దక్షిణామూర్తికి ఈచిన్ముద్ర తానుగా అమరినది.

బొటనవ్రేలిని అంగుష్ఠమందురు. హృదయమధ్యమున అంగుష్ఠమాత్రుడై ఈశ్వరుడున్నాడు. ఒక్కొక్కరి హృదయమందును ఈ అంగుష్ఠమాత్ర పరిమాణముతో పరమేశ్వరుడున్నాడని ఉపనిషత్తులు చెప్పుచున్నవి. హృదయమందును ఆకాశమున్నది. అది హృదయాకాశము బయటిది అఖండాకాశము. ఈ లోపలవున్న వస్తువే బయటసైతము అఖండముగా వ్యాపించియున్నది. లోపల అది అంగుష్ఠపరిమాణము. అంగుష్ఠము లోపలివస్తువును చూపును. అంగుష్ఠమునకు ప్రక్కన నున్నది తర్జని. ఇది చూపుడువ్రేలు. "స్వామి ఎచ్చట? అదో అచ్చట" అని తర్జని చూపును. చాలాదూరమందున్న వస్తువును సూచించు వ్రేలు ఇది. లోపలివస్తువు బయటివస్తువు అని రెండురకములు లేవు. అన్నీ ఒక్కటియేయున్న

స్వానుభవమును అంగుష్ఠ తర్జనీ సంయోగముచే దక్షిణా మూర్తి చూపుచున్నారు.

ఇతరమతములకు చెందినవారు 'అద్వైతమన్న అంతయూ ఒకటే యనికదా! అటులైన గురువేడి, శిష్యుడేడి? తన ఆత్మ, శిష్యుని ఆత్మ ఒకటియని గుర్తెరిగిన గురువు ఎట్లు శిష్యుని కుపదేశముచేయ నంగీకరించును? తమకు తామే ఉపదేశము చేసుకొనువారుగలరా? లేక గురుశిష్యులు వేర్వేరు అని తలచిన ఆచార్యునికి అద్వైతజ్ఞానము లేదనియేకదా చెప్పవలెను. జ్ఞానరహితునికి ఉపదేశాధికారమెక్కడిది? అద్వైతావలంబకునికి ఇతరులకు చెప్పనవసరము కనుపించదే!' అని వివిధములుగా ప్రశ్నలవర్షము కురిపింతురు. కాని ఇట్టి ప్రశ్నలకే ఆస్పదమును లేనిస్థితి దక్షిణామూర్తిది.

ఆయన అనుభవము ఆత్మస్వరూపమే. అది ఆనందనిలయము. శాంతినిలయము. ఆసాన్నిధ్యమును చేరిన ఋషులు సైతము ఆనందతరంగముల నోలలాడిరి.

మౌనవ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మతత్త్వం యువానం
వర్షిష్ఠాంతేవ సదృషిగణై రావృతం బ్రహ్మనిష్ఠైః।
ఆచార్యేంద్రం కరకలితచిన్ముద్ర మానందమూర్తిం
స్వాత్మారామం ముదితవదనం దక్షిణామూర్తి మీడే॥

గురువుయొక్క మౌనమే యొకవ్యాఖ్య ఆమౌనవ్యాఖ్యయందే పరబ్రహ్మతత్త్వము ప్రకటితమగును. గురువు పిన్నవాడు. బ్రహ్మనిష్ఠులగు ఋషిగణముచే పరివేష్టింపబడి యున్నాడు.

ఆచార్య శ్రేష్ఠుడు కరకలిత చిన్ముద్రతో, మందహాసముతో ఆనందమూర్తియై వెలసియున్నాడు.

జ్ఞానము రెండు తెగలు. పరోక్షజ్ఞానము, అపరోక్ష జ్ఞానము. మొదటిది 'థియరీ'- రెండవది 'ప్రాక్టికల్.' అందుచే పరోక్షజ్ఞానముకంటె అపరోక్షజ్ఞానమే శ్రేష్ఠము. అపరోక్ష జ్ఞానోపదేశమే దక్షిణామూర్తి మౌనవ్యాఖ్య.

ఇతర మూర్తులయందిట్టి శాంతత కనబడదు. ఏదో యొక కొరత యున్నట్లు తోచును. కోపమో, ఉత్సాహమో ఏదోయొక భావప్రకటన యుండును. మన కొరతలకై ఈ మూర్తులును దిగివత్తురు. వానినే అవతారములందురు. అవతరణ యనగా క్రిందికి దిగుట క్రిందికి దిగడమనునది గానీ, పైకి ఎక్కుట అనునదిగాని లేక తన ఆత్మానుభవస్థితిలో నుండు దైవము దక్షిణామూర్తి. వేదములు దేవునిగూర్చి చెప్పు నపుడు 'దేనికి ఏదియును పైన లేదో అదియే స్వామి. దేనికి క్రింద ఏదియును లేదో అదియే స్వామి సర్వము దేవునిచే నిండి యున్నది. ఆయనతప్ప వేరేదియును లేదు. ఆయనకు పైన ఏదియును లేదు. క్రింద ఏదియును లేదు. సర్వవ్యాపియగు ఆయనకంటె పెద్దవస్తువుగాని చిన్నవస్తువుగాని మరొకటి యుండదు అని చెప్పెను (తైత్తిరీయ ఆరణ్యకము. పదియవ ప్రశ్నము)

తనకంటె వేరగు వస్తువు ఒక్కటి యున్నదని తలంపు కల్గిన వెంటనే భయము, కోపము, ఆశలన్నియు కలుగును. ఆవస్తువునుండి కష్టము కలుగునేమోయను భీతిచేత కోపము, భయము, ద్వేషము ఏర్పడును. ఆవస్తువుపై అభిలాషకల్గినచో

ఆశ యేర్పడును. 'అంతా ఒక్కటే, రెండు అనునదియే లేదు.' అని మనకు నిశ్చయము కల్గినచో రాగము లేదు. ద్వేషము లేదు. ఒక్కటి యనునది సత్యము. రెండు అనునది మాయ.

దక్షిణామూర్తి అచలుడై, కార్యరహితుడై, స్థాణువై యున్నను కార్యములన్నియు తమంతటతామే జరిగిపోవు చున్నవి. సూర్యుడుదయించినంతనే పక్షులు గూళ్ళను వదలి ఎగిరిపోవును. జనులు తమతమ పనులను చక్కబెట్టుకొందురు. లోకమున ఎన్నియో పనులు జరిగిపోవును. కాని ఈకార్యములను సూర్యుడు చేయుటయు లేదు. ఆయన ఉదయించినంతనే ఆయన సాన్నిధ్యమున అన్నియు జరుగును. అటులనే గురుసాన్నిధ్య మున ఏ ఉపదేశావసరము లేక తత్త్వములన్నియు వివృత్త ములై, ఆ మహానభాస్కరుని కిరణపుంజముచే, శిష్యసంఘము యొక్క సందేహతిమిరములు దవ్వుదవ్వులకు తొలిపోయెను. కాంచీపురమున వరదరాజస్వామి కోవెలలో దేవీసన్నిధియందు జటామకుటముతో గూడిన వ్యాసుల శిల్పమొకటి యున్నది. ఆయన కూర్చున్నట్లు. ఆయనకెదురుగా ఆదిశంకరులు నిలుచు న్నటుల స్తంభమున చెక్కియున్నారు అందు వ్యాసమూర్తి రెండవదగు ఏదో యొకవస్తువు చూపుచున్నట్లుండును. మధ్వాచార్యుల విగ్రహమున్నచోటులలో, ద్వైతమును సూచించుచు రెండువ్రేళ్లను చూపుచుండునట్లు శిల్పములు గలవు. దక్షిణామూర్తి ఏచోటుననుండినను చిన్ముద్రదాల్చియే యుండును.

"స్వామి కలడా ? ఉన్నచో ఆయన ఎట్లుండును ? ఏమి చేయును?" అన్న ప్రశ్నకు బదులోయన్నట్లు, అర్జునునకి

కృష్ణుడు గీతయందు 'నాయనా! ఈశ్వరుడొక్కడే. ఒక్కొక్కరి హృదయమందు నెలకొని మాయవలన నియమించుచున్నాడు' అని అనిరి.

"ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి,
భ్రామయ న్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా॥"

మరియొకచోట చరములు అచరములు అన్నియు నా యందే వున్నవనియు చెప్పిరి. ఇవన్నియువిన్న అర్జునునికి ఉన్న జ్ఞానముపోయి లేనిసందేహములు పొడసూపెను. "ఒకచోట నేమో నేను అన్నివస్తువులలోను ప్రతిష్ఠితుడనై వానినెల్ల ఆడించుచున్నాను అని అనియెదవు. మరొకచోట అన్నివస్తువులు నాయందే కలవనెదవు. ఇన్నిమాటలు చెప్పిన ఏమి ప్రయోజనము? నీవు అన్నివస్తువులకు ఆధారమవా? అన్నివస్తువులు నీకు ఆధారమా? ఏదో ఒకటి నిష్కర్షగాచెప్పు. నేను ఒప్పుకొందును." అని అర్జునుడు కృష్ణుని నిలువదీసి అడిగెను. ఇది 'దొన్నకు నెయ్యి ఆధారమా లేక నేతికి దొన్నె ఆధారమా?' అని కుతార్కికునకు ఒకనికి కలిగిన సందేహము వలె నున్నది.

"ఓహో నీకు సందేహాలు వచ్చుటకు ప్రారంభ మయి నదా? సరే. నేను చెప్పిన మాటలలో ఒకటి రెండవది వదలి వేయి. 'న చ మత్స్థాని భూతాని' నాయందొక వస్తువును లేదు. ఇపుడయిన అర్థమయిందా?'

"తలచినపుడెల్లామాటమారిస్తే నేనెట్లు ఒప్పుకొందును? అన్నివస్తువులు నాయందున్నవని, వెంటనే నావద్ద ఏదియును

లేదు అని మరల చెప్పిన ఏమాటలో నిజాయితీవున్నట్టు అనుకొనడం ?"

"పోవయ్యా పో ! నీవేమీ నన్ను నమ్మనక్కరలేదు. నేనేమి చెప్పినను అడ్డుప్రశ్నలు వేసి ఒప్పుకొనవు. ఆ రెండు మాటలు నాకక్కరలేదు. ఇదో ఇది కచ్చితమైన మాట. 'నాహం ప్రకాశః సర్వస్య' నేను ఎల్లరికిని సరిగా ప్రకాశించను.'' అని రెండవ రద్దును కూడా కృష్ణుడు చేసెను.

"ఎందులకు గోచరించవు? ఎందులకై ఇతరులకు తెలియబడవు?" "అదియే యోగమాయ. యోగమాయచే సమావృతుడనగుటచే అందరికిని కానరాను.'' ''అహం యోగమాయా సమావృతః సర్వస్య న ప్రకాశః'' "న చ మత్ స్థాని భూతాని'' అని ఒకప్పుడు, 'న చాహం తే ష్వవస్థితః' అని రెండవమారు, "నాఽహం ప్రకాశః సర్వస్య" అని మూడవ మారు - 'ఇదంతా ఏమిటయ్యా' యనిన, 'అదియే యోగమాయ. నేను మాయచే సమావృతుడను' యని బదులు.

నాహం ప్రకాశః సర్వస్య యోగమాయా సమావృతః ।
మూఢోఽయం నాభిజానాతి లోకో మా మజ మవ్యయం॥

ఇదేటి ఉపదేశము ? మనకేమియు అర్థము కావడము లేదే యని తోచునుగదా !

'నేను అందఱికిని కనబడను.' అని భగవానుడు చెప్పియుండిన, వేయిమంది జనులున్న వేయిమందికి కనబడనని అర్థము. నేను అందరికిని కనబడను అనిన, వేయిమందిలో

999 మందికి కనపడకపోవచ్చును. ఒకనికి కనపడిన కనపడ వచ్చును-అని అర్థము. 'నాహం ప్రకాశః సర్వస్య' యనియే చెప్పెను. మాయచే బాధపడనివానికే ఆయన గోచరించును.

దారిలో ఎవరో ఒకరు ఒక పూలమాలను పడవేసి వెళ్ళిరి పగటిపూట అందరికిని అది పూలమాలగనే కనబడెను. దానిచే వారికి ఏ భయమును వికారమును కలుగలేదు. మసక చీకటిలో ఎవడో దానిని త్రొక్కి 'అయ్యో! పాముపాము' యని యరచెను. మాలగా నుండునదియు, పాముగానుండు నదియు ఒకేవస్తువు. మాలయని తెలిసినతోడనే పాము మాయమగును. కానీ పాము అని భ్రమసినందులకు ఆధారము మాలయే. 'ఈప్రపంచములో నేనున్నాను, నాలో ఈప్రపంచ మున్నది.' అనిన ఏమి అర్థము? పూలమాలలోనే పాము న్నది. పాములోనే పూలమాల ఉన్నది అని అర్థము. గుండె చెదరినవారికి మాల పాము ఆయెను. అజ్ఞానముపోయి, పాము కాదు మాలయని తెలిసికొనినవానికి, పామును మాల తనలో నిముడ్చుకొని మాలగ కనబడును. ప్రపంచమును సత్యము అని లక్షించువానికి, ప్రపంచమునకు - ఆధారభూతుడు, భర్త ఈశ్వరుడు. ఈ దృశ్యప్రపంచమును జ్ఞానముచే తెలసికొన్న వానికి ఈశ్వరుడే సర్వము వ్యాపించినట్లు తోచును.

ద్రావిడకవి కంబరు, సుందరకాండయందు ఈవిషయ మును గూర్చియే ప్రస్తావించును. పంచభూతాత్మకమగు

మాయ, రామచంద్రమూర్తి దర్శనమాత్రమున దొలగిపోవు నని వారు వ్రాసిరి. అన్ని వస్తువులలోను తానే నెలకొని యుండినట్లు శాంతుడై సుస్థిరుడై 'అంతా ఒక్కటే' యను ఈ అద్వైతానుభవమును చూపుచు, చిన్ముద్రతో ఉపదేశ మొనర్చు దక్షిణామూర్తి దర్శనమాత్రమున మాయపొర వీడి ఆనందాద్వైతజ్ఞానములుముప్పిరిగొన, ఆనందసముద్రములో మనము కలసిపోయెదము.



# అక్షమాల.

అరవభాషలో పంచకావ్యములని చెప్పుట ఒక వాడుక. ఆ భాషలో కావ్యమును కాప్పియ మందురు. ఈ పంచకావ్యములలో మూడు జైనులు వ్రాసినవి. తక్కిన రెండున్నూ బౌద్ధమతానుసారము వ్రాయబడినవి. తెనుగుభాషలోనూ పంచకావ్యము లున్నవి ఈ వాడుక సంస్కృతము ననుసరించి ప్రాంతీయభాషలకు వచ్చినట్లున్నది. ప్రతిభాషయందును శ్రేష్ఠములగు కావ్యములెన్నియో ఉండును. కాని వానిలో మహత్తరములయిన కొన్నిటిని మాత్రము పంచకావ్యములని వ్యవహరింతురు.

సంస్కృతమున మాఘ మనున దొక కావ్యము. దీనిని మాఘుడను కవి వ్రాసెను. ఈ కావ్యమునకు అసలు పేరు శిశుపాలవధ. శిశుపాలుడు కృష్ణుని విరోధి. కృష్ణుని సర్వావస్థలయందును అతడు నిందించుచునే యుండెను. ఆ వైరఫలితమే ఈ కావ్యమునందు వర్ణింపబడినది.

ఒక్కొక్క కవియు ఎన్నో కావ్యములు వ్రాసినను అతని కృతులలో ఏ ఒకటికో ఏ రెంటికో ఖ్యాతి. ఇట్టి కావ్యములలో కావ్యవస్తువు అతిసహజముగా యథాతథముగా వర్ణింపబడియుండును. కృతికర్తలు కాలగర్భమున గలసిపోయినను

వారి కీర్తిమాత్రము, కావ్యరూపమున చిరస్థాయిగ నిలిచి యుండును. వర్ణనలు కన్నులకు కట్టినట్లుండుటచే ఈ కావ్యము లకు శాశ్వతకీర్తి లభించును.

మాఘకావ్యములో ప్రథమదృశ్యము—కృష్ణపరమాత్మ ద్వారకలో బయట ఒక సింహాసనమున ఉపవిష్టుడై యుండును. అదే సమయమున ఆకాశమార్గమున వీణాగానప్రియుడగు నారదుడు వచ్చుచుండగా కృష్ణపరమాత్మ పరివారము, ఆవచ్చు చున్న ప్రకాశపుంజ మేమైయుండునని ఒకరినొకరు ప్రశ్నిం చుచుందురు కడుదూరమున నుండుటచే ఇదమిత్థమని వారు నిర్ణయింపజాలకుందురు. ఆ ప్రకాశము దగ్గరకు రాను రాను ఒకవ్యక్తిరూపముగా గోచరించెను. కాని లింగభేదము తెలి యలేదు. మరికొంతదగ్గరకురాగా అది పురుషుడని తేలినది. 'ఎవరీ మనిషి?' యని మరింత కుతూహలముతో చూడగా నారదుడని తెలిసినదట.

చయ స్త్విషా మి త్యవధారితం పురా
తతః శరీరీతి విభావితాకృతిమ్ ।
విభు ర్విభక్తావయవం పుమా నితి
క్రమా దముం నారద ఇత్య బోధి సః ॥

చయః=నిండినప్రకాశము, మొట్టమొదట ఏదో ప్రకాశ పుంజముగ కనబడినది. 'తతః శరీరీతి విభావితాకృతిమ్' తరువాత కొంచెము ఆకృతిదాల్చినట్లు తోచినదట 'విభు ర్విభక్తావ యవం పుమా నితి' మరింతదాపునకురాగా, ఆకృతి స్పష్టము కాగా ఒక పురుషునివలె తోచినదట. 'క్రమా దముం నారద

ఇ త్యబోధీ సః'-నారదుడే వచ్చుచున్నాడని తరువాత తెలిసినది. ఇట్లు స్వాభావికమగు రీతితో కావ్యాలంకార సృష్టిని చేయుటను మహాకవులకు పరిపాటి. ఆ కాలమున ఇట్టికావ్యము లెన్నివ్రాయబడినవో ? అవియన్నియు ఇప్పుడున్నవని చెప్ప లేము.

అటుపిమ్మట నారదుని వేషము కవి వర్ణించును.

అజస్ర మాస్ఫాలితవల్లకీగుణ
క్షతోజ్జ్వలాంగుష్ఠ నఖాంశుభిన్నయా ।
పురః ప్రవాళై రివ పూరితార్ధయా
విభాంత మచ్ఛస్ఫటికాక్షమాలయా ॥

నారదుడు వీణాతంత్రుల నెల్లపుడు మీటుచునే యుండును. అజస్రము=ఎల్లప్పుడు. వల్లకీ=వీణ. గుణ = తంత్రులు. ఆస్ఫాలిత = మీటుట. వీణ నెల్లప్పుడు వాయించుటచేత ఆయన అంగుష్ఠము ఎఱ్ఱనై యున్నది. ఆయన నఖములు మాత్రము తెల్లగానున్నవి.

నారదుడు వీణను మీటుటచే బొటనవ్రేలికి నొప్పి ఎత్తినప్పుడు వీణనువదిలి జపమాలను గ్రహించి జపముచేయును. జపమాలను త్రిప్పుటలో ఆయన అంగుష్ఠపు రక్తచ్ఛాయలు జపమాలలోని స్ఫాటికశిలలను అరుణోజ్జ్వలముగాచేసి, జపమాలను సగము స్ఫటికమాలగను, సగము పగడముల దండగను చేసినట్లు తోచుచున్నది— "పురః ప్రవాళై రివ పూరితార్థయా విభా న్త మచ్ఛస్ఫటికాక్షమాలయా" మాలను త్రిప్పునపుడు మాధవుని నామము జ్ఞప్తికి రావలెను. విభూతినిపూసుకొనినపుడు ఈశ్వరునిస్మరణ కలుగవలెను. కొందరు సూర్యుని

చూచి కనులు మూసికొని దేవుని స్మరింతురు. ఇవి ఏవియూ లేకున్న భగవన్నామస్మరణమున కెంతమాత్రమున్నూ ఎడ మనుమాటే ఉండదు.

మాఘకవి చమత్కారముగా నారదుని హస్తగతమగు స్ఫటికాక్షమాలసగము ప్రవాళహారమువలె మారినదని వర్ణించెను. దీనినేల చెప్పితిననగా–నా యొద్దనున్న స్ఫటికమాలలో ఒకపగడము మేరువుగా కట్టబడినది. " నేను వీణవాయించెదనా ఏమి? అందుచేతనే ఈమాల ప్రవాళస్థగితముగానున్నది". అని అనుకొంటిని. అపుడు మాఘుని కావ్యము నా స్మృతిపథమున మెరిసెను.

'ప్రవాళ' అను సంస్కృతపదమునుండి 'పగడము' అనెడి తెనుగుపదమునూ, తమిళములోని 'పవళము' అనెడి పదమున్నూ పుట్టినవి. పశ్చిమ కన్నడదేశమున 'హవళ' మనియందురు. సంస్కృతములోని పదమునకు కన్నడములోని పదమునకు ఇంచుమించు సామరస్యమున్నది. తమిళమునందు 'ళ'కారమువచ్చిన తెనుగున అది 'డ'కార మగును. తమిళమున 'పుగళ్' అన్నపదమున్నది. తెనుగున అది 'పొగడుట', కన్నడమున 'హొగళు' లేక 'పొగళు'. ఇటు మారుటకు వేదమందేదైన ఆధారమున్నదా యని చూచితిని.

పశ్చిమదేశమునను, మహారాష్ట్ర కన్నడ దేశములందును ఋగ్వేదము అధికము. తూర్పు సముద్రతీరమున యజుర్వేదము బహుళము; ఋగ్వేదముకూడ కొంచెమున్నది. ఆంధ్రదేశమున నూటికి తొంబదితొమ్మిదిమంది యజుర్వేదులు. తమిళదేశమున ఎనభైపాళ్లు యజుర్వేదులు. తెలుగు

దేశమున సామవేదము లేదు. తమిళ దేశమున 15 శాతము సామవేద మున్నది. ఋగ్వేదము 5 శాత ముండవచ్చును. పశ్చిమ దేశమున బొంబాయి, నాసిక్ నుండి కన్యాకుమారి వరకు ఋగ్వేదమే యధికము. అయినను పురాతన కాలమున తమిళ దేశమున సామవేదులు అధికముగా నుండిరని తలచుటకు ఆధారము లున్నవి. శాఖయనిన కొమ్మ. ఒక్కొక్క వేదము నకు అనేక శాఖలు. సామవేదమునకు వేయిశాఖలు. ఒక్కొక్క కుటుంబమును ఒక్కొక్క శాఖయని చెప్పుట వాడుక. తమిళ నాడునందు సామవేదులు వేయికుటుంబము లుండినట్లు తెలియుచున్నది. "ఆయిరశాకై ఉడైయాన్" అని తేవారము నందు కొన్నిచోట్ల ఈశ్వరుని వర్ణించియున్నారు. 'సహస్ర శాఖల స్వామి' అని దానికి అర్థము.

ప్రస్తుతము తమిళ దేశమున ఎక్కువగా నుండు సామ వేదమునకు "గౌతమ" మని పేరు. శ్రోత్రియులలో కొందరు సామవేదులు జైమిని లేక "తలవకార" శాఖకు చెందినవారు. మలయాళ దేశమందలి నంబూద్రులుసయితము తలవకార శాఖకు చెందినవారే! తిరునల్వేలి ప్రాంతముననున్న శ్రోత్రి యులుకూడ తలవకారశాఖా సాంప్రదాయులే. ఉత్తరము నుండి వచ్చినవారిలో సామవేదులదే గౌతమశాఖ. ఉత్తర దేశపువారు అనుటచే వీరు తెలుగు దేశమునుండి వలస వచ్చి యుండవలెను. లేదా సంధ్యావందనమున "నర్మదాయై నమః ప్రాతః. నర్మదాయై నమో నిశి, నమోఽస్తు నర్మదే తుభ్యం" అని శ్లోక మొకదానిని వర్ణించుటచే వీరు నర్మదానదీ ప్రదే శమునుండి వచ్చియుండవలెను.

దక్షిణదేశమున 'నాయన్మార్' అని వ్యవహరింప బడు వారిలో 'సోమయాజి మోరర్' అని యొకరుండిరి. వారు తలవకార శాఖీయులు. వీరొకపరి యాగమొకటి చేసిరి. 'అగ్నిముఖముగా నిచ్చు ఆహుతులను పరమేశ్వరుడే స్వయముగా గ్రహించుననుట' ఒక ఐతిహ్యము. కాని పరమేశ్వరుని రప్పించుటెట్లు? తిరువారూర్‌లోని సుందరమూర్తి ఈశ్వరునికి అత్యంత సన్నిహితుడట. ఆయన జవ్వాదిని మేనలందికొని కుంకుమబొట్టు పెట్టికొని ఎల్లప్పుడు అలంకారముతో ఉన్ననూ పరమశివునితో ముఖాముఖి మాటలాడే చొరవకలవాడని ఎవరో సోమయాజికి చెప్పిరి. ఈభక్తునికొరకై ఈశ్వరుడు దౌత్యముకూడ చేసెనట. ఆయనను ఎట్లైన యాగమునకాహ్వానించిన, ఈశ్వరునే హవిస్సు గ్రహించునట్లు ఆయన చేయునని చెప్పిరి.

అంతటితో సోమయాజి తిరువారూరుకు బయలు దేరెను. తిరువారూరు గ్రామమున "విరల్‌మిండ నయనార్" అను మరియొక భక్తుడుండెను. ఆయనకు ఈశ్వరునిపైననే కోపము. శివుడికి నడత సరిలేని సుందరునిపై ఏల ఇంత మమత? "ఈ సుందరమూర్తికి నీఆలయప్రాంగణ సమీపమునకు వచ్చుటకుకూడ అర్హతలేదు". అని ఈశ్వరునితో ఆతడు వాదులాడెను. కాని ఈశ్వరు డేవియు చెవిని పెట్టుకొనునట్లు తోచలేదు. "ప్రక్చందవాదులతో ఘుమఘుమలాడుచూ అనుదినమూ వేశ్యాగృహమునకేగు సుందరునితోడి, సాంగత్యముంచుకొన్న ఈశ్వరు డెట్టివాడు?" అని విరల్‌మిండనయనారుకు ఆక్రోశము గల్గెను. ఈ తిరువారూరునందే అడుగు పెట్టకూడదని తీర్మానించుకొనెను.

అంతటితో తిరువారూరునుండి బయలుదేరి, ఊరికి బయటి ఎల్లలో మకాము వేసెను. తిరువారూరుకు చేరిన వారు ఎవరువచ్చినను వారి కాళ్ళను తనచేతి కొడవలితో తెగ నఱకసాగెను. ఇతని భక్తిని తెలిసిన ఈశ్వరుడు ఒకరోజు మారు వేషముదాల్చి వచ్చెను. నాయనార్ అతిథికి పాదప్రక్షాళన చేయుచు 'తమ దేవూరు' అని ప్రశ్నించెను. అతడు తిరువారూర్ అని బదులు పలికెను. అది విన్నంతనే కొడవలి నెత్తుకొని ఆయనను నయనార్ తరుమసాగెను. ఆయన పరుగిడ, ఈయన వెంబడింప, స్వామి మెల్లగా నాయనార్‌ను తిరువారూర్ ఎల్ల లోనికే ఎలయించుకొని పోయెను. అప్పుడు ఆయన 'ఏమయ్యా! తిరువారూర్ ఎల్లలోనికి రానంటివే. ఇప్పుడెటులు వచ్చితివి?' అని నాయనారును ప్రశ్నించెను. నాయనార్‌నకు తనతప్పిదము తెలిసెను. అందులకు ప్రాయశ్చిత్తముగా వెంటనే తనకాళ్ళను తానే తెగవేసుకొన్నాడట. అటుపై ఈశ్వరుడు నయనారును తనలో ఐక్యము చేసికొనెనని యొకకథ. నాయనార్ ఎల్ల దాటిన చోటును "వండాంపాలై" అని యందురు.

సోమయాజిమారెర్ సుందరమూర్తిని వెదకికొనుచు తిరువారూర్ వచ్చిచేరిరి. ఆయనకు ముందు వెనుకలు తెలియదు. సుందరమూర్తితో నెయ్యమెట్లు చేయుట ? ఒక యోచన సోమయాజికి తోచెను. "తూదువిళంగీరై" అను ఒక ఆకుకూరను ప్రతిదినము సుందరమూర్తి వేశ్యయింటిలో ఇచ్చి దానిని ఆయనకు వండిపెట్టుమని ఆ వేశ్యను బతిమాలెను. ఆ దాసియు ఏదియో బ్రాహ్మణు డిచ్చుచున్నాడే యని దానిని వండి సుందరమూర్తికి వడ్డించునట్లు ఏర్పాటు గావించెను.

ఈ ఆకుకూరను తిన్నచో జ్ఞానము వృద్ధియగునని అందురు. అనుదినము సోమయాజి ఆకుకూరను దాసీగృహమున అందించుచుండెను. ఒకరోజు నదిలో వరదలువచ్చి నాలుగు ఐదు రోజులవరకు తగ్గలేదు. అందుచే ఆ కూరను తెచ్చి ఇచ్చుటకు సోమయాజికి కష్టమాయెను. దినమూ వండెడి కూర లేకపోవుటచే సుందరమూర్తి దాసిని 'కూర లేదే'మని ప్రశ్నించెను. "ఈకూరను బ్రాహ్మణుడొకడు తెచ్చి ప్రతిరోజూ వండిపెట్టుమని వేడుకొన్నాడు. నాలుగయిదు రోజులుగా ఆయన రావటము లేదు. అందుచేత వండిపెట్టుటకు వీలులేకపోయిన"దని దాసి విన్నవించినది. సుందరమూర్తికి ఆ బ్రాహ్మణునిగూర్చి తెలిసికొనవలెనని కుతూహల మేర్పడెను.

మరుసటిరోజు బ్రాహ్మణుడు ఆకుకూరను తెచ్చినప్పుడు దాసి ఆయనను సుందరమూర్తివద్దకు తీసికొనిపోయెను.

"మీరెవరు స్వామీ? ఎందులకు ప్రతిరోజున్నూ ఈ ఆకుకూరను తెచ్చి ఇస్తున్నారు?"

"ఆ విషయము మీతో ఏకాంతముగ చెప్పవలె. నాకు మీవలన కావలసిన ఉపకార మున్నది. మీ అనుగ్రహం కోసం ఈ కైంకర్యము చేస్తున్నాను."

"నాకు సాధ్యముకాని పని ఐతే ... ... ...?"

"మీకు సాధ్యముకాని పని ఏదీ లేదు."

సోమయాజి ఏకాంతముగా తన కోరికను సుందరమూర్తితో చెప్పుకొనెను. "యాగమున స్వామియే ప్రత్యక్షముగా హవిస్సును గ్రహించుట స్వల్పకార్యము గాదు.

అయినను మీకొఱకు స్వామిని అడిగెద" నని చెప్పి సుందర మూర్తి గుడికి వెళ్ళెనట.

ఈశ్వరుడు సుందరమూర్తి విన్నపమాలకించెను. "నాకు నీవు భక్తుడవు నీభక్తు డతడు. అతని సేవచేయవలెనని చెప్పు చున్నావు సరే కానీ. నేను అతడిచ్చు హావిస్సును గ్రహింతును. కాని నేను ఏరూపములో వచ్చినప్పటికీ అతడు హావిస్సును అర్పింపవలెను. ఈ విషయమును నీవు అతనికి తేట తెల్లము చేయవలెను". సుందరమూర్తి సోమయాజితో ఈ విషయము చెప్పగా అతడు ఆనందముతో తన గ్రామము నకు వెళ్ళిపోయెను. యాగమున కుపక్రమించెను.

యాగము జరుగుచున్నది. ఈశ్వరు డొక చండాల వేషము ధరించెను. అంబిక యొక మాలతగా తయారైనది. ఆమెశిరస్సున ఒక కల్లుకడవ, నాల్గువేదములు నాలుగు శునక ములై వచ్చినవి. భూతగణములన్నియు మాలవాండ్రై కల్లు ముంతలతో యజ్ఞవాటికలోనికివచ్చెను. సోమయాజిమాత్రము కదలలేదు, మెదలలేదు. ఆనందముగా ఉపవిష్టుడై యుండెను. తక్కిన బ్రాహ్మణులు యజ్ఞము మైలపడినదని నాలుగు వైపు లకు పారిపోయిరి. సుందరమూర్తి హెచ్చరికను జ్ఞప్తియం దుంచుకొని, సోమయాజి చండాలుని (ఈశ్వరుని) కి హావిస్సును ధారపోసెను. ఈశ్వరుడు దానిని గ్రహించి అనుగ్రహించెనని ఒకకథ. అందులకే సోమయాజి "అరువత్తు మువ్వురు" అనెడి శివభక్తులలో ఒకడుగ చేర్చబడెను.

ఇట్లు ఆ కాలములో నడచిన యాగము లనేకములు. సామవేదములలోసహితము తలవకారశాఖ, మలయాళ దేశమున

అధికము; చోళదేశస్థు- లోనూ తలవకారశాఖీయులు కలరని చెప్పుటకే సోమయాజి కథను చెప్పితిని. ఉత్తరదేశమున శుక్ల యజుర్వేదమునకు జేరిన మాధ్యందినశాఖ అధికము. ఈ శాఖ వారి వ్యాకరణమున ఇతర వేదములందువచ్చు 'య'కారమును 'జ'కారముగ పలుకు నియమము ఒకటి ఉన్నది. అందుచేతనే యమున - జమున; యోగి - జోగి అని వ్యవహారములోకూడ వేదమునను సరించి 'య'కారము 'జ'కారముగా నుచ్చరింతురు.

పాలస్తీనము మొదలగు సెమిటిక్ దేశములందు (జూదులు, అరబ్బులు ఉండు ప్రాంతములు) కూడ మిత్రుడు, వరుణుడు మొదలగు వైదిక దేవతల ప్రశంసయున్నట్లు క్రీ.పూ. 1400 సం॥ లకు సంబంధించిన శిలాశాసనములవలన తెలియుచున్నది. దీనిని ఆకాలమున వేదములు అచట వ్యాప్తిలో నున్నట్లు గుర్తించవచ్చును. ఉత్తరహిందూస్థానమువలెనే ఆ దేశములందు గూడ 'యహోవా'ను 'జహోవా' యనియు, 'యూసఫ్'ను 'జోసఫ్'అనియు, 'య'కారమును 'జ'కారముగా నుచ్చరింతురు. అందుచే అచటకూడ శుక్లయజుర్వేదమునకు చెందిన మాధ్యందినశాఖీయులు ఉండియుండవలెనని ఊహించవలసియున్నది. దీనినుండి వేదమునందు ఏ అక్షరము ఏ ప్రదేశమందు ఎట్లుచ్చరింపబడుచున్నదో అట్లే భాషయందును, మాటలలోను వ్యవహారదశకు వచ్చినదని తెలియుచున్నది.

అరవమున 'మార్గళి త్తింగళ్' అనుదానిని తెనుగు దేశపు వైష్ణవులు 'మార్గడి త్తింగళ్' అని అందురు. 'మృగశీర్షము' అనుమాటను వారు 'మృగశీర్ఢము' అని చెప్పుదురు.



జయేంద్ర సరస్వతీ స్వామితో సహా
ఇటీవల జరిగిన సదస్సుకు అరుదెంచుచున్న
జగద్గురు శ్రీ శంకరాచార్య స్వామివారు

'స్ఫటికాక్షమాలయా' అనుదానిలో అక్షరమాల అను పదమున్నది. 'అ కారము మొదలు క్ష కారము' వరకు ఏబది యొక్క అక్షరములున్నవి. క్ష అనునది మేరువు. మాల జప సంఖ్యను దెలుపు సాధనము. క్ష అనుదానిని వదలి తక్కిన అక్షరములు జపించిన 50 అక్షరములగును. 'క్ష' అను మేరువును దాటిపోరాదు. సూర్యుడు మేరువును దాటడను సంప్రదాయము ననుసరించి క్ష కారమనెడి మేరువు వరకు జపమాలను లెక్కించి దానినిదాటక మరల అట్లే వెనుకకు త్రిప్పవలెను. ఇట్లు ఒక్కమారు మేరుపర్యంతము జపమాలను త్రిప్పి తిరిగివచ్చిన సంఖ్య 100 అగును. పదిమాలలు జపించిన వేయి యగును. అక్షమనగా అ కారాది క్ష కారాంతము. స్ఫటికాక్ష మాల యనగా స్ఫటికములతో చేసిన అ కారము మొదలు క్ష కారమువరకు ఉన్న మాలయని అర్థము. రుద్రాక్షమాల యనినను ఇదియే.

స్ఫటికము ఈశ్వరునివలె తెల్లగ, స్వచ్ఛముగా నుండునది. హిందీభాషలోని 'అచ్ఛా' అనెడి పదము స్వచ్ఛము (సు+అచ్ఛ) అను పదమునుండి పుట్టినదే అనిపించును. అకారాది అక్షరములను ఆంగ్లమున "ఆల్ఫబెట్" అని యందురు. గ్రీకునందు ఆల్ఫాయనునది మొదటి అక్షరము. బీటాయనునది రెండవ అక్షరము. అరబ్బీభాషయందును అలీఫ్, బే, చే, తే అనియే అక్షరములు ఆరంభమగును. రెండింటిలోను మొదటి అక్షరము 'అల్' అని ప్రారంభమగును. అన్నిభాషలకును సంస్కృతము మూలము అని అభిప్రాయపడిన సంస్కృతమున గూడ అల్ అను అక్షరము ఉండవలెను.

చిదంబరమున నటరాజ నర్తనావసానకాలమున గల్గిన పదునాల్గు శబ్దములు పదునాలుగు సూత్రములుగ నేర్పడెను. వీనికి మాహేశ్వర సూత్రములని పేరు. వీనిని మూలముగా నుంచుకొని పాణిని వ్యాకరణసూత్రములను వ్రాసెను. దానికి పతంజలి మహాభాష్యమును వ్రాసెను.

మనోవాక్కాయములు త్రికరణములు. పతంజలిమహర్షి ఈత్రికరణములకు చికిత్సాప్రాయముగ కృతులను సృష్టించెను. మనస్సునకు చికిత్సచేసెడిదే యోగశాస్త్రము. వాక్కునకు చికిత్సచేసెడిది వ్యాకరణభాష్యము. దేహమునకు రుగ్మత పోవునట్లు చికిత్సచేసెడిది 'చరకసంహిత' యను వైద్యశాస్త్రము. ఈ మూడిటిని పతంజలి వ్రాసెను.

నటరాజు ఢక్కను వాయించుచు నర్తనమాడు సమయమున ఆ ఝల్లరీశబ్దములనుండి—

అఇఉణ్, ఋఌక్, ఏఓఙ్, ఐఔచ్, హయవరట్, లణ్, ఞమఙణనమ్, ఝభఞ్, ఘఢధష్, జబగడదశ్, ఖఫఛఠథచటతవ్, కపయ్, శషసర్, హల్ అను సూత్రము లేర్పడెను.

కడపట హల్ ఇతి మాహేశ్వరాణి సూత్రాణి అని ముగింపబడినవి. ఇవి చాలమందికి తెలిసియుండవచ్చును. శ్రావణ పూర్ణిమనాడు దీనిని వేడుకగా చెప్పుదురు. పరమేశ్వరుడు ఉడుక (హుడుక్క) ను వాయించుచు గిఱ్ఱుమని తిరుగునప్పుడి శబ్దము లేర్పడినవట.

అక్షరములనుచేర్చి చెప్పుటకు పాణిని, ఈ సూత్రముల నుండి ఒక సంజ్ఞను గ్రహించెను. ఈ పదునాలుగు సూత్రములలో ఒకదాని మొదటిఅక్షరమునుగాని కొండొక అక్షరమును

గాని, మరొకదాని కడపటిఅక్షరమును కలిపిచెప్పిన నడుమనున్న అక్షరములుగూడ అర్థమగును. హాయవరట్ అనుదానిలో హ అనునది మొదటిఅక్షరము. హాల్ అనునది కడపటిఅక్షరము. "ల్" ఈ రెండిటినీ కలిపిన హాల్ అగును. అది దానిమధ్య లోని ముఖ్యాక్షరములన్నీ చెప్పును. ఇట్లు మొదటి అక్షరము 'అ', కడపటి అక్షరము 'ల్' చేర్చిన 'అల్'అగును. అల్ అనగా అచ్చులు హల్లులుగా ఏర్పడిన అక్షరములన్నియు అర్థమగును.

'అలోఽంత్యస్య' అనునదొక సూత్రము. ఇందు 'అల్' అనుదానికి అక్షరము అని అర్థము. మహేశ్వరసూత్రముల ననుసరించి పాణిని అష్టాధ్యాయిని వ్రాసెను.

ఇట్లు అన్ని భాషలయందును అకారము - ఆదిగనున్నది. హిందూస్థానీలో ఆలీఫ్ అను మొదటి అక్షరము, గ్రీకులోని ఆల్ఫా ఈ రెండున్నూ 'అల్' అను అక్షరమునుండి వచ్చినవి. ఆల్ఫబెట్ అనే ఇంగ్లీషు పదముకూడ ఈ 'అల్' నుండియే వచ్చినదని నా యభిప్రాయము.

అక్షరమును వ్యాకరణశాస్త్రమున 'అల్' అనియే చెప్పుదురు. నటరాజు ఝల్లరినుండి ఈ సంజ్ఞలు బయల్వెడలి ప్రకాశించుచున్నవి. వానికి సూత్రములు వ్రాసినది పాణిని. పాణి అనగా చేయి. భగవానునిపాణి - నినాదము - పాణి నినాదముగ మారెను. నారదుడు జపమాలను ధరించినట్లు మాఘుడువ్రాసినది గుర్తుకొచ్చి దానినుండి స్ఫటికాక్షమాల-పగడాలమాలగ మారిన ప్రస్తావనలో ఒకదానికొకటి అనుబంధముగ, శబ్దశాస్త్ర చర్చలోనికి దిగినది.

◆

# శివుడవో - మాధవుడవో

'శివస్య హృదయం విష్ణుః, విష్ణోశ్చ హృదయం శివః' అని శివకేశవుల ఏకత్వము అనుదినమూ సంధ్యావందన మంత్రాలలో చెప్పుకొంటూ ఉంటారు. శివవిష్ణువుల అభేదమును ఈ మంత్రము తెలుపుతున్నట్లే, హరిహరుడు, రామలింగడు, రామేశ్వరుడు, శంకరనారాయణుడు అనేపేర్లు కూడా ఈ అభేదాన్ని చాటుతున్నవి.

ఒకప్పుడు 'రామేశ్వరము' అనే పదము ఏసమాసానికి చేరినదని దేవతలకు సందేహము వచ్చినదట. వ్యాకరణములో చెప్పబడిన సమాసములలో కర్మధారయము, తత్పురుషము, బహువ్రీహి అను సమాసాలున్నవి. రాజసేవకుడు - రాజుయొక్క సేవకుడు. ఇది తత్పురుషము. నల్లకుక్క, నల్లనికుక్క - ఇది కర్మధారయసమాసము. దండపాణి - దండమును చేతిలో కలవాడు. ఇది బహువ్రీహి. దండపాణి యనగా సుబ్రహ్మణ్యుడు. దండపాణి పదములోలేని అర్థమును చెప్పునది కనుక బహువ్రీహి. బహువ్రీహి పదమునకే బాగుగా పండెడిపొలమని అర్థము. నూకకలముల ధాన్యమును పండించేవాడు బహువ్రీహి.

రామేశ్వరము ఏ సమాసము? తత్పురుషమా? 'రామస్య ఈశ్వరః' అని అన్నచో రామునికే ఈశ్వరుడు అన్న

అర్థం వస్తుంది. అది శివాధిక్యమును చాటుతుంది. శివధనుర్భంగమును చేసిన రాముడు శివునికంటే ఏవిధముగా తక్కువ? సర్వలోకశరణ్యుడు రాముడు. అతనికిపైన ఒక ఈశ్వరుడా? ఈ సందేహాలన్నీ తీర్చేవారెవరు? వారు విష్ణువునే అడుగదలచి వైకుంఠానికి వెళ్ళారు. "ఇంత చిన్నవిషయానికి ఎంతదూరం వచ్చినారు? ఆ పదాన్ని చూడగనే తెలుస్తున్నదే తత్పురుష మని. 'రామస్య ఈశ్వరః' " అని విష్ణువు దేవతలతో అన్నాడట. కాని దేవతలకు సందేహనివృత్తి కాలేదు.

విష్ణువు కల్యాణగుణపూర్ణుడు. వినయము ఆ కల్యాణ గుణములలో ఒక్కటికదా? ఏదో వినయంచేతగాని, అహంభావము ఉండరాదనికాని, మొగమాటపడికాని ఆవిధంగా బదులుచెప్పి ఉంటాడు. విష్ణువును అడిగితిమికదా! పోనీ ఆ శివునినే అడుగుదాం. ఆయన ఏంచెప్తాడో అని, 'విష్ణుస్తత్పురుషం బ్రూతే' అని అనుకొంటూ, కైలాసానికి కాళ్ళను పుళ్ళించారట.

నాకలోకవాసుల సందేహాన్ని నాగాభరణుడు విన్నాడు. 'ఇందులో సందేహానికి తావేది? రామేశ్వరుడు బహువ్రీహి సమాసము. రాముడే ఈశ్వరుడుగా కలవాడు రామేశ్వరుడు' అని ఆయన బదులు చెప్పినాడట. దేవతలకు ఏమీతోచలేదు. వ్యాకరణవిషయంలో శివవిష్ణువులకు ఇట్లు భేదాభిప్రాయాలు వస్తవని వాళ్ళు కలలోనైనా తలచలేదు. వీళ్ళిద్దరికీ పేరుతో ప్రసక్తి ఉన్నందున, వేరే మధ్యవర్తిని అడిగి సందేహం తొలగించుకొందామని, 'బహువ్రీహిం మహేశ్వరః' అని చెప్పుకొంటూ బ్రహ్మదగ్గరకు వెళ్ళినారట. బ్రహ్మ వాళ్ళ

సందేహాన్నీ, జరిగిన సమాచారాన్నీ శాంతంగావిని "ఈ సమాసము తత్పురుషమూకాదు, బహువ్రీహీకాదు. ఇది కర్మధారయము. వీరరాఘవుడు అంటే వీరుడొక్కడూ, రాఘవుడు వేరొక్కడూ అనియా అర్థం? 'రామశ్చ అసౌ ఈశ్వరశ్చ రామేశ్వరః' రామేశ్వరపదం నిస్సందేహంగా కర్మధారయం" అని తీర్పుచేసినాడట.

విష్ణుస్తత్పురుషంబ్రూతే బహువ్రీహిం మహేశ్వరః,
ఉభయోరప్య తృప్తానా మాత్మభూః కర్మధారయమ్॥

'ఆత్మభూః' అనగా బ్రహ్మ. దేవతలకు - శివవిష్ణువులు ఒకేపరతత్త్వమని బ్రహ్మ బోధించినాడట. ఈ సత్యాన్ని, ఈ ఐక్యమును మానంకూడా ఎన్నోవిధాల తెలుసుకొనుచున్నాము.

పురాణాలలో శివవిష్ణువుల మధ్య యుద్ధం జరిగిందని కొన్నిచోట్ల వ్రాయబడింది. ఒకచోట విష్ణువు జయించినాడనీ, మరొకచోట శివుడు జయించినాడనీ వ్రాసినారు. అంతేకాదు, ఒకరికొకరు సహాయం చేసుకొన్నట్లూ ఉన్నది. ఒకరినొకరు పూజించుకొన్నట్లూ దృష్టాంతమున్నది.

విష్ణుపురం అనేచోటునకు సమీపంలో 'తిరువీళిమిళలై' అన్న క్షేత్రమున్నది. ఇచ్చటి స్వామికి నేత్రార్పణేశ్వరుడని పేరు. ఈచోటులో ఈశ్వరుని విష్ణువు అనుదినమూ సహస్రకమలములతో పూజించేవాడనీ, ఒకనాడు వెయ్యికి ఒకపువ్వు తగ్గిపోగా, తన నేత్రకమలమునే విష్ణువు పెకలించి, ఈశ్వరునికి అర్పించినట్లు ఐతిహ్యము.

భగవత్పాదులున్నూ 'సాంబే పరబ్రహ్మణి' అనే మకుటంతో ఈక్రింది శ్లోకాన్ని వ్రాసినారు.

విష్ణుర్యస్య సహస్రనామ నియమా
దంభోరుహాణ్యర్చయ
న్నేకో నోపచితేషు నేత్రకమలం
నైజం పదాబ్జద్వయం,
సంపూజ్యాసుర సంహతిం విరళయన్
త్రైలోక్య పాలోభవ
తస్మిన్ మే హృదయం సుఖేన
రమతాం సాంబే పరబ్రహ్మణి ॥

ఇక్కడ తిరుక్కండియూరను క్షేత్రమొకటి ఉన్నది. ఇచ్చటి మూర్తికి 'బ్రహ్మశిరఃఖండీశ్వరు'డని పేరు. పూర్వము బ్రహ్మకూడా ఈశ్వరునివలెనే పంచముఖుడుగ ఉండేవాడట. అందుచే ఆయనకు కొంచెం అహంభావం హెచ్చయింది. ఈశ్వరుడు కోపించి, అతనితల నొకదానిని గిల్లివేయగా, బ్రహ్మ కపాలము శాపవశాత్తు ఈశ్వరుని చేతికే అంటుకొని పోయినదట. పైగా బ్రహ్మహత్యాపాతకము వేరే చుట్టుకొన్నదట. శివునికి శాపనివృత్తి చేసినది తిరుకుండియూరులోని పెరుమాళ్ళే యని ఈస్థలపురాణం చెప్పుతున్నది. ఇందలి మూర్తికి హార శాపవిమోచకు డని పేరు.

రామాయణములోగూడా శివ విష్ణువులకు వివాద మేర్పడినటులున్నూ, విష్ణువు హుం అని అన్నంతనే శివునివింటి అల్లెత్రాడు తెగిపోయినటులున్నూ వర్ణింపబడినది. 'అధికం

మేనిరే విష్ణుమ్'. ఇట్లే నాయన్మార్ల గీతములు శివాధిక్యమును చాటుతున్నవి; ఆళ్వార్ల గీతాలు వైష్ణవపరములు. విష్ణ్వాధిక్యమును చాటుతున్నవి.

పరతత్త్వము ఒకటి కదా? ఇందులో శివుడు పరతత్త్వమా? విష్ణువు పరతత్త్వమా? శైవ వైష్ణవులకు ఇందులో సందేహమే ఉండదు. శైవులు శివుడనీ, వైష్ణవులు విష్ణువునీ ఎన్నుకొంటారు. అద్వైతుల విషయమే చిక్కు. సామరస్యపు ఆవశ్యకత వారికే.

ఉన్నది ఒకవస్తువు. ఒక్కవస్తువు రెండు ఎట్లుపోతుంది? శివ విష్ణువుల భేదాలను అటుంచుదాం. విష్ణ్వంశములు, రెండు అవతారములైన రామ, పరశురాముల మాటఏమి? వీరిలో ఎవరు అధికులు? శివధనుర్భంగము చేసినాడని పరశురామునికి రామునిపై కోపంవచ్చినది. క్షాత్రలోకాన్ని భస్మీపటలంచేసిన పరశురాముడు రామునిముందు నిర్వీర్యుడైపోయినాడు. ఈ సంగతి ఏమి?

'ఇవన్నీ భగవల్లీలలు. ఇరువురూ ఒకే పరమాత్మ అంశములు కదా' అని ఒకరన్నారట. వాస్తవమునకు అంతే కదా?

కయ్యాలాడినంతమాత్రాన వీరు వేరుకాదు. ఒకే పరమాత్మ తన మాయాశక్తిచేత వివిధసమయాలలో, ఒక్కొక్క రూపందాల్చి అనుగ్రహించడానికై ఆవిర్భవిస్తున్నది. ఏ అనుగ్రహాన్ని పొందాలని అనుకొంటామో, ఆ అనుగ్రహాన్నిచ్చే మూర్తిని ఆరాధించవలె. అన్నీ ఒక్కటే అన్న అభేదజ్ఞానం

ఎప్పటికినీ విస్మరించరాదు. ఈభేదాలన్నీ కార్యార్థం సత్త్వ రజ స్తమో గుణములని త్రిగుణములు, జాగ్రత్స్వప్న సుషుప్తు లని అవస్థాత్రయము, బ్రహ్మ విష్ణు శివులు అని త్రిమూర్తులు- ఇట్లు అన్నీ మూడుమూడుగా ఉన్నవి. త్రిమూర్తులు త్రిగుణా త్మకులుగా నున్నారు. సత్త్వము తెల్లరంగు పసుపు ఎరుపుల కలపోత రజస్సు. నలుపు లేక చీకటిరంగు తమస్సు. ఒకటి చీకటి, ఒకటి శాంతము, మరొకటి వేగము అనియు చెప్ప వచ్చును. రజస్సు, తెలుపు నలుపు మధ్య ఉన్నస్థితి.

బ్రహ్మ రజోగుణ సంపన్నుడు. ఎరుపు పసుపుల మిశ్రముకల స్వర్ణచ్ఛాయ కల్గినవాడు విష్ణువు సత్త్వగుణము కలవాడు. ఆయన లోకపాలకుడు. శివుడు సంహారకుడు. తామసీ గుణము కలవాడు.

భాగవతము 'శ్రేయాంసి తత్ర ఖలు సత్త్వ తనో ర్నృణాం స్యుః' అని చెప్పుచున్నది.

జగద్రక్షణ, జగదనుగ్రహము సత్త్వగుణము. మనం శ్రేయస్సునకు సత్త్వగుణమూర్తినే ఆరాధించవలెను ఒకే పరమాత్మ మూడువిధములైన గుణములుకల మూడు మూర్తు లుగా ఉన్ననూ సత్త్వగుణముకలవానినే అనుగ్రహార్థము ఆశ్ర యించవలెను. ఏగుణాలు కలవారితో మనం సంపర్కం పెట్టు కొంటామో వారి గుణాలు మనకు తెలియకుండానే మనలో ప్రతిఫలిస్తుంటవి. కోపిష్ఠిని చూస్తే మనకున్నూ కోపమో లేక నిరుత్సాహమో కల్గుతున్నది. కార్యజయమును ఉద్దేశించి నపుడు మనకు ఎవరివల్ల కార్యం కావలెనో వారు శాంతం గానూ సంతోషంగానూ ఉన్నసమయం చూచి మరీ వెడ

తాను. పరమశాంతుడునూ, కోపములేనివాడున్నూ ఐన విష్ణుమూర్తియే కొలవదగిన దైవము—అని విష్ణుసంబంధములైన పురాణా లనుచున్నవి.

స్కాందము శైవసంబంధము. 'మాయ తొలగవలెనన్న కోరిక గలవారికి ఈశ్వరోపాసన అవసరము. పశుపతి పాశమోచకుడు. ఆయన సాత్త్వికుడు. సాత్త్వికుని కొలిస్తే కదా సాత్త్వికగుణం ఏర్పడుతుంది?' అని స్కాందము, సూతసంహితయు చెప్పుచున్నవి. కొన్ని పురాణములు శివుని తమోగుణుడుగను, బ్రహ్మ రజోగుణుడుగను, విష్ణువును సాత్త్వికగుణము కలవాడుగను చెప్పినది.

'శివుని రంగు తెలుపు. ఆయన భస్మోద్ధూళిత గాత్రుడు. ఉన్నచోటు కైలాసము. అదియును తెలుపే. వాహనము తెలుపు. శుద్ధస్ఫటిక సంకాశముగా ఉన్న ఆయనను చూడగనే సాత్త్వికమూర్తియని తేలును. విష్ణువు నలుపు. ఆయన స్థితి సతత నిద్రాస్థితి. ఆయన వర్ణము తమోవర్ణము; గుణము తమోగుణము. అందుచే విష్ణువు తామసి, శివుడు సాత్త్వికుడు.' అని చెప్పుదురు.

కొంచెము యోచించిన శివుని స్వరూపము, స్థితి సత్త్వగుణ సూచకము. చేయుకార్యము మాత్రము సంహారక్రియ, తమోగుణ క్రియ. విష్ణువుయొక్క రూపము, స్థితి తమోగుణ సూచకము. కాని ఆయనచేయు లోకపరిపాలన సాత్త్వికక్రియ. ఇట్లు మాధవ ఉమాధవులలో సత్త్వగుణ మిశ్రమున్నది.

బ్రహ్మనుగూర్చి వాదములేదు. అందరూ ఆయనను రజోగుణుడనియే చెప్పిరి. ఆయనకు గుళ్ళుకాని గోపురములు కాని ఆరాధనకాని లేదు. అందరూ ఆయనను మధ్యస్థముగా వదలివేసిరి. వివాదములన్నీ కౌమారినీ, కంసారినీ గూర్చి.

ఆళ్వార్లలో ఒకరు పెరుమాళ్ళను వర్ణించుచూ 'నీవే మునివి. నీవే బ్రహ్మవు. మూడుకన్నుల తండ్రియూ నీవే' యని సరసమాడెను

పాప పుణ్యముల ననుసరించి ఫలము నిచ్చేవాడు విష్ణువు బ్రహ్మ సృష్టికర్త. శివుడు ప్రళయకారకుడు. చరాచరములను ఆ ప్రళయసమయములో తనలో లీనం చేసుకొంటాడు. ఈ సంహారక్రియ క్రౌర్యమా ? కర్మచక్రంలో చిక్కుకొని, సదా భ్రమణం చేస్తున్న జీవుడికి, అలసిపోయిన బిడ్డను 'నాయనా అలసిపోతివి. నేటికి నీఆట చాలు. కొంచెము నిదురపో' అని ప్రేమతో బుజ్జగించే తండ్రివలె, విరామమిచ్చే ఆ మహానలుని ప్రీతినీ, అనుగ్రహమునూ చూపే ప్రళయ కార్యము తామసిక మెట్లు ఔతుంది ?

నిత్యప్రళయము, మహాప్రళయము, ఆత్యంతిక ప్రళయమని ప్రళయము మూడువిధాలు. పగలంతా విసిగి వేసారి, కష్టాలూ సుఖాలూ అనుభవించి, నానాబాధలు పడిన జీవి, నిద్రలో ఒక ఆనందానుభూతిని ప్రతిదినం అనుభవిస్తున్నాడు. ఇది నిత్యప్రళయము దానిసిచ్చే దాత ఈశ్వరుడు. నిద్ర అన్ని దుఃఖాలను పోగొట్టుతుంది. ఒక ఆనందాన్నిస్తుంది. 'హాయిగా నిద్రించినాను' అని ఉదయం మేల్కొని, ఎంతో ఉత్సాహంగా అంటాము. ఆ నిద్రాసౌఖ్యాన్నిచ్చేది ఈశ్వరుడే.

మహాప్రళయంలో జగత్తు నిశ్శేష మవుతున్నది. మరల బ్రహ్మయొక్క పునఃసృష్టి. ఈ పునఃసృష్టిలో వారివారి కర్మల కనుగుణంగా వారు వారు మరల జన్మనెత్తుతారు.

రెండు మూడు అని వేర్వేరుగా తోచే భేదజ్ఞానాన్ని పోగొట్టి అద్వైతానుభవము లేక మోక్షానందము ఇచ్చునదే ఆత్యంతిక ప్రళయము. ప్రతిరోజున్నూ నిద్రలో సుఖానుభూతి నొందటమూ, ఈశ్వరస్వరూపలీనులమై విశ్రాంతినొందటమూ, అభేదదర్శనంచేస్తూ మోక్షానందాన్ని అనుభవించడమూ ఆ ఈశ్వరుని కరుణవల్లనే. ఈ కార్యాలు తామసంవలె కనిపించినా తండ్రియొక్క విధులను ఆయన నిర్వర్తిస్తేనేకదా మూడు కన్నుల తండ్రియగుట ?

విష్ణువుది యోగనిద్ర. 'నిద్రాముద్రాం నిఖిలజగతీ రక్షణే జాగరూకాం' నిద్రపోతున్నా, ఆయన లోకరక్షణ చేస్తుంటాడు. పాలన, సంహారమూ రెండున్నూ కారుణ్యాన్ని చూపే కార్యాలే. ఇందులో ఎక్కువ తక్కువ లేవీలేవు. అట్లే ఈ మూర్తిద్వయంలోను ఆధిక్యానాధిక్యాలేమీ లేవు. పసిపిల్లలు సహితం ద్రావిడభాషలో 'హరియుం శివనుం ఒంద్రు, అరియాదవర్ వాయిలే మణ్ణు' అని చెప్పుతుంటారు. 'హరి హరు లిద్దరూ ఒక్కటే, అది తెలియనివాని నోట్లో మన్ను' అని ఈసామెతకు అర్థం.

ఒకేతత్త్వము మాయాకార్యంచేత అనేకరూపాలతో మనకు గోచరిస్తున్నది. భేదాన్ని చూడటం మన అజ్ఞానంచేత. పసిబిడ్డకు చెక్కతో చేసిన మామిడిపండు బొమ్మనిస్తే దానిని తినడానికి పోతాడు. వాని అజ్ఞానాన్ని చూచి మనం నవ్వు

కొంటాం. అట్లే నానావికార భాజనమైన ఈ ప్రపంచాన్ని సృష్టించి, కాంతాకనకక్షేత్రాదులను చూపిస్తూ మభ్యపెడుతూ మనలను భగవంతుడు ఆడిస్తున్నాడు. ఇదంతా భ్రాంతి. చీకట్లో చూపుసరిగా అందక త్రాటిని పామని అనుకొంటాం. తరువాత పాము భ్రాంతియని తేలుతుంది. అట్లే వేదాంత శాస్త్రపరనంవల్ల ఇదంతా మిథ్య అన్నజ్ఞానం ఏర్పడుతుంది. వట్టి జ్ఞానంమాత్రం కల్గితే చాలదు. ఈశ్వరుని దయచే అది అనుభవంలోనికి రావలె.

క్రొత్తఊరికి వెళ్ళినపుడు, ఊరివాళ్ళను అడిగి తెలుసు కొన్నా, అపుడపుడు ఏదిక్కు పోయేదీ తెలియక భ్రమపడు తుంటాము. అదే దిగ్భ్రాంతి. అనుభవపూర్వకమైన జ్ఞానాన్ని ఆర్జించినవారికి శివకేశవుల భేదం కనిపించదు. అందుచే ఎక్కువ తక్కువలు కట్టిపెట్టి పరంపరగా కుటుంబంలో కొలిచే దైవతా లని పరదేవతగా నెంచి, తక్కిన దైవాలున్నూ ఆ పరదేవత యొక్క విభిన్నాంశములనే అభేదానుభవంతో అచంచల శాంతితో మనం ఉండవలె.



# లోపల - వెలుపల

నరనారాయణులు తపస్సు చేసికొనుచుండిరి. నారాయణుడు సాక్షాత్ భగవంతుడు. నరుడు ఈశ్వరాంశము. మనుష్యులలో ఉచ్చస్థితి నందినవాడు కనుక అతనికి నరుడని పేరు. ఈ నారాయణుని, నరుని సాక్షాత్ కృష్ణార్జునుల అంశము అని చెప్పుటకూడ కలదు. వారు ఇద్దరూ తపస్సు చేసికొనుచుండిరి.

ఇంద్రుడు దేవలోకాధిపతి. అన్ని పదవులకంటే ఇంద్ర పదవి గొప్పది. ఎవరు తపస్సు చేసిననుసరే, తపస్సిద్ధి అయినచో, వారికి ఇంద్రపదవి లభించును, ఇంద్రుడు పదవీచ్యుతుడగుననెడి అభిప్రాయము అన్ని పురాణములలోను చెప్పబడినది. అందుచే ఎవరు ఎక్కడ తపస్సు చేసిననుసరే అతడు ఎన్నెన్ని అడ్డంకులు కల్పించ వచ్చునో యన్నన్నియు కల్పించును. వీని నంతా సమాళించుకొని ఎవరైనా తపస్సును పూర్తిచేసి సిద్ధినందినయెడల ఆతనికి ఇంద్రపదవి లభ్యమగును. ఆతడు త్రిలోకాలకుకూడ అధిపతి కావచ్చును.

ఇపుడున్నూ ఇంతే. ఎవరయినను 'సాక్రిఫైస్' చేసియుండిన అతనికి పేరుప్రతిష్ఠ లబ్బును. అతని అండలో యొక పార్టీ బయలుదేరును. దాని కతడు అగ్రాసనాధిపతి యగును. అటుతర్వాత పరిపాలనాధికారము అబ్బును. అందరును అతడు

చెప్పినట్లు నడచుకోవలెను. మరియొకడు మరింత 'సాక్రిఫైస్' చేసినచో ఈపదవినుండి మొదటివాడు తొలగింపబడి రెండవ వాడు అగ్రాసనాధిపత్యము వహించును. ఇది భూలోకము లోని స్థితి. ఇటులనే తపస్సుచేసి 'సాక్రిఫైస్' చేసినవానికి ఇంద్రపదవి అబ్బునని పురాణములు వర్ణించును. వారి ఆశ ఈ లోకములో నిలువలేదు. ఇంద్రపదవి వరకు పర్విినది.

ఇట్లు నరనారాయణులు తపస్సు చేయునపుడు ఇంద్రునికి తన రాజ్యాధిపత్యము ఎక్కడ జారిపోవునో యనెడి శంక కల్గెను. అందుచే వారి తపోభంగము కొరకు ఎన్నియో మార్గ ములను వెదకెను. భయపెట్టుట, బెదరించుట, అందకత్తెలను పంపి వారి మనస్సులను కామప్రవృత్తములగునట్లుచేయుట - ఇటు లెన్నియో యత్నములు చేయుట అతనికి వాడుక. తపోవిఘ్నమునకై చేసెడి సాధనలివి.

నరనారాయణుల తపస్సు భంగముచేయు నిమిత్త మాతడు తనయొద్దనున్న అప్సరసలనెల్ల ఆశ్రమవాటికకు పంపెను. మొదట వారు నరునికడకు వచ్చిరి. నరుడు ఈశ్వ రాంశము. జీవుడు అన్నచో ఒక కొరత యుండవలెనుగదా! వీరిని చూచినతోడనే యతడొక హుంకారమును గావించెను. ఆ అప్సరసలు క్రిందమైన చూడక యొకరినొకరు త్రోసికొనుచు ఈ తపోనిధి క్రోధాగ్నికి మనమెచట ఆహుతి అగుదుమోయని భీతిల్లి, ఈవంక కన్నెత్తియైనను చూడరాదని యనుకొనుచూ పరుగిడిపోయిరి. అంతకోపము వచ్చినది నరునికి.

అటుపై కొంత సాధువుగా కనుపించెడి నారాయణుని కడకు వారు వచ్చిరి. నారాయణుడు వీరిని చూచినతోడనే

తన ఊరువును (తొడను) స్ఫాలన మొనరించెను. ఆయన ఊరువులనుండి ఊర్వశి యుద్భవించెను. ఊర్వశి మూర్తీభవించిన సౌందర్యము అప్సరసలు ఆ అందాలరాణిని చూచి ఈమెముందు మనమేమాత్రము అని మోము వంచుకొనిరి.

లోకమందుండెడి ఎట్టి ఆనందమైనను, అందమైనను, కామమైనను అన్నియు మన ఆత్మవస్తువునందే యున్నవి. లోన వెలసెడి దీపించెడి అఖండాకార - సంపూర్ణానందపు శాఖలే బయట గోచరించు అందము. బయట ఒక్కటియును లేదు. ఉన్నదంతయూ లోపలనే. బహిర్వస్తు సందోహమంతయు లోనికివచ్చి చేరవలసినదేయన్న పరమతత్త్వమును నారాయణుడు చూపినంతనే అప్సరసలు మేము ఇంక ఇంద్రుని సభ కన్నెత్తియైనను చూడము. కడుపుకూటికై ఇట్టి పనుల నంతా చేయవలసియున్నది యని అనిరట. ఇట్లువారికి జ్ఞానోపదేశము గావించెనని యొకకథ. నేను చెప్పినదానిలో కొంత కొంత తేడా కనపడవచ్చును. గీతయందు ఈతత్త్వము ననుసరించియే యొక శ్లోకమున్నది.

'ఆపూర్యమాణ మచలప్రతిష్ఠం
సముద్ర మాపః ప్రవిశంతి యద్వత్,
తద్వ త్కామా యం ప్రవిశంతి సర్వే
స శాంతి మాప్నోతి న కామకామీ !

కామమనునది వెలుపలి ఆశ. వెలుపలి వస్తువులచేతనే మనకు ఆనందము, సంతోషము అని - వెలుపల కామమును చూచెడివాడు ఒక్కనాటికీ శాంతిని పొందడు. సతతము బహి

ర్వాస్తి సంచయము కొరకు తాపత్రయము పడెడివానికి శాంతి ఎట్లు వచ్చును? వెలుపల ఎన్నో వస్తువులున్నవి. అవి వచ్చిన రానీ, పోయినచో పోనీ. అవి యన్నియు లోపలి వస్తువుతో గలియవలసినవే. సముద్రమున ప్రతి నిమిషము, వందలకొలది నదులు వచ్చి సంగమించుచున్నవి. ఒకప్పుడు అవి సముద్రము నుండి బయటికి వెళ్ళినవే కదా! దృష్టములగు వస్తువులెల్ల లోపలనున్న ఆనందపు శాఖలే కదా! అది కావలెను, ఇది కావలెను అని వివిధ తృష్ణలతో మనము వస్తువులను తరుము కొనుచూ పోయిన నేమి ప్రయోజనము? అన్నియూ లోపలనే యున్నవి. అని తలచినచో - స శాంతి మాప్నోతి - అతడే శాంతిని పొందును. ఒక పదవియో, ఒక స్త్రీయో, ఒక సంపదయో, ఒక గౌరవమో, ఒక స్తోత్రమో ఇవి వచ్చిననే మనకు ఆనందము, సంతోషము. లేనిచో దుఃఖము, కొంత యని తలచుట శుద్ధ-అవివేకము. వెలుపల వెలసెడి ఆనందము లోన దీపించెడి ఆనందపు లేశమే

'యత్సౌఖ్యాంబుధిలేశలేశత ఇమే
శక్రాదయో నిర్వృతాః'

లోన రాజిల్లెడి ఆనంద పరమాత్మ స్వరూపముయొక్క-సౌఖ్యలేశమే ఇంద్రాదుల ఆనందమూ, సంతోషమూ. బాహిరములగు విషయముల మూలమున కల్గెడు ఆనందము లోనికి వెళ్ళి లయించవలసినదే. అంతస్సుఖానందమున నోలలాడెడి ఈశ్వర సాక్షాత్కార సంపన్నునకు బయట కోరదగిన ఆనందముగాని, సంతోషముగాని ఏమియును ఉండదు. అవి లేనిచో ఆతనికి దుఃఖ మేర్పడదు.

అట్లుగాక బహిర్ముఖముగా ఆనందమును అన్వేషించెడి వాడు, ఆనందకారకములగు వస్తువుల సంయోగమున సంతోషించును వియోగమున దుఃఖించును. అవి లేనిచో ఏదియో కొరతగల్గినదని క్షోభించును. దాని వెనువెంటనే పోవును. ఆహా! చేతి కందకపోయిన దే యని చింతిల్లును. ఈ దుఃఖమునకు కారకుడెవరు? అని యాతనిపై దండెత్తును. కోపపడును. గోలచేయును. ఇవి వానిచర్యలు. వానికి శాంతి యనుమాట ఉండదు.

'న శాంతి మాప్నోతి న కామకామీ'

ఆతడు ఒక్కనాడైనను శాంతిని పొందడు వెలుపలి వస్తువులు వచ్చును, పోవును. వీని నొకడు తన సౌఖ్యమునకు ఆధారముగా జేసికొన్న, వానికి ఎప్పటికినీ ఎడతెగని కొంతయే కాని శాంతి యుండదు. అని గీతలో భగవంతుడు ఒక అధ్యాయపు చివరి శ్లోకమునందు చెప్పి ముగించును.

వెలుపలి కామ్యములు అనేకములు. అవి వచ్చినచో రానీ. నదులు సముద్రములో అనవరతము వచ్చిచేరుచున్నవి. అపారములగు సముద్రజలములతో కలసిపోవుచున్నవి. నదులు వచ్చి సంగమించకపోయిన సముద్రమున కేదైన దుఃఖమా? కొంతయా? దానిస్థితి ఎట్టిది?

"ఆపూర్యమాణ మచలప్రతిష్ఠం
సముద్ర మాపః ప్రవిశంతి యద్వత్"

ఆపూర్యమాణ మనగా అంతటా నిండినది. అచల ప్రతిష్ఠం - కదలక మెదలక యుండునది. అది రాలేదే? ఇది

రాలేదే? ఇంకను నీరు చాలదే యని సముద్రము దుఃఖపడదు. ఇంచుక అయినను చలనము లేనిది సముద్రము. అచలప్రతిష్ఠము.

రామేశ్వరముదగ్గర వుండు సముద్రమును రత్నాకరము, మహోదధియని రెండు భాగములుగా చెప్పుదురు. రత్నాకరమునన్నైన - ఆరు నెలలు అలలు లేచును. మహోదధియందు - అదియును దేవీపట్టణము వంకకు వెళ్ళిచూచిన ఒక పెద్దకొలను రీతిని అలలు లేక యుండును. అటులనే మనముకూడ వెలినుండి వచ్చు విషయజాతములగు ఆనందపునకులను - అట్టులే-ఆత్మానంద మహోదధిలోనికి ముడ్చుకొని 'ఆపూర్యమాణ మచల ప్రతిష్ఠ'ముగా కూరుచుండవలెను. అట్లున్ననే శాంతియని గీతాశ్లోకము చెప్పుచున్నది.

కాశిలో ఆదిశంకరుల యెదుట ఈశ్వరుడు పరీక్షార్థము ఒక చండాలవేషమున వచ్చెనట. శంకరు లా చండాలుని దూరముగా తొలగిపొమ్మని చెప్పిరి. వెంటనే ఆ చండాల వేషధారి ఈ క్రింది శ్లోకమును చదివెనట.

ప్రత్యగ్వస్తుని నిస్తరంగసహజా
నందావబోధాంబుధౌ
విప్రోఽయం శ్వపచోఽయ మిత్యపి మహా
కో యం విభేద గ్రహః,
కిం గంగాంబుని బింబితేంబరమణౌ
చండాలవీధీ పయః
పూరే వాంతర మస్తి కాంచనఘటీ
మృత్కుంభయో ర్వాంబరే.

గీతాశ్లోకమందు సముద్రమని యున్నది. పై శ్లోకమున అంబుధియని ఉన్నారు. అచలప్రతిష్ఠమని గీతలో. ఇందు నిస్తరంగ ఆనందము. నిస్తరంగమహోదధి సయితము అచల ప్రతిష్ఠమే.

సర్వవ్యాపకమగు ఒక అఖండానంద స్వరూపమే లోపల సయితము నిండియున్నది. వెలుపలి వస్తువులన్నియు లోపలి వస్తువులో నైక్యము కావలసిందే. 'అదిలేదు, ఇదిలేదు' అన్న కొరతలతో మనము బాధపడవలసిన అవసరము కనుపించదు. 'నాకీవస్తువు కావలెను' అని అన్నచో అది ఒక కొరతకు చిహ్నము. నిండినవస్తువు లోన నిండియున్నపుడు బయటి వస్తువు లెక్కడి ఆవశ్యకత? వచ్చేది రానీ, పోయేది పోనీ యని ఆ అఖండాకార పరమానంద వస్తువుతో సాక్షాత్కారము కావలసిందే. లోపలి వస్తులేశమే, బయటనున్న విస్తార విషయావళి యన్న జ్ఞాన ముండవలెను. సముద్రమువలె అచంచలముగా నుండవలెను. అట్టివాడే 'సశాంతి మాప్నోతి'- శాంతిని పొందును. అని అర్జునునికి భగవంతుడు ఉపదేశము చేసి- ''అర్జునా! నీకు ఏకాంతయు అక్కరలేదు. నీవు క్షత్రియుడివి. యుద్ధముచేయుట నీధర్మము. 'నాధర్మమును నేను చేయుచున్నాను.' అనెడి మెలకువతో యుద్ధముచేయుము. కొరతలనేవి దాపునకు రానీకుము. వానికి కష్టము కలుగునే, వీనికి కష్టము కలుగునే యనెడి ప్రశంస నీకక్కరలేదు. నీధర్మమేదో నీవు చేసి ముగించు'' అని తన ఉపదేశమును పూర్తి చేసెను.



# గీతోపదేశము

భగవద్గీతలో భగవానుడు అర్జునునకు ఉపదేశము చేసిన సందర్భము లెన్నియో. అట్టియెడ ఎన్నో విషయములను వారు విశదీకరించిరి. 'తస్మాత్ యుధ్యస్వ భారత' అని సహేతుకముగా నాలుగైదు కారణములను పేర్కొని 'అందుచే నీవు యుద్ధముచేయవలెను' అని వ్రాక్కుచ్చిరి. 'యుద్ధము చేయుట నీధర్మము. నీ కర్మను నీవు అవశ్యము నెరవేర్చవలసినదే - కార్యం కర్మ కరోతియః' అని చెప్పిరి.

"యజ్ఞార్థాత్ కర్మణో న్యత్ర లోకో యం కర్మబంధనః,
తదర్థం కర్మ కౌంతేయ ముక్తసంగ స్సమాచర॥"

యజ్ఞార్థము చేసిన కర్మలకంటె ఇతరములగు కర్మలు బంధము కలిగించును. అందుచే నీవు ముక్తసంగుడవై అనాసక్తితో కార్యములను చేసి ఈశ్వరార్పణ చేయుము అని ఉపదేశించిరి. ఎవరికే యే కర్మములు నిర్దేశింపబడినవో వారు వారు వాని నన్నిటిని చేయవలసినదే. 'ధర్మముచేయుట ఎట్లు? ఏది ధర్మము?' అను ప్రశ్న వచ్చినచో—

'తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ'

కార్యాకర్యములు శాస్త్రానుసారము నిర్ణయింపవలెను. నీకు శాస్త్రము ప్రమాణము అని విపులీకరించిరి.

వీనిని చూచిన, మొత్తముమీద గీత "నిర్దిష్టకార్యములను చేయవలెను. క్షత్రియ ధర్మము యుద్ధముచేయుట.

వాడు వాడు వాడి వాడి కర్మలను చేయవలెను.” అన్న విష యమునే ముఖ్యముగా చెప్పినట్లు తోచును. ఈదృష్టితోనే బాలగంగాధరతిలక్ గారు గీతారహస్యమును వ్రాసిరి. వారు చెరసాలలో నున్నపుడు కాలమును వ్యర్థపుచ్చక, భగవద్గీతకు ఎన్నెన్ని భాష్యములు ఉన్నవో వాటినెల్లను శోధించి ఉపని షత్తులు, వేదములు వీటిని క్షుణ్ణముగా పరిశీలించి ‘గీతారహ స్యము అథవా కర్మయోగము’ అను బృహద్గ్రంథము వ్రాసిరి. ఈగ్రంథము తెనుగు, హిందీ మొదలగు ప్రాంతీయభాషలలో సైతము అనూదితము.

‘ఒక్క నిమిషమైనను వ్యర్థపుచ్చకుము. నీధర్మమునకు తగిన కార్యములను నీవు చేయవలెను. నీవు క్షత్రియుడవు. నీవు యుద్ధముచేయుము’ అని చెప్పుటలో వారివారి ధర్మాను సారము వారువారు కార్యములు చేయవలసినదేయని తేలును. ఈచోట భగవంతుడు ఈశ్వరుడు అనుమాటకానీ, ప్రసక్తికానీ కనపడదు. ‘స్వకర్మణా తమభ్యర్చ్య’ కర్మలను చేసి వానికి అర్పింపుము. వాడు అనగా భగవంతుడు, ఈశ్వరుడు అని ఇక్కడ తెలియుచున్నది. ‘యజ్ఞార్థాత్ కర్మణో న్యత్ర’ యని చెప్పిన స్థలములో యజ్ఞము అనిన మహావిష్ణువే యని అర్థము చేసియున్నారు. పరమాత్మయని చెప్పుటయు కలదు. యజ్ఞ మనగా ‘సాక్రిఫైస్’ కర్మనుచేయుము. దానిని ఈశ్వరునికి అర్పణ చేయుము. ఇట్లు చేసినచో నీవు ముక్తసంగుడ వగుదువు.’

వీనినెల్ల చూచిన మనముకూడ తిలక్ గారితో చేరి గీత యావత్తూ ‘కర్మపరము’ అని తీర్మానించవచ్చును. కాని వెనుక భాగములో గీతయందే దీనికి విరుద్ధముగా—

'తూష్ణీం కించి దచింతయేత్' ఏమాటా నీకక్కర లేదు. దేనినిగూర్చి యోచన నీకక్కర లేదు. ముక్కుపట్టుకొనికూర్చుండుము. 'మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమ్' ప్రాణమును శిరసునకు తీసికొని వెళ్లి బ్రహ్మస్వరూపమును ధ్యానము చేయుము. అని భగవానుడు ప్రశంసచేయును.

మరియొకచోట 'యస్సర్వత్ర ... స్థితప్రజ్ఞస్య' అని చెప్పుచూ చిత్తవృత్తి నిలిచినవానికి మాట ఎక్కడిది? జ్ఞాపకమెక్కడ? చూపుఎక్కడ? ఏదియును లేదు సమాధిలోనున్నవానికి కార్యమనునది లేదు. అని సమాధినిగూర్చి ఒక స్తోత్రమును చేసిరి. 'తస్య కార్యం న విద్యతే' 'వానికి కార్యము లే'దని చెప్పుచున్నారు.

''జనమధ్యమున ఉండకుము, ఏకాంతస్థలమునకు వెళ్లు, జనులులేని స్థలమునకు పో; ఎవరితోడను మాట్లాడకు" అని మరొక ఉపదేశము. కాని జనములేనిచోట ఎవరితో యుద్ధము చేయుటము? 'ముక్కుపట్టుకొని ధ్యానమగ్నుడవు అగుము. లే, యుద్ధముచేయుము' అనిన ధ్యానము చేయుడమా, యుద్ధమునకు సన్నాహమగుటయా ?

ఇంకొకచోట 'వాసుదేవః సర్వమితి' ఎటుచూచినను వాసుదేవుడే. ఇట్లు వాసుదేవస్వరూపదర్శనము చేసెడివారు — మహాపురుషులు ఏఒకరిద్దరో — యని వారిని స్తుతించినారు.

ఏకాంతముగా నుండుము. అధికముగా భుజించకుము. ఎక్కువగా తినెడివానికి యోగసిద్ధి లేదు. 'నా త్యశ్నత స్తు యోగః' అందులకొరకై ఒకేమారు ఉపవాసము - నిరశనవ్రత

ముండవద్దు. పట్టి ఉపవాసము యోగము చేయలేము. 'నా త్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాంత మనశ్నతః' - అని ఆహారనియమాదుల గూర్చి ముచ్చటించిరి.

ఇట్లు చూచుచుపోయిన గీతయందు పరస్పరవిరుద్ధముల వలె కన్పడు విషయములు అనేకము కనపడును. ఎన్నో సందేహములు వచ్చును. వీటికి సమాధానములు సహితము గీతయందే కానవచ్చును. ఒక్కచోట భక్తియే గొప్పదని గీత చెప్పును. అప్పుడు తక్కినదానిని రెండవపక్షము చేయుదురు. మరొకచోట జ్ఞానప్రాశస్త్యమును వెల్లడించుచు భక్తి కర్మలు జ్ఞానమునందు అంతర్భాగము అని ఉండును. ఇది చదువువారు వారి వారి మనోభావమునకు అనుకూలముగ అర్థమును తీయుదురు. ఆదిశంకరులు గీతాభాష్యమును వ్రాయునపుడు వీని నంతయు సమరసము గావించి — విరుద్ధమేదియును లేదు. అన్నియు సరియైనవే యని తీర్మానించుటకు వలసినశ్లోకములను అందరు గ్రహించి వ్యాఖ్యానించిరి.

ఉపనిషత్తుల యందును అనేక వాక్యములు ద్వైతాద్వైత, విశిష్టాద్వైత పరములని చెప్పుటకు వీలగునట్లున్నవి. ఒకానొకచోట జీవాత్మ వేరు, పరమాత్మ వేరు, ప్రపంచము వేరు అనియు, అన్నియెడల నిండియుండు పరమాత్మయే సర్వాంతర్యామిగ నున్నాడు అనియును, అన్నియు ఒక్కడే అనియు ఇట్లు అనేకవిషయములు చెప్పబడినవి. ఐనప్పటికీ, ఉపనిషత్తులలో మధ్యమధ్య చెప్పబడిన వాక్యములనుమాత్రము తీసికొని పరస్పరభేదము ఉండునట్లు కనబడు విషయములకు సమన్వయముగూర్చుటకు - అద్వైతప్రకారము పరమాత్మయే

సద్వాత్మకముగా నున్నాడనియు, విశిష్టాద్వైతరీత్యా అతడే అంతర్యామియు, దేహమున ప్రాణమువలె శరీరిగా నున్నాడనియు - తీర్మానముచేయుచున్నారు. ఇట్లు రెండిటికినీ సామరస్యముచేయు వాక్యములను కటకవాక్యములని అందురు. కటకవాక్యములద్వారా ఉపనిషత్తులలో ఒకదానికొకటి సమన్వయములేని విరుద్ధమగు విషయము లేవియును ప్రస్తావింపబడలేదని ఎట్లు తీర్మానించిరో, అట్లే భగవద్గీతయందుగూడ అక్కడక్కడ కొన్నికొన్ని శ్లోకములను గ్రహించి పరస్పర వైరుధ్యమేదియును లేదు అని ఆచార్యులవారు చూపించిరి

'కర్మను చేయుము, కర్మను చేయుము' అని గీతలో వున్నను, మరియొకచోట వివిక్తస్థలమునకు వెళ్ళి ధ్యానము చేయుము అని యున్నను — వీనికి వైరుధ్యమేదియును లేదనుటకు ఈక్రింది శ్లోకమును చెప్పిరి.

'స్వే స్వే కర్మ ణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః'

శాస్త్రము చెప్పిన కర్మలనుచేసి ఈశ్వరార్పణచేయుము. అప్పుడు చిత్తశుద్ధి కల్గును అని చెప్పిరి.

చిత్తశుద్ధియే మోక్షమా? అదే మోక్షమయినచో కర్మను మాత్రము చేసిన చాలును. జన్మ సాఫల్యము బడయ వచ్చును. కర్మతప్ప భక్తి, యోగము, జ్ఞానము ఇవి ఏవియును అక్కరలేదు. మోక్షమును సంపాదించుటయే కదా లక్ష్యము? అయిన - చిత్తశుద్ధి మోక్షముకాదు. అది యొక సాధన మాత్రము.

'స్వకర్మనిరతః సిద్ధిం యథా విందతి తచ్ఛృణు'

స్వకర్మలో నిష్ఠ కల్గినవాడు ఎట్లు పరమాత్మస్వరూప ముతో నైక్యమగు పరిపక్వస్థితిని పొందునో ఆ సంగతిని చెప్పెదను వినుము యని చెప్పుటకు ప్రారంభించిరి.

కర్మలను చేయుటచే కల్గెడి చిత్తశుద్ధి పరమాత్మ స్వరూపముతో సాక్షాత్కారము అగుటకు అనుకూలను కావించుకొను సాధనము. ఈ చిత్తశుద్ధి సాధనముచేతనే తక్కిన స్థితులు కలుగవలెను అని భగవంతుడుపదేశముచేయు నని ఆచార్యులు భాష్యమును వ్రాసిరి.

'కర్మలను చేయుము, కర్మలను చేయుము' అనిన కర్మలను చేయుటచే చిత్తశుద్ధి కలుగును. అనగా మొదట చిత్త శుద్ధి, తర్వాత యోగసిద్ధి, మనోనిగ్రహము అని మెట్టుమెట్టుగా కల్గును. 'అందుచే ధర్మశాస్త్రములు ఏవి విహితకర్మలు అని చెప్పునో వానిని చేయుము. చిత్తశుద్ధి ఏర్పడినపిదప నీకు పర మాత్మ సాక్షాత్కారము లభించును. ఇందు పరస్పర వైరుధ్య మేమియును లేదు' అని ఆదిశంకరులు చూపుచున్నారు.

మొదట ఎవని కేర్పడినకర్మ వాడు చేయవలెను. మనో మాలిన్యమో, ఒకభయమో, ఒక కామమో, యొకదుఃఖమో యున్నదనిన చిత్తశుద్ధివర్పడలేదని యర్థము. దుఃఖము, భ్రాంతి, మాలిన్యము, భయము తొలగిననే భగవానునితో సల్లాపము లాడెడి స్థితి కలుగును. చిత్తశుద్ధి యేర్పడవలెననిన కర్మలను చేసియేతీరవలెను. కామాదులను పోగొట్టుకొనుటకే కార్యము లను చేయవలెను. కార్యములనుచేసి చిత్తశుద్ధినిపొంది ఇంద్రియ ముల గెలిచి అసక్తబుద్ధితో, ఆశలను వదలినపుడు సాక్షాత్ భగవంతునిలో చేరుట కష్టములేనిపని. కర్మలను చేసి—

"సిద్ధిం ప్రాప్తో యదా బ్రహ్మ తదాప్నోతి నిబోధ మే,
సమాసే నైవ కౌంతేయ నిష్ఠా జ్ఞానస్య యా పరా॥"

అందుచే ఆస్థితికి వచ్చిన వారిని జ్ఞానమునకు అవధి యగు బ్రహ్మము నెట్లు పొందుట యను మార్గమును చూపు చున్నారు.

ఇట్లు కర్మలను చేసి, చిత్తశుద్ధిని పొంది, యోగసిద్ధిని అందుకొని జ్ఞానమును ఆశ్రయించవగును. జ్ఞానము కల్గిన వెనుక ఈశ్వర సాక్షాత్కారమే. తాను తక్క మరియొకటి యున్న దనినయెడలనే సంభాషణయో, స్నేహమో, జగడమో. రెండు అనునది కల్ల. ఒకటి యనునది నిజము. అంతయూ ఒక్కటే య నెడు స్థితి కల్గిన పిదప కాదగిన, కోరదగిన కార్యమేది? అన్నిటిని వాసుదేవస్వరూపముగా లక్షించిన, అట్టి జ్ఞానస్థితిని పొందిన వానికి 'తస్య కార్యం న విద్యతే' = ఎట్టి కార్యమును లేదు.

కాని అర్జునుని భూమికనుండి చూచిన అతడు అతనికి ధర్మమగుకార్యములను చేసియేతీరవలెను. అప్పుడే వానికి చిత్త శుద్ధి. ఎవనికో కష్టము దుఃఖము కల్గునని దుఃఖించుచున్నాడే అట్టి దుఃఖము వానికుండదు. ఒక్కొక్క సోపానముగా అత నికి పరమాత్మలో నైక్యమగు స్థితి కల్గును - యని అందంపు శ్లోకములను గ్రహించి ఆచార్యులు ఒకదాని కొకటి విరోధము లేదని వ్రాసిచూపిరి.

ఇదేవిధముగా భక్తిసైతము. చిత్తశుద్ధి తర్వాతనే భక్తి కల్గును. భక్తిచేత నే నెవరు? నిజస్వరూపమేమి? ఇత్యా దులకు ప్రత్యుత్తర మనుభవమగును.

భక్త్యా మా మభిజానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః,
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరమ్॥

భక్తిచేతనే భగవంతుని తెలిసికొనదగును అనిన ఆయనను తెలిసికొనకయే భక్తి ఎట్లు పొందుట? దేవునికి భక్తిని చేయవలెనన్న వానిని తెలుసుకొనియే కావలెను. కానీ భక్తి చేతనే వానిని తెలుసుకొనదగును అని కృష్ణపరమాత్మ అనును. ఇచటకూడా ఒక వైరుధ్యమున్నట్లు తోచును.

భక్తి కలుగుటకు, స్వామిని తెలిసికొనియే భక్తి నలవరచుకొనవలెనను నియమము లేదు. తత్త్వస్వరూపము తెలిసికొనిన పిదపనే భక్తి చేయవలెనని కాదు అర్థము. 'భగవంతుడు ఈ ఆలయము వెలసియున్నాడు. గర్భగృహమునందే యున్నాడు. ఈ శిలయందే ఆయన ప్రతిష్ఠితుడు. ఇచటతప్ప వేరెచటనూ ఆయనలేరు' అని. ప్రప్రథమమున మనకు నమ్మకము, భక్తి కలుగవలెను. స్వామి ఎల్లెడలను కలడు అను నిజతత్త్వ స్వరూపజ్ఞానము మనకు కల్గినపిదప కోవిలలోని స్తంభములకు మనము ప్రసాదము తిని చేతులను పులుముదుమా? మనజ్ఞానము ఈకాలమున 'ఈగుడి స్తంభములలో దేవుడు లేడు. లోనున్న శిలయందు మాత్రము కలడు.' అన్నంతదూరము వచ్చినది. ఆమాత్రము తెలిసినను చాలును. శాస్త్రములలో చెప్పినరీతిని 'ఆయన నీలమేఘశ్యాముడు. పీతాంబరుడు. చతుర్భుజుడు. శంఖ చక్రములను దాల్చియున్నాడు.' అని ఈ రూపమున ధ్యానము ప్రారంభించి గుడికిపోవుట, గుడిలోని పెరుమాళ్ళను దర్శించుట, ఆయనను సేవించుట యనెడి అలవాటు కల్గినపిదప క్రమక్రమముగా భక్తి పెరిగి భగవంతుడు

గుడియుండే కాదు, ఆయన లేని ఎడమే లేదు. అతడు సర్వాత్ముడు, సర్వాంతర్యామిగ నున్నాడను సత్యస్వరూపమును, తత్త్వదర్శనమును క్రమేణ సాధకుడు పొందును.

ఇట్లు పరిణామము క్రమక్రమముగా రావలెను. మొదటి మెట్టులో ఆయన ఖండస్వరూపమును తలచి భక్తి చేయ ప్రారంభించిన ఆ భక్తిచేతనే ఆయన అఖండస్వరూపము సహాతము మనకు దర్శింప వీలగును. ఇట్టి తత్త్వదృష్టి కల్గినపిదప నిరాకార స్వరూపమే సత్యమని తెలిసిపోవును. 'వానికి కాళ్లు లేవు. చేతులు లేవు. చెవులు లేవు. కాళ్లు లేకయే నడచును. చెవులు లేకయే వినును.' అనెడి జ్ఞానము కల్గును కాని మొదటిసోపానమున, ఆరంభస్థితిలో, ధ్యానము చేయు నిమిత్తము ఇట్టి తత్త్వదృష్టి అవసరము లేదు. అఖండస్వరూపిని ధ్యానము చేయుటకు ముందు, ఆయనను ఖండముగనే తలచి ధ్యానింపవలయును. ధ్యానింపగా ధ్యానింపగా, భక్తి ఘనీభవించినకొలది సత్యవస్తువగు అఖండస్వరూపము ఆయనదని అను విషయము తానుగ దెలియును.

అటుతర్వాత తాను వేరు, భగవంతుడు వేరు అనెడు భేదజ్ఞానము నశించి, తానే భగవానుడను నిశ్చయము కల్గును.

'తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరమ్.'

'బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి' బ్రహ్మవిదుడు బ్రహ్మస్వరూపమగును. ఈస్థితి కలుగుటకు పూర్వము దేవునిగూర్చి యొకవిధముగా తెలిసికొనిన చాలును. భక్తిచేయుటకు వీలగును. లేనిచో భక్తియలవడుట కష్టము. మొదట ఖండస్వరూప

ముగ భక్తిచేసి, అఖండస్వరూప దర్శనముచేసిన, ఇది అంతయు తమాషా అని తేలును అయినప్పటికి అఖండస్వరూప దర్శనము నకు మొదటి సోపానము ఖండస్వరూపధ్యానమే. భగవానుని స్వరూపదర్శనము చేసిన పిదప వాడు వేరుగ నుండలేడు. 'విశతే తదనంతరమ్' ఆక్షణమే అతడు భగవంతుడగును.

మంచుగడ్డను మనము రంపపు పొట్టునందు భద్రపరు తుము. మంచుగడ్డ ఒకప్పుడు నీరుగ ఉండినదే కాదాయని దానిని నీటిలో పడవేసిన అది నీరుగ మారిపోవును. అటు తర్వాత మంచుగడ్డ మనకు కావలయునన్నపుడు దొరకదు. అట్లే భగవానుని నిజస్వరూపమును అన్వేషించి తెలిసికొనిన సాధకుడు తానే భగవంతుడని తెలిసికొనును. అటుపై 'నేను నేను' అని చెప్పకొని బయట తిరిగిన వస్తువు మాయమగును. ఇదే రీతిని మరొక దృష్టాంతమునుగూడ చెప్పట వాడుక. మనము ఇది గోదావరి, ఇది కృష్ణ, ఇది కావేరి అని అందుము. ఇవి సముద్రమున కలిసిన పిదప వాని నామములు మాయమై యొకటే సముద్రజల మగును. 'ఆపః సముద్రం యథా ప్రవి శంతి' అని ఉపనిషద్వాక్యము.

ఇట్లు ఒక్కొక్కస్థితికి తగిన కార్యములను ఆయా స్థితిలో చేయవలెననియే గీతాచార్యుల సందేశము. వారు— 'తస్మాత్ యుధ్యస్వ భారత' యని అర్జునునికి ఉపదేశించిరి. అధికారిభేదము ననుసరించి ఆయాస్థితిలో చేసిరనియు ఇందులో నొకదాని కొకటి విరుద్ధము కాదనియు సమన్వయముచేసి శంకరులు భాష్యమును వ్రాసిరి.

# అద్వైత తత్వము

భగవానుడు భారతయుద్ధావసరమున పార్థసారథియై అర్జునుని రథము తోలెను.

అర్జునుడు దయార్ద్రచిత్తుడై శోకగ్రస్తుడుకాగా, భగవానుడు అతనిని ఈవిధముగా మందలించెను.

క్లైబ్యం మాస్మ గమః పార్థ నైతత్ త్వయ్యుపపద్యతే,
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ! పరంతప!

పరంతప = శత్రువులకు తాపమొనగూర్చ శక్తిగల అర్జునా! క్లైబ్యంమాస్మగమః = కాపురుషతనొందకుము. ఈ హృదయ దౌర్బల్యమును వదలి లెమ్ము. యుద్ధము చేయుటకై సిద్ధపడియే వచ్చితివి. ఇపుడు ఓహాటించుట యెందులకు?

యుద్ధము పాపయుక్తము - యుద్ధసన్నద్ధులు నా ఆచార్యులు, పెద్దలు, తమ్ములు, అన్నలు. వీరి నందరిని నేను ఎట్లు చంపుట? కనుక నేను యుద్ధము చేయను అని అతడు దుఃఖముచే వికలుడై రథముమీద కూలబడగా పైవిధముగా శ్రీకృష్ణుడు అతని మందలించెను.

మరియును ఈవిధముగ మరల బోధింపసాగెను. నీవు ఎవరిని భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు అని వ్యవహరింతువో

వారు ఒకరోజు ఉండి మరియొకరోజు చనిపోయెడివారు. శరీరములకు భీష్ముడు, ద్రోణుడు అని పేరు లేదు. ఆత్మ ఖండింపబడదు. 'పావకః ఏనం న దహతి' = అగ్ని దీనిని కాల్పలేదు. 'ఆపః ఏనం న క్లేదయంతి' = నీరు దీనిని తడపలేదు. 'మారుతః న శోషయతి' = గాలి దీనిని శోషింపచేయజాలదు.

అచ్ఛేద్యో౽య మదాహ్యో౽య మక్లేద్యో౽శోష్య ఏవ చ,
నిత్యః సర్వగతః స్థాణు రచలో౽యం సనాతనః॥

దీనిని ఖండింపను, మండింపను, ఎండింపను, తడపను వీలుకాదు. ఇది శాశ్వతమైనది. పాము కుబుసమును వదలు రీతిని ఒక శరీరము వదలిన మరొక శరీరమును పొందవచ్చును. పోవునది దేహమే. ఆత్మ నిత్యము ఆత్మయనునది భీష్ముడు, ద్రోణుడు అని నీవు చెప్పువారి శరీరములందు ఉండి తెలిసికొనెడి చైతన్యమే పోవునది వచ్చునది అనెడిదంతయూ దేహమే. దేహము పోయినచో నేమి? మరొకటి వచ్చును. ఏ దేహస్థితిలో నుండునది ఆనందమే. 'అయం నిత్యః సర్వగతః స్థాణుః అచలః సనాతనః' = ఆతడు నిత్యుడు. సర్వగతుడు = ఏకాలమందును ఉండెడివాడు. స్థాణువు = స్థిరమైనవాడు, అచలుడు = కదలనివాడు, సనాతనుడు. అందుచే ఈ భీష్మ ద్రోణాదులు నీ ఆయుధములచే మరణింతురని తలంచి, చలింపకుము. అని అర్జునునకు జ్ఞానోపదేశమును చేసెను.

అర్జునుడు ప్రశ్నించినదేమి? పూజనీయులగు భీష్మ ద్రోణులను నేను బాణములచే నెట్లు బాధింతును? అన్నలు, బావమరదులు, ఆచార్యులు కదా నాకు ప్రతిపక్షులు? వారిని

చంపి జయమును పొందిన కల్గు లాభమేమి? రాజ్య మొకటే కదా! ఇంతమంది కావలసినవారు చచ్చిపోతేగాని రానిరాజ్యము వస్తేనేమి? పోతేనేమి? గురువులను చంపక బిచ్చమెత్తియైనను పొట్ట పూడ్చుకోవచ్చును. కాని నెత్తురుతో తడిసిన అర్థ కామాదులను ఎట్లని అనుభవించుట? అని అర్జునుడు తన మన సులోని వ్యథను వెళ్ళబుచ్చెను. నెత్తుట దడిసిన అనుదానినే ఆంగ్లమున మనము 'బ్లడ్ స్టెయిన్డ్' అని చెప్పుదుము.

అర్జునుడు దేహాత్మబుద్ధితో వేసిన ప్రశ్నకు భగవా నుడు తగిన ఉత్తరము చెప్పదలచెను. అందుచే ఆయన ఇట్ల నెను - ''తండ్రీ! నీవు ద్రోణుడు భీష్ముడు అనునది వారి దేహ ములనా లేక వారి ఆత్మలనా? శరీరము నాశనము కావచ్చును. పుట్టిన వస్తువు ఏనాడో గిట్టవలసినదే. చెట్టు ఈరోజు మొల కెత్తి, వృద్ధియై, తరువాత జీర్ణించి పడిపోవును. అటులనే శరీ రముకూడ పడిపోవును. లోపలనుండెడి ఆత్మ అవినాశి. దానికి చావు పుట్టుకలు లేవు.

అవినాశి తు తద్విద్ధి యేన సర్వ మిదం తతం,
వినాశ మవ్యయ స్యాస్య న కశ్చిత్ కర్తు మర్హతి॥

ఈ ప్రపంచమంతయు ఏవస్తువుచే పరిపూర్ణమైయున్నదో ఆ వస్తువు నాశనరహితమైనదని తెలిసికొనుము. మార్పులేని వస్తువును నాశనమొనర్చుట యనునది కానిపని. ఏవస్తువుచే లోకమంతయు నిండి వ్యాపీకృతమై యున్నదో ఆవస్తువునకు నాశనము లేదు.

ఏవస్తువు లోకమంతయు నిండియున్నది? అనిన 'సర్వాంతర్యామి యగు వస్తువు ఈశ్వరుడే' యని బదులు చెప్పవలెను. అతడే నాశనము లేనివాడు. నిత్యుడు. జనన మరణ రహితుడు. శరీరమునకు వెలుపల. లోపల నుండునది ఆయనయే. అతడే లోపలినుండి నేను నేను అని తోచెడి అహంభావముతో కూడియున్నవాడు. ఆయన తప్ప వేరగు వస్తువు మరొకటిలేదు. అట్టి సర్వగతమగు వస్తువునకు నాశనములేదు. అందుచే వీరిని నాశనము చేయుచున్నానే యనెడి సంశయ మక్కరలేదు. వీరి ఆత్మ అవినాశి. నశించునది దేహమే. ఆత్మ అందరి శరీరము లందుండు వస్తువే. ఈ భీష్మ ద్రోణుల శరీరమందును కలదు. నీవు చంపునది వారి దేహములను. వారి ఆత్మలను నీవు నాశనము చేయలేవు. ఈతత్త్వమును నీవు తెలిసికో" అని భగవానుడు అర్జునునకు ఉపదేశము గావించెను. ఒక స్విచ్చిని నొక్కిన అన్ని దీపములును వెలుగును. కొన్ని పెద్దవి, కొన్ని చిన్నవి. వీని కన్నిటికి మూలమగు శక్తియొక్కటి. ఒక్క దీపము పగిలిపోయినంతమాత్రమున మూలశక్తి మాయమైనదని చెప్పనగునా? ఇటులే జ్ఞానమయముగా అన్ని ఎడలను అఖండముగా వ్యాపించియున్న శక్తి యొకొక్కరి శరీరమున నుండి బుద్ధిరూపమున ప్రకాశించుచున్నది. మహామతుల యాత్మ మహాత్మగను, అల్పమనస్కుల యాత్మ అల్పాత్మగను అగుచున్నది. అట్టివస్తువు నీచే ఎట్లు చంపబడును? 'నేనుచంపెదను' అని అనుకొనుటకూడ తప్పే. కనుక నీ ధర్మమేదో దానిని నీవు చేయుము.

"దేహినోస్మిన్ యథాదేహే కౌమారం యౌవనం జరా,
తథా దేహాంతరప్రాప్తిః ధీర స్తత్ర న ముహ్యతి॥"

జీవు డొక్కడును ప్రత్యేకముగనే ఉన్నాడు. సర్వ వ్యాపకముగా, ఏక దేహముగా లేకపోయినను వివిధశరీరములలో నుండినను అస్మిన్ దేహే = ఈశరీరములో కౌమారము, యౌవనము, వార్ధక్యము అను ఈమార్పులు కలుగుటలేదా? అటులే దేహాంతరప్రాప్తియును యొకమార్పే. శరీరము నశించునపుడు తాను నశించుట లేదని తెలిసికొనిన జ్ఞానులు దీనిని చూచి భ్రమించుటలేదు.

జాతస్య హి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మ మృతస్య చ,
తస్మా దపరిహార్యే ర్థేన త్వం శోచితు మర్హసి॥"

పుట్టినవాడు గిట్టుట ధ్రువము. అటులనే చచ్చినవానికి పుట్టుకయు నిశ్చయమే. కనుక అపరిహార్యమగు విషయమున - తప్పించుకొన వీలులేని విషయములగూర్చి మన మెందులకు శోకించవలెను? ఏ కారణముననైననేమి, ఎన్నడో ఒకరోజు వీరందరునూ చావవలసినవారే. అందుచే వారికొరకై నీవెందులకు నీధర్మమును పోగొట్టుకొనవలెను. అందుచే నీవు ధర్మచ్యుతుడ వగుదువు ధర్మ్యయుద్ధమునకు మించినది ఏదియును లేదు. 'హతో వా స్వర్గం ప్రాప్స్యసి' = నీవు ఒక వేళ చంపబడినచో వీరస్వర్గ మందెదవు 'జిత్వా వా భోక్ష్యసే మహీమ్' = లేదా జయమొందిన పుడమినేలుదువు. ఎట్లయినను శ్రేయమే. అటు కాక యుద్ధమునుండి విముఖుడవైనచో ధర్మమును వెరవేర్ప

లేక ధైర్యముచాలక పారిపోయినాడు అను అపయశము నిన్ను వెంబడించును.

అకీర్తిం చా పి భూతాని కధయిష్యంతి తే వ్యయాం,
సంభావితస్య చా కీర్తి ర్మరణా దతిరిచ్యతే॥

అదిగాక చిరకాలము జనులందరును నీ అపకీర్తిని ఘోషింతురు. ఎన్నికగలవానికి అపకీర్తి మరణముకంటె దుఃఖ దాయకము. పోనీ అటులు నీవు యుద్ధము చేయక పరుగిడి పోయిన వీరి దేహము లించుకేని శాశ్వతస్థితినందునా? అది ఏమియును లేదు. కనుక దీనినిగూర్చి నీవు చింతించక యుద్ధమునకు సన్నద్ధుడ వగుము. 'తస్మాత్ యుధ్యస్వ భారత' యని ముగించిరి.

భగవానుడు ఒకపుడు అద్వైతసరళిని మాటాడును. మరొకపుడు మీమాంసకులరీతిని చర్చచేయును. ఇట్లు వివిధ విధముల చర్చచేసిన మనము దేనిని గ్రహించుట? ఆయనయే యొక శ్లోకమును చెప్పెను.

యావా నర్థ ఉదపానే సర్వత స్సంప్లుతోదకే,
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః॥

ఈ శ్లోకమునకు అర్థమేమిటియని పరిశీలించిన మన కేవిధమగు అర్థమును మొదట గోచరించదు. ఉదపాన మనగా త్రాగునీరు. త్రాగుటకు నీళ్ళు బావులనుండి, గుంటలనుండి, చెరువులనుండి లభ్యమగును. దీనివలన 'యావాన్'=ఏప్రయోజనము కల్గునో, 'సర్వత స్సంప్లుంతోదకే' = సర్వత్ర నీటి వెల్లువలురాగా, 'తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య

విజానతః' = అటులనే అన్ని వేదములలో మంచి జ్ఞానముకల బ్రాహ్మణునికిని.

ఆదిశంకరులు అవతరించి దిగ్విజయముచేయు కాలమున శాంతము, ఆనందము కలుగచేయు నిజతత్త్వమును అందరికిని ఉపదేశించిరి. వేరువేరు అనెడి వస్తువేదియును లేదు. దుఃఖమునకు కారణము ఇంకొక వస్తువు ఉన్నదను మిథ్యాజ్ఞానముచేతనే. నేను వేరు అదివేరు అని తలచుట అజ్ఞానము - అను అద్వైత తత్త్వమును బోధించిరి. వారి పరంపరనుండి వచ్చిన సదాశివ బ్రహ్మేంద్రులు దీనినే 'సర్వం బ్రహ్మమయ'మ్మని అనిరి. చూచువస్తువు చూడబడువస్తువు రెండును ఒకటేయని శంకరులు దిగ్విజయ మొనర్చిరి. కాశిలో ఉపదేశము చేయుచున్న కాలమున వ్యాసభగవానులే, ముదుసలి వేషమునవచ్చి వీరితో వాదించి వీరికీర్తిని నలుగురికి తెలియునట్లు చేసిరని యొకకథ. ఆచార్యులను శంకరుల అవతారమని చెప్పుదురు. అటులనే వ్యాసాచార్యులు మహావిష్ణు వనియే ప్రతీతి. 'శంకరః శంకరః సాక్షాత్', 'వ్యాసాయ విష్ణురూపాయ'.

శంకరులు విద్యాభ్యాస కాలమున సకల శాస్త్రములను ఎంతసూక్ష్మముగా గ్రహించిరో శంకర దిగ్విజయములో నీక్రింది శ్లోకము తెలుపును.

అస్వాక్షి క్త్యైక్షి తంత్రే
  పరిచితి రతులా కాపిలే కోఽపి లేభే
పీతం పాతం జలాంభ్యః
  పర మపి విదితం భాట్టఘట్టార్థతత్త్వమ్,

యత్రైః సౌఖ్యం తదస్యాం
తరభవ దమలాద్వైతవిద్యాసుఖేస్మిన్
కూపే యో ర్ధః స తీర్థే
సుపయసి పతతే హంత నాంతర్భవేత్ కిమ్?

అన్వీక్షికీ యనునది దండనీతి. రాజ్యపాలనాది విషయములగూర్చి చర్చచేయు శాస్త్రము.

'అన్వీక్షికీ ఐక్షి'=దీనిని ఆయన చూచినంతమాత్రమున తెలిసికొనిరి. లోకమంతయు ఆయనకడ కేగుదెంచి జరిగినది ఆయనకు దండనీతియందలి ప్రావీణ్యమును తెలుపును.

'తంత్రే పరిచితి రతులా కాపిలే క్వాపి లేఖే' = అదే విధముగ సాంఖ్యము మొదలగు శాస్త్రములలోను పరిచయము అతులము. మహాభాష్యమునుగూడ వారు అధికముగ గ్రోలియున్నారు.

'పీతం పాతం జలాంభః' = పతంజలి యోగశాస్త్రము వీరికి మంచినీళ్ళు త్రాగుట వంటిది. (మహాభాష్యము పాతంజలమే. యోగసూత్రములును పాతంజలమే)

'పర మపి విదితం భాట్టఘట్టార్థతత్త్వం'=మీమాంసా శాస్త్రమును ఆకళించిరి. 'యత్రైః సౌఖ్యం తదస్యాంతరభవ దమలాద్వైత విద్యాసుఖేస్మిన్' = చాలరోజులు శ్రమించిన వారికికూడ లభ్యముకాని శాస్త్రజ్ఞానము వీరు సులభముగ పొందిరి. అమలమైనది అద్వైతము. ఇన్ని శాస్త్రములను, తత్త్వములను తెలిసికొనుటవలన కల్గు ఆనందమే అద్వైత

తత్త్వముద్వారా ఏర్పడు ఆనందసాగరమున మగ్నమగుట. 'కూపే యోఽర్థః స తీర్థే సుపయసి విత తే వాంత నాంతర్భవేత్ కిం' = ఒక బావివలన కల్గెడు ప్రయోజనము, కావేరీనదీజలములచే కలగదని చెప్పగలమా? కూపోదకము దప్పిని పోగొట్టును. అమృతసమానమగు సెలయేటినీరును దప్పిక పోగొట్టును. చిన్న బావివల్ల ఏ కార్యములు జరుగునో, దానికంటె అధికతరముగా ప్రవాహజలములవల్లగూడ కలుగుచున్నది. ఆ మహానదిలో ఈ చిన్నవస్తువుల ప్రయోజనమంతయు అణగియున్నది. నదులులేని ఊళ్ళలో బావుల అవసరము మిక్కటము. నదులుప్రవహించెడి స్థలములలో బావులను త్రవ్వెడు నారెవరు? అటులనే సమస్తతత్త్వములవలన కల్గెడి ఆనందము అమలాద్వైతమందు అణగియున్నది.

ఈ శ్లోకమును చదివి గీతాశ్లోకము —

> యావానర్థ ఉదపానే సర్వతః సంప్లుతోదకే,
> తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః॥

చదివిన అర్థము సులభముగా తెలియును.

సాంఖ్యము, యోగము, కర్మానుష్ఠానము మొదలగు వానిచే ఏర్పడు ఫలితములు అన్నియు అద్వైతజ్ఞానముచే ఏర్పడును.

బ్రాహ్మణుడు అనిన వేదమును దెలిసినవాడు. వేదమునకే బ్రహ్మమని పేరు. వేదాధ్యయనము చేసినవానిని సాధారణముగ బ్రాహ్మణు డన్నను, ఉపనిషత్తులరీత్యా సాక్షాత్ బ్రహ్మస్వరూపమును ఎల్లయెడలను దర్శించి అనుభవించు

వానికే బ్రాహ్మణు డని పేరు. అట్టి అఖండ బ్రహ్మాకార వృత్తితో ఉండువానికి వేదముల ప్రయోజనమేమి? ఖండ ఖండములుగా ఇవి అన్నియు నున్నను కడపట ఇవిఅన్నియు బ్రహ్మజ్ఞానములో పోయి చేరవలసినదే.

ఇటులనే శరీరము వచ్చును పోవును. ఆత్మ అవినాశి. అది అచలము, సనాతనము. పుట్టినవస్తువు ఏనాడో ఒకనాడు వెళ్ళవలసినదే. అందుచే నశ్వరములగు భీష్మద్రోణుల శరీరములనే భీష్మద్రోణులనుగా భావించి వారితో యుద్ధము చేయననుట అవివేకము. అందుచే నీవు కలతనొందక నీధర్మమును నిర్వర్తించుము అని భగవానుడు కౌంతేయునికి బోధచేయును.

అంబికాకటాక్షమున మూకకవికిని ఇట్టి జ్ఞానము కల్గెను.

శివ శివ పశ్యంతి సమం శ్రీ కామాక్షీ కటాక్షితాః పురుషాః,
భువనం విపిన మమిత్రం లోష్టంచ యువతిబింబోష్ఠమ్॥

అవి ఆమూకుని నోటినుండి వచ్చెను. 'పండితాః సర్వత్ర సమదర్శినః' = సమ మనిన ఇచట సమత్వము కాదు. ఏకత్వ మని అర్థము. వివిధ రూపములందును ఏకత్వమును దర్శించుట సమదృష్టి కల్గినవానికే సాధ్యము.

సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థిత మీశ్వరం,
న హినస్త్యా త్మనా உత్మానం తతో యాతి పరాం గతిమ్॥

అంతటను సమానముగా వెలయు ఈశ్వరుని చూచుచున్న వ్యక్తి తన్ను తాను హింసించుకొనడు అట్టివాడే సమదృష్టికల్గినవాడు.

చక్కెరచేత పలురకములగు బొమ్మలను తయారు చేయుదురు. అవి వివిధాకారములతో నున్నను అన్నియు చక్కెరతో చేయబడినవే. చక్కెరకు తీపుతక్క వేరేరుచి ఏదికలదు? అటులనే సమస్తవస్తువులలోనూ పరమాత్మను దర్శించువానికి ఆనందముతక్క వేరేది కలదు? సర్వము అనిన పరమాత్మయని అర్థము.

ఈ సమ్యక్ దర్శనము ఈ అంతిమజ్ఞానము రావలయు నన్న అంబికాకటాక్ష ముండవలెను. ఆమెకడ వేరొకటి మనము యాచించకుండా యుండిన. ఈ జ్ఞానమును తానుగ ఆమె మనలకు కటాక్షించును. జ్ఞానాగ్ని సమస్తమాలిన్యమును దగ్ధమొనర్చును. ఏవస్తువును చూచిననుసరే, అందు అవినాశ మగు పరమాత్మరూపదర్శనము గావించువానికి దుఃఖమూ లేదు, వినాశమూ లేదు. అతనిలో అన్నితత్త్వములును అణగి పోవును. ఆ స్థితి శ్రీ కామాక్షీకటాక్షితపురుషునికే కల్గును.



# భక్తి

'అంకోలం నిజబీజసంతతి.... . .'

మనస్సుకు తెలియకుండానే పరమేశ్వరునితో కలియ వలెను. ఒక్కక్షణముకూడా మరపు ఓర్వరాని వ్యాకులత కలుగవలెను. దేవుని మరచితిమా మనకు శాంతిలేదనెడుదృఢ సంకల్పముండవలెను. సూదంటురాతిని అంటిపెట్టుకొను సూది వలె, నాథునియందే మగ్నమగు చిత్తముకల పతివ్రతవలె, సముద్రునితో కలియ నుత్సహించు నదివలె మనిషి చిత్తము ఎందును భ్రమించక సర్వకాల బాంధవుడును, మన అపచార ములనెల్ల దయార్ద్రహృదయుడై క్షమించెడివాడును అగు ఈశ్వరునియందు లగ్నముకావలెను. ఈశ్వరానుగ్రహము తక్క మనకు వేరొండువస్తువు అవసరములేదను భావము ఉద యించిన అపుడే మనకు తెలియకయే భక్తి పుట్టును.

ఒక కారణమున్నచో అది భక్తి యనబడదు. అది బేహారమే. అది ఒక వస్తువునిచ్చి మరొకటి పుచ్చుకొనుట వంటిది. 'నీవు నాకు సంపదనిమ్ము, నేను నీకు భక్తిప్రపత్తులను జేయుదును' అనెడు బేరమే. అట్లుగాక ఏ చింతయును లేక 'ఈశ్వరసాయుజ్యమే మనలక్ష్యము' అని ఎవనికైన ఒక చిత్త

వృత్తియున్న దానినే భక్తియని చెప్పదగును. దీనినే శంకర భగవత్పాదులు శివానందలహరిలో ఇట్లు వివరించిరి.

"అంకోలం నిజబీజసంతతి రయ
స్కాంతోపలం సూచికా
సాధ్వీ నైజవిభుం లతా క్షితిరుహం
సింధు స్సరిద్వల్లభం,
ప్రాప్నోతీహ యథా తథా పశుపతేః
పాదారవిందద్వయం
చేతోవృత్తి రుపేత్య తిష్ఠతి సదా
సా భక్తి రిత్యుచ్యతే॥"

ఊడుగవిత్తు చెట్టునుండి రాలినను మరల మెల్లగా చెట్టువంకకే ప్రాకి బెరడును అంటిపెట్టుకొని అటులనే ఐక్యమగునని చెప్పెదరు ఎట్లు ఊడుగుగింజ వృక్షమునకుపుట్టి మరల వృక్షమునే చేరుచున్నదో అదేవిధమున పరమాత్మనుండి విడివడిన జీవాత్మ మరల పరమాత్మయందే కలసిపోవునట్లు చేసెడిది భక్తి. మరియొక దృష్టాంతము: అగ్నినుండి విస్ఫులింగములు బయలువెడలి ఆ అగ్నియందే ఐక్యమగుట 'యథా సుదీప్తాత్ పావకాత్ విస్ఫులింగాః'

'యథాబ్ధే స్తరంగాః లయం యాంతి భంగాః'

సముద్రమున గుభిల్లుమని యొక అల లేచును. అందుండి నురుగు పుట్టును. మరల నురుగుతోడి ఆ యల సముద్రమున అటులనే కలసిపోవును. ఒకగాలి వీచినతోడనే సముద్రమున పుట్టిన అల, అలనుండి పుట్టిన నురుగు మరల

అటులనే సముద్రములో కలిసిపోయెడి రీతి పరమాత్మనుండి జనించిన జీవాత్మ, ఆచార్యుల సత్కటాక్షమనెడి గాలిచేత పరమాత్మస్వరూపైక్యము నొందును.

నదులదృష్టాంతము అంతయే. నదు లెచ్చటనుండి వచ్చినవి? గోదావరి, కావేరి యని వ్యవహారనామము లున్నను అన్నియు నీళ్ళే. అవియును ఒకప్పుడు సముద్రజలములే. లోకమున సృష్ట్యాదిని ఎంత జలమున్నదో దానిలో అణుమాత్రమైనను తగ్గక ఆదేపరిమాణమున ఇపుడును ఉన్నవికాని మనము వేసవికాలమున నీరు లేదని యందుము వానాకాలమున ఒకటే వెల్లువలు వచ్చినవని అందుము. ఆ స్థిపాస్తులను లెక్క కట్టునపుడు ఆబ్యాంకిలో ఇంత రొక్కమున్నది, ఈభ్యాంకిలో యింత రొక్కమున్నది, తక్కినది కంపెనీ షేర్లరూపములో నున్నది అని అంచనా వేయుదుము. అదేవిధముగా నీరు కూడా ఒకటే. సముద్రమందునో, మేఘములందునో, మంచు రూపముననో, నదులలోనో, చెరువులలోనో ఎందో ఒకయెడ ఉండును. అందు లవలేశమును హెచ్చుతక్కువ లుండవు. ఉన్న దంతయు నామరూప భేదములే. శోణమనగా ఎరుపు కృష్ణ యనగా నలుపు. గంగయనిన తెలుపు. ఇట్లు ఆయా దేశము లందలి మట్టిరంగుననుసరించి నదులకు నామరూపము లేర్పడును.

'రసాంతరా ణ్యేకరసం యథా దివ్యం పయోఽశ్నుతే'

ఒకే సముద్రజలములు వివిధనామములచే తెలియబడు నదులుగామారి, మరల సముద్రమునందే సంగమించి సముద్రమే యగుచున్నవి. జీవాత్మ పరమాత్మ ఐక్యముకూడ ఈవిధమే.

ఆంగ్లమున 'వాటర్ ఫైన్డ్స్ ఇట్స్ లెవెల్' (Water finds it's level) అని చెప్పుదురు. దీని అర్థమేమి? సముద్ర జలములు మేఘములుగా పరిణమించి వర్షించును. గంగోత్పత్తి దాదాపు పదిహేనువేల అడుగులఎత్తున ఆ ఉన్నతప్రదేశము నుండి భాగీరథి మహావేగమున శబ్దముగా క్రిందికి దిగివచ్చును. తన పట్టణమునకు దిగిననేకాని ఆమె ఉద్ధృతి అణిగి శాంతి నొందదు. శాంతి కలుగవలెనన్న 'లెవెల్' కు రావలెను. లెవెల్‌కు మించియుండిన శాంతిలేదు. శబ్దముమాత్రమే. దడ బడలే. అలసటయే. అటులే పరమాత్మనుండి విడివడిన జీవుడు మరల ఐక్యమగునంతవరకు ఈ ఉద్ధృతి, వేగము, అశాంతత, అలసట, తప్పవు.

అటులనే 'అంకోలం నిజబీజసంతతి' దృష్టాంతమును మట్టిలోనుండి వృక్షము పుట్టి మరల మట్టిలోనే కలియును. ఆచార్యులు యిందు ఐదు విధములగు దృష్టాంతములను పేర్కొనిరి. భక్తియనిన, భక్తుని హృదయము వేరొండు ప్రయోజనమును లక్షించక సదా పరమాత్మస్వరూప సాయుజ్య మునకై నిరీక్షించుటయేయని చెప్పుచున్నారు. ఏదైనాకారణ ముండిన భక్తికాదు. ఈశ్వరునియందు అవ్యాజానురాగము తానుగ రావలెను. సకారణముగా నుండునది ప్రేమకాదు. అకారణముగా వచ్చునదియే ప్రేమ. అదియే భక్తి. సర్వమూ పరమాత్మస్వరూపమే. ఆయనతో కలియనంతవరకు శాంత్యా నందములకు కరవే. సదాశివబ్రహ్మేంద్రులు మానసికపూజను వ్రాసిరి. అందొకశ్లోకము: భక్తుడు ఈశ్వరుని పూజకై కూర్చుం డును. అతడనును: "ఈశ్వరా! పూజకై కూరుచున్నానేకాని,

నేను నీకు ఉపచారము చేయుటకు బదులు అపచారముకడా చేయుచున్నాను. నీకెట్లు పూజచేయుట! అది వీలగువనియా?

నీ ఆరాధన ఎట్లు చేయుట? నీవు ఒక్కదిశయందే స్థితుడవై యున్నకదా నీకు నమస్కారము చేయుట? నీవు పృష్ఠమందును, పార్శ్వమందును అన్నియెడలను వెలయుచు సర్వాంతర్యామివై యున్నావు. నేను కాళ్ళనుచూచి నీకెట్లు సాష్టాంగ నమస్కారము చేయుదును? నాకాళ్ళ వెనుక నీవు లేదనిన నీపూర్ణత్వమున కొక కొరత కదా తండ్రీ!

నీచరణములను క్షాళన మొనర్చుటకు పంచపాత్రనుండి ఒక ఉద్ధరిణిలో నీళ్ళు క్రిందపోయుదును. నీవు మూడు లోకములను మూడడుగులతో కొలిచిన త్రివిక్రముడవు కదా? నీపాదముల నణుమాత్రమునైనా ఈనీళ్ళు తడుపునా? పాదములను పూర్తిగా కడుగక వదలుట అపచారము కదా ప్రభూ!!

"భూః పాదౌ యస్య నాభిః" దిగంబరుడవగు నిన్ను ఈ చిన్నవస్త్రముతో నెట్లు కట్టబెట్టుట? నేనేమి పూజచేయుదును? తండ్రీ! నేనేమని ప్రార్థింతును? నామనోవృత్తులన్నియు నీకు చదివిన పుటలు. నీవు సర్వజ్ఞుడవు. ప్రార్థనచేసి నీసర్వజ్ఞతకు నొక లోటును తెచ్చిపెట్టుదునా? ఐనను నిన్ను నీవద్దలేనిదానిను నేను అడుగలేను. క్రొత్తవస్తువు నొక దానిని అడిగిన - నీవు దాతవు, నేను గ్రహీతను అగుదుము. అఖాండానంద స్వరూపుడవు. నీవని శ్రుతులు చెప్పుచున్నవి. ఇట్లు కోరికలతో, కొరతలతో నేను వున్నాను. ఈస్థితిని మాన్పి నాస్వరూపమును నాకిమ్ము. నన్నే నాకిమ్ము" అని ప్రార్థన చేయును.

'నన్నే నాకు ఇమ్ము' అనిన ఏమని అర్థము? నా స్వరూపమే నీవు. నిన్నే నాకిమ్ము' అని యర్థము.

"యాచే నాభినవం తే
చంద్రకలోత్తంస కించిదపి వస్తు
మహ్యం దేహి చ భగవన్
మదీయ మేవ స్వరూప మానందమ్॥"

ఇట్లు మన స్వరూపమునే మనము వదలియున్నపుడు క్షణముకూడా సహించరాని తాపము కలుగవలెను. 'పరమాత్మస్వరూపముతో మనమెప్పుడు కలియుదము?' అను తాపము, చింత మనకు కలుగవలెను. మనము మనముగా నుండవలెనన్న పరమాత్మతో కలిసియుండుటయే. అదియే ఆనందస్వరూపము. పరమగు పరమాత్మస్వరూపము, తక్కిన వన్నియు దేహాత్మస్వరూపములు. భ్రాంతి జనితములు. ఆ పరమగు ఆత్మస్వరూపము, ఆ సత్యవస్తువుతో కలిసియుండుటయే. అలలవలె నురుగువలె వేరొకటి వచ్చిన సహించరాని తాళుకోలేని ప్రేమ మనకు జనించవలెను. ఆసత్యవస్తుదర్శన మెన్నడు! దానితో యోగమెపుడు? అనుచింత సదా ఏర్పడవలెను. దానినే భక్తియని యందురు.



# అపరిగ్రహము.

సత్యమును తెలిసికొనుటయే మనము మనుష్యజన్మ యెత్తినందులకు ప్రయోజనము. సత్యమును తెలిసికొనక, మనము మరణించిన, దేహధారులమై జన్మించిన ప్రయోజనమును మనము పొందలేదని యర్థము.

కొంతకొంత మనము సత్యమును పరిశీలించిన సత్యము ఈశ్వరుడే అని తేలును. సత్యవస్తుజ్ఞానము మనకు చక్కగా నెలకొనినయెడ 'నేను', 'మేము' అనెడి పదములు వాడుక నుండి మాయమగును. సముద్రములో కలసిన నదులెట్లు తమ తమ రూపములనుదొరగి సముద్రజలములగునో అట్లే జీవాత్మ పరమాత్మసంయోగమున ఆ సత్యవస్తువే అగును. అప్పుడు నేను అనెడి అహంకారము తొలగును ఆయువున్నకాలమున, ఈ దేహమును మనము ఆధారముగా చేసికొని, పరమాత్మస్వరూపములో నైక్యమొంద యత్నించవలెను. అప్పుడే మనుష్యత్వ ఫలము. అదియే వేదాంతము. కొన్ని వేళల మనకు అర్థమగును. కొన్ని వేళల అర్థముకాదు. అని మనమున్న స్థితినిబట్టి.

వేదాంతమును ఆకళించుకొనుటకు, జన్మసాఫల్య మందుటకు ప్రధానమైన కార్యము లనేకము లున్నవి. వానినే అష్టాంగయోగమందురు. ఈయోగమునకు ఎనిమిదిఅంగములు



భక్తులు సమర్పించిన తులసి బిల్వమాలలను తలనిడుకొన్న

జగద్గురు శ్రీ శంకరాచార్య స్వామివారు

యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణ, ధ్యానము, సమాధి అనునవి అష్టాంగములు. ఇందలి మొదటిమెట్టు యమము. యమమునకు మరల ఐదు మెట్లు. అందు మొదటిమెట్టును త్రొక్కనివారికి వేదాంతము అర్థముకాదు. అతడు ఆత్మసాక్షాత్కారము, బ్రహ్మసాక్షాత్కారము లనెడు పదములను సైతము అనుటకు వీలుపడదు.

సత్యవస్తుదర్శనమునకై ఉవ్విళ్ళూరు సాధకుడు ఒక్కొక్క మెట్టును ప్రయత్నపూర్వకముగా అధిరోహించవలెను. యమములోని ఐదు విభాగములు - అహింస, సత్యము, అస్తేయము బ్రహ్మచర్యము, అపరిగ్రహము అనునవి. గ్రహము అనగా గ్రహించుట. అపరిగ్రహమనగా గ్రహించకుండుట. మనదేహధారణకు వలసిన వస్తువుకంటె అధికముగా మనము గ్రహించిన అది దొంగతనముతో సమానము. మనకు కావలసిన దానికంటె అధికముగా గ్రహించకుండుటయే అపరిగ్రహము. ఇట్టి నియమమున్ననే సత్యవస్తుదర్శన మబ్బును. భగవానుని అనుగ్రహము కల్గును. మంచి గుణములకు ఎథిక్సు (Ethics) అనిపేరు. క్యారెక్టర్ (Charector), మొరాలిటీ (Morality) వీనిగూర్చి ఇతరమతములు కడుశ్లాఘించి, అవియే అంతిమ ఘట్టములని చెప్పినను, మన శాస్త్రములు వీనిని పరమాత్మసాక్షాత్కారమునకు సాధనమాత్రములే అని చెప్పినవి. ఒక్కొక్క మతమున భక్తియే కడపటిమెట్టు. థియాలజీయే (Theology = సగుణోపాసనయే) కడపటిమెట్టు అని చెప్పి

యుండినను. సత్యాన్వేషణకు, బ్రహ్మ సాక్షాత్కారమునకు అబద్ధములాడగూడదు, దొంగతనము చేయరాదు, అహంభావము గొనరాదు అను అనేక విషయములను సాధనములుగా సాహాయ్యకములుగా గ్రహించవలెనని మన మతశాస్త్రములు చెప్పుచున్నవి.

సుగుణములను పెంపొందింప, ఈశ్వరభక్తి పెరుగుటకు వలసిన ప్రోత్సాహములు ప్రభుత్వము చేయదగును. అప్పుడు ప్రజల మొరాలిటీ చెడిపోయినది. ఈ కలహములను పోలీసు బందోబస్తు ద్వారానే అణచవలెను' అనెడు విషయమేర్పడదు. దానికై ద్రవ్యమును వెచ్చింప నవసరముండదు. అన్నిటినీ వదలి తోకను పట్టుకొన్నట్లు, మనకు స్వాతంత్ర్యమను పదమునకు అర్థము తెలియకముందే స్వాతంత్ర్యము వచ్చినది. ప్రజాప్రభుత్వము మత సంబంధమగు విషయములలో ఉత్సుకతను చూపక – ఈశ్వరుని భక్తి పెరుగుటకు రాజ్యాంగమునకు సంబంధమేమి – యని తలచినచో ఇతర శ్రమలు, వ్యయములు ఎక్కువ యగుచునేయుండును.

ఈశ్వరభక్తి అవశ్యమని చెప్పుటకు కారణము ప్రతియొక్కడు ఆత్మానుభవమును పొంది జననవృత్తి వెదకు పోవలెననియే. బ్రహ్మసాక్షాత్కారమునకు మొదటి సోపానము దమము. దాని యొక విభాగమే అపరిగ్రహము. మనుష్యులు తమ అవసరములకు మించి యొక పూచికపుల్లనయినను వాడరాదు అనుటయే అపరిగ్రహము. అపరిగ్రహము ఆత్మసాక్షాత్కారమునకు సాధనము.

అయినచో మనుష్యుల అవసరములేవి యనెడు ప్రశ్న జనించును. 'ఛాయా తోయం వసన మశనం' - అని పెద్ద లన్నారు. తినుటకు తిండి, త్రాగుటకు నీరు, ఉండుట కొక పైకప్పు, కట్టుకొనుటకు గుడ్డ - ఇవి మానవునికి ముఖ్యావసర ములు. ప్రాణరక్షణకు ఈ నాలుగును పరికరములు. ఇవి యన్నియు భూమినుండి ఉత్పత్తియగును. నీరుఇచ్చునది భూమి. ఇండ్లను కట్టుటకు మన్ను. సున్నము, దారువు, లోహము ఇత్యాదులు భూమినుండి వచ్చినవే. ఇక ఆహారము, ప్రత్తితో నేయబడు వస్త్రములు అన్నియును ఆభూమినుండియే వచ్చును. కడపట మనను కలియునదియు ఆ భూమియందే.

సృష్టిలోనుండి మనకు లభించు ఈవస్తువులను మనము పొదుపుగా వాడుకొనవలెను. మానరక్షణార్థము మనము వస్త్రములను ధరింతుము. ఆప్రయోజనము ప్రత్తితో గట్టిగా నేయబడ్డ నూలుబట్టలతో తీరును. ఆడంబరముగా నుండవలె నని వెలగల మల్లులువలను ధరించిన ఏమిప్రయోజనము? అట్లుచేసిననేగాని ఇతరులు గౌరవముగా చూడరను దురభి ప్రాయముదక్క. అందుచే మనవస్త్రధారణ మానరక్షణకై చేయుచున్నామని చెప్పగలమా?

సాధారణముగా ఒకకుటుంబము ఆడంబరములగు వస్త్ర ములకయి చేసెడు ఖర్చుతో దాదాపు ఐదుకుటుంబములకు కావలసిన సామాన్యవస్త్రములు అందజేయ గలము. తరు వాతది పట్టువస్త్రములు. పట్టువస్త్రములు మనకు పాపమునే అంటగట్టును వీనికొరకై ఎన్ని జీవములకో హింస కలుగుచున్నవి.

అహింస అహింస అని మనము మాంసమును ముట్టుకొనము. కాని మాంసాహారమున ఏఒక్క జీవమునకో హింస. పట్టు బట్టలను ధరించుటచే లక్షలాది జీవహింస కలుగుచున్నది. సాధ్యమగునంతవరకు మనము దాల్చెడి వస్త్రములు హింసతో గూడిన పనులవలన కలుగనటులు చూచుకొనవలెను. మనము తాల్చు వసనములు సాధారణములు ధరించెడివిగను, గట్టివిగను నుండవలెను.

జనుల జీవన సదుపాయమునకై ప్రభుత్వమెన్నియో కట్టుదిట్టములు చేయును. కాని దారిద్ర్యము మాత్రము దిన దినాభివృద్ధి అగుచున్నది. ప్రజల ఆర్థికజీవనమున అభివృద్ధి ఎంతయోయని మురిసిపోవుదురు దానికి చిహ్నము - రెండు మారులు కాఫీత్రాగువారు ఇపుడు నాలుగు పర్యాయములు త్రాగుచుండుట. గుడిసెలలో నుండువారు మేడలలో నుంటుట. రెండు వస్త్రములతో కాలము గడుపువారు ఇరువదివస్త్రము లను సేకరించుట-ఈ అభిప్రాయము తప్పు. మనకు కావలసినవస్తువుల సంఖ్య ఊరక పెంచుకొనుచునే పోయినచో దేశమున దారిద్ర్యమే. మనుష్యులకు మాన ప్రాణ రక్షణార్థము ఏవి అవసరములో అవి ఎల్లర కందుబాటులో నుండవలెను. దానికే దిట్టము లగు చట్టములు అవసరము. అట్టిస్థితి రావలయునన్న వసతు లున్న శ్రీమంతుడునూ-పరమ దరిద్రు డెటులు తనజీవనమును ఉన్నదానితో గడుపుకొనునో - అటులనే గడుపుకొనుటకు ప్రయత్నించవలయును. దరిద్రుడు గుడిసెలలో నుండిన, శ్రీమంతుడు గుడిసెలలో నుండవలెను. ఉదయమున అతడు గంజి త్రావిన ఈతడునూ వెనులుబాటు ఉన్నదని కోరికలను పెంచు

కొనక గంజి త్రాగవలెను. దానినే అపరిగ్రహ మందురు. అపరిగ్రహము లేని దోషముండునంత వరకు ఈశ్వరానుగ్రహము కలుగదు. జన్మసాఫల్యమును కోరువారు అవసరములను మించి ఒక్కింత అయినను పరిగ్రహించగూడదు. కలిగినవారు లేని వారికి సాయముచేయుట యేపుణ్యము. అదియే వారికి మోక్షము నిచ్చును. ఇది తెలియక కలిగినవారు కావలసిన పట్టుబట్టలను పట్టుచీరలను ధరించి తిరిగినచో వీరిని చూచి లేనివారుసైతము అనుకరింప యత్నింతురు. అప్పులపాలగుదురు. పట్టు పుట్టి ముల తరగతి చెడినదే. వజ్రాలనగలు దీనికయి చేసెడుఖర్చు వృధాయే! "కన్యాం కనకసంపన్నాం" అని కన్యాదానమప్పుడు స్వర్ణమిచ్చుట వాడుక బంగారునందు వేసెడి డబ్బు ఒక నాటికయినా ప్రయోజనపడును. కాని వజ్రములకు ఈప్రయో జనము లేదుకదా. ఉపద్రవము పెచ్చు. ఏబది నూరుసంవత్స రముల క్రితము మనపూర్వులు కాఫీ త్రాగుటలేదు. గుడిసెల లోనే వసించిరి. చెవులలో తాటాకులనే తాల్చియుండిరి. రాగి గంజియో, అన్నపుగంజియో త్రాగుచుండిరి బ్రతుకు తెరువులో - ధనికులకును, దరిద్రులకును పెద్ద భేదముండెడిది కాదు.

"ఇక మీదట కాఫీ త్రాగను, పట్టుబట్టలను ధరించను." అను సంకల్పముచేసిన ఇప్పుడు ఒక కుటుంబమునకగు ఖర్చులో ఐదుకుటుంబములు బ్రతుకవచ్చును జీవిత సదుపాయమునకై మన మెంతెంత వస్తువుల సేకరణ చేయుదుమో, అంతంత శాంతి ఏర్పడదు. సౌఖ్యము ఏర్పడదు. దారిద్ర్యమును దుఃఖ మును కల్గును పట్టుబట్టలను, కాఫీని వదలిన అన్నికుటుంబము

లునూ ముందునకు వచ్చును. కుటుంబ సౌఖ్యమేకాదు, పట్టు పుట్టములనుండి వచ్చు పాపము లేకపోయిన మోక్షమునకు శ్రమయే లేకపోవును. అష్టాంగ యోగములలో మొదటి యోగమే అపరిగ్రహము, అహింస అనునవి. ఒక్కప్రాణికిని మనవలన హింస యుండరాదు. డబ్బు ఉన్నది కదా అని అవసరములగు వస్తువులపైన ఖర్చు చేయరాదు. ఆద్రవ్యమును అవసరములగు వస్తువులకే - అభావముతో అలమటించు అభాగ్యులకు అందచేయవచ్చును అట్లుచేసిననే, చేయుటకుప్రయత్న పడిననే శీఘ్రముగా బ్రహ్మసాక్షాత్కార మొందనగును. అష్టాంగ యోగమున మొదటి సోపాన మది. దాని నెక్కక పైకి పోవుట అసంభవము అని విశదమగుటకు దీనిని చెప్పితిని.



# ఏది మోక్షము?

"ఇందిరా లోకమాతా మా క్షీరోదతనయా రమా,
భార్గవీ లోకజననీ క్షీరసాగరకన్యకా॥"

ఒక్కొక్కవస్తువునకు గల పర్యాయపదములను చెప్పిన గ్రంథములను నిఘంటువులనియు, కోశములనియు అందురు. మహాలక్ష్మికి పైనచెప్పిన పేర్లే కాక, ఈ క్రిందిపేర్లునయితము చెప్పబడినవి.

లక్ష్మీః పద్మాలయా పద్మా కమలా శ్రీః హరిప్రియా!

మా యనునదియు లక్ష్మిపేరే. మాధవుడన్న శబ్దము మా యనెడి పదమునకు సంబంధించినది. ఆమెపేర్లలో భార్గవి యనునదియు నొకటి. ఒకపుడు భృగుమహర్షి లక్ష్మిని 'తల్లీ! నీవు నా కొమార్తెగా అవతరించి, నా లాలన పాలనలలో నుండవలె'నని వేడుకొనెనట. ఆమెయు అతని కోర్కెను మన్నించి భార్గవిగ ఆవిర్భవించి మహావిష్ణువుకు కళ్యాణము చేసికొనెనట.

ఇదేవిధముగా రాజరాజేశ్వరి కాత్యాయనమహర్షికి పుట్టినందున కాత్యాయనిపేరు బడసెను. అరవదేశమున గ్రామదేవతలకు కాత్తాయి, పేచ్చాయి, పిడారి యను నామములు కలవు. కాత్యాయనికి వికృతిశబ్దమే కాత్తాయి. భట్టారిక

వికృతి పిడారి. ఆర్యాభట్టారికా యనునవి అంబికనామావళి. పేచ్చాయి యనగా పేచ్చు అయి పేచ్చుశబ్దమునకు అరవ మున పలుకులు, మాటలు అని అర్థము. పేచ్చాయి యనగా పలుకుల తల్లి - సరస్వతి. 'బ్రాహ్మీ తు భారతీ భాషా గీ ర్వాగ్వాణీ సరస్వతీ' యనునది పలుకులతల్లి. చదువులతల్లి - సరస్వతి నామావళి. ఇట్లు పామరజనుల వాక్కులందు సంస్కృతము పురాణతత్త్వమే కానగును.

ఇట్లు కాత్యాయన భృగుమహర్షులు గౌరీలక్ష్ములను పుత్రికలుగా బడసి ఈశ్వరునికే అర్పణముచేసిరి. ఇదే విధముగా ఏదో వేరేకార్యార్థము త్రిమూర్తులు అవతరించినను అనసూయా దేవికి వారిని దత్తాత్రేయునిగా చూచెడి భాగ్యమబ్బినది.

ఏసంబంధమును లేక కృష్ణపరమాత్మను శిశువుగా పెంచెడి భాగ్యము కల్గినది యశోదకే.

మన కందరికిని బిడ్డలనిన ఉత్సాహము, వాత్సల్యము, ప్రేమ. 'లాలించిన బిడ్డలు' 'పూజించిన దేవుడు' అనెడి సామెత ఉండనేయున్నది. బిడ్డలకు బుద్ధి వృద్ధికానంతవరకు కామక్రోధాదులు కలుగవు. వారి కోపము క్షణికము. వారి దుఃఖము క్షణికము. ఒక నిముసమున ఏడుపు, మరొకనిముసమున ఎచటలేని ఆనందము. ఏదియును దీర్ఘముగా నుండదు. కాని మనకు శోక క్రోధములు ప్రారంభించిన యెడల మన ఆయువున్న పర్యంత ముండును. ద్వేషమూ అంతియే. వ్రేళ్లు నాటుకొని మహావృక్ష మగును. శిశువులవలె కామమో, కోపమో, శోకమో నిలువరించియుండక, లోతునకుపోక ఉపరి

తాలముననే వచ్చుచూ పోవుచూ నుండిన అదియే నిజమగు జ్ఞానము. అట్లు ఒకవేళ ఎవరయినను ఉండిన అది అంబికా కటాక్ష చిహ్నము.

"శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్ శరీరవిమోక్షణాత్,
కామక్రోధోద్భవం వేగం స యుక్తస్స సుఖీ నరః॥"

అని గీతాశ్లోకము.

మోక్షమనునది దేహత్యాగానంతరమున ఏదో లోకమునకు వెళ్ళి అనుభవించుట కాదు. అది ఈ లోకమునందే చేతికందిన ఫలమువలె (కరతలామలకముగా) నుండవలెను ఇపుడు మోక్ష మబ్బిననే, చనిపోయిన పిదప మోక్షమబ్బుట. ప్రస్తుతము ఒకచేరోదనముతో, ఒకచేదుఃఖముతో, ఒకచే కష్టముతో జీవితము గడిపి, చచ్చినతర్వాత మోక్షము వచ్చునని ఎదురుచూచిన ప్రయోజనములేదు.

సాధారణముగా మనము స్వల్పకారణమునకు గూడ దుఃఖింతుము. భయపడుదుము. స్వల్పకారణము - కామకారణ మగును. మరికొందరికి మనకు కలుగునట్లు శీఘ్రముగా కామ క్రోధాలు కలుగుటలేదు. వారు "ఏదివచ్చినను సరే! రానీ!" అను ధీమాతో గుండె నిబ్బరముతో ఉందురు. మరి కొంత కామక్రోధాదులు విజృంభించినవారు ఆ ప్రకోపమునకు తాళుకోలేక లొంగిపోవుదురు. కాని జ్ఞానుల మనస్సు ఒక్కింతయైన అలజడిపడదు. కలవరపడదు.

మరణమునకు ముఖ్య కారణములు నాలుగు. అవి : భయము, కోపము, కామము, దుఃఖము. కామక్రోధాదులనే

అరిషడ్వర్గము అని యందురు. వీనిని జయించిన అదియే మోక్షము.

బాల్యమాది కామక్రోధముల నణచినవాడు చిరంజీవి యగును. ఎంతవానవచ్చినను, ఒకచుక్కయైనను నీరు కారని గొడుగును మనము 'వాటర్‌ప్రూఫ్' గొడుగు అని అందుము. మనము సయితము ఆగొడుగువలె కామప్రూఫ్ క్రోధప్రూఫ్ శోకప్రూఫ్ - కావలెను. ఐనచో అదియే ముక్తి. అదియే మోక్షము. అది చనిపోయినతర్వాత దొరకెడి వస్తువుకాదు. ఈ లోకముననే మనకు ఆమనఃస్థితి వచ్చినదాయని పరిశోధించుకొనుచుండవలెను. ఈ లోకమే ఆపరీక్షకు ఒరపిడిరాయి. మనకు శిశుస్వభావము కలుగవలెను. భయదుఃఖములు మన స్సున నాటుకొనిపోనట్లు చూచుకొనవలెను. ఈ పక్వస్థితి మరి కొంత కమియబండినయెడల మనమును సాక్షాత్ దక్షిణా మూర్తివలె ఉండిపోవుదుము.

అమృతుడుగ నుండుటయే మోక్షము అని పురుష సూక్తము చెప్పును. ఏడ్చుచు మనము ప్రాణములను వదలిన అది మరణము. అట్లు దుఃఖించక రోదించక ప్రాణములను వదలుటయే మోక్షము.

దుఃఖము వేరు, బాధ వేరు. దేహమున బాధ యుండ వచ్చును. ఎంత బాధ యున్నను కొందరు మిగుల ధీరతతో భరింతురు. మరికొందరు అమ్మో అమ్మోయని దొంలి దొరలి ఏడ్తురు. బాధారహిత జీవనము మనచేతకాని పని. కాని ఎంత బాధయున్నను, దుఃఖమున్నను బహిర్గతము కానట్లు సహిం చుట మనకు సాధ్యమయినదే. అందుచేతనే శోకించుచు

ప్రాణములను వదలుట మరణమనియు, శోకము లేక ప్రాణములు వదలుట మోక్షమనియు చెప్పుట. అట్టి స్థితికే అమృతమని పేరు. ఆ స్థితిని 'ఇహైవ' ఇచ్చటనే మనము పొందవలెను. దానికి మార్గము మనము శిశువుల సంశత్వమును ఋజుత్వ మును అలవరచుకొనుట యే. శిశువే దైవము కావలెను. మనము దేనితో ఎక్కువ సఖ్యము నుంచుకొందుమో ఆవస్తువే అగుదుము. అందుచేతనే మహాత్ములు దేవిని 'తల్లీ! నాకు నీవు కొమార్తెగా జనించుము' అని వేడుకొనుట.

సాధారణముగా శిశువులే దేవతా స్వరూపులు. అందులో భగవంతుడే శిశువుగా అవతరించినపుడు వారిని లాలించి పాలించిన ధన్యజీవులు శిశుస్వభావులే యగుదురు. వారి మనస్సులకు కామక్రోధాదుల మాలిన్యము అంటదు. అట్టిభాగ్యము భృగుకాత్యాయనుల కబ్బెను.

'బాలోన్మత్త పిశాచవత్' వయసు వచ్చినను మనము బాలురవలె ఉండవలెను. 'నీవు శిశువ వగుచో స్వామి వగు దువు' అని ఉపనిషత్తులు చెప్పును. బిడ్డలకు కోపశోకము లెట్లు దీర్ఘములుగా నుండవో అట్టి స్థితి మనకు అభ్యాసముకొలది రావలెను. ఎట్టికష్టములు వచ్చినను ఓర్మితో సహించి ఆనంద ముగా నుండుటే అమృతత్వమనియు మోక్షమనియు చెప్పుట.

శక్నోతీహైవ య స్సోఢుం ప్రాక్ శరీరవిమోక్షణాత్,
కామ క్రోధోద్భవం వేగం స యుక్త స్స సుఖీ నరః॥

ఇచ్చట ఉన్నపుడే ఎవడు 'శక్నోతి' = సహించునో? 'దేనిని సహించుట?:- కామ క్రోధముల వేగమును.

కామక్రోధాదుల వేగము సహించుట సామాన్యమైనది కాదు. వాని వేగము మనల నట్టే ఈడ్చుకొనిపోవును. వేగముగా వెళ్లెడి రైలుప్రక్క నిలుచుండిన దాని వేగోద్ధతి మనలను సయితము లాగుకొనివెళ్ళును. అటులనే వీని వేగమును కామక్రోధముల నణచవలెనని ఎన్ని ప్రయత్నములు చేసినను, ఎన్ని పర్యాయములు అనుకొన్నను మనకు తెలియకయే దాని వేగము మనలను లాగికొనిపోవును. ఎవడీవేగమును సహించునో అతడే యోగయుక్తుడు. యోగయుక్తాత్ముడు. 'ప్రాక్ శరీర విమోక్షణాత్' = శరీరమును వదులుటకుముందే, 'ఇహైవ' = ఈలోకమునందే, ఈ శరీరమున్నప్పుడే కామ క్రోధప్రకోపమును ఓర్చుకొనవలెను. శిశువులవలె సహజస్థితికి వచ్చెడి పోడిమి అలవాటు కావలెను. కృష్ణభగవానునికి కామమూ ఒకలీల, కోపమూ ఒకలీల. అదేవిధముగా మనమును నేర్వవలెను. మనకు ఆ శిశుభావము కలుగుటకు స్వామిని మనము శిశుభావమున నారాధించవలెను. మన కేభావముపై ఇచ్ఛ పొడమునో ఆ భావమున భగవదారాధనను గూడ సల్పవలెను.

అట్టి మనఃస్థితి వచ్చిన పిదప వైకుంఠముననో కైలాసముననో మనకు లంభించుననుటతప్పు. ఈ లోకమున సుఖమో దుఃఖమో ఏదోయొకటి యుండును. పుణ్యముచేసి వైకుంఠమునకు పోయిన పుణ్యము వ్యయమయినతోడనే ఎవరో ఒకరి శాపమునకు గురియై మరల ఈ లోకమునకు రావలసివచ్చును. ఈ లోకమునందే భగవానుని, అంబికను శిశువుగా భావించి ధ్యానించి కోపము, కామము, దుఃఖములను పోగొట్టుకొనవలెను, దేవిని శిశుభావమున పూజించిన మనకును శిశుభా

వను వచ్చును. అప్పుడే ఆమె సాక్షాత్కరించును. దానికే అమృతమనిపేరు. ఆ స్థితికలుగుటకు ఆమె అనుగ్రహముండవలెను. ఆమె మనకు దేవామృతమును ఒసగును. అని చెప్పుటలోని తాత్పర్యమిదియే మంచిజ్ఞానమే అమృతము. కన్నతల్లులు దేహమునకు పుష్టినొసగెడి పాలనిత్తురు. శ్రీమాత, లోకజనని ఆత్మకు పుష్టినిచ్చెడి జ్ఞానవయస్సును ఇచ్చును.

అంబికను సర్వమంగళ యనియు, లక్ష్మిని మంగళదేవతాయనియు అందురు. పార్వతిగ ఆవిర్భవించిన సమయమున

"సర్వమంగళమాంగళ్యే। శివే! సర్వార్థసాధికే!
శరణ్యే! త్ర్యంబకే! దేవి! నారాయణి! నమో స్తు తే."

అని దేవీమాహాత్మ్యము అంతమున, త్ర్యంబకగా, శివస్వరూపిణిగా చెప్పబడినది. ఆమెయే నారాయణి. సర్వమంగళదేవత యన్నను ఒకటే. ఆమెయే కన్యాకుమారియై మన కామమును, మోహమును, భయ దుఃఖములను నివృత్తిచేసి, మనలను శిశుస్వభావుల జేసి, మరణసమయమున చలించని మనోభావమునిచ్చి సర్వావస్థల నానందముగా నుండునట్లు చేసెడి అమృతమును మనకొసగి సర్వమంగళముగా క్షేమముగా నుండునట్లు అనుగ్రహించును.

ఇది చమత్కారముగా చెప్పినది. శివశక్తుల కభేదము. శక్తిలేనిచో శివుడును లేడు. శివశక్తిచేతనే లోకమున జనననివృత్తి ఏర్పడుచున్నది. మాతాపితలగు శివశక్తుల కటాక్షముచేత కాలజయము కల్గును. అంబికా కటాక్షమున కాలజయము కల్గును. జన్మసాఫల్యము అనిన జన్మనివృత్తియే

# ఆర్ద్రా దర్శనము

మౌళౌ గంగాశశాంకౌ కరచరణతలే
శీతలాంగా భుజంగాః
వామే భాగే దయార్ద్రా హిమగిరిదుహితా
చందనం సర్వగాత్రే,
ఇత్థం శీతం ప్రభూతం తవ కనక సభా
నాథ! సోఢుం క్వ శక్తిః
చిత్తే నిర్వేదతప్తే యది భవతి న తే
నిత్యవాసో మదీయే॥

శివుడు చంద్రమౌళీశ్వరుడు. మరమున నున్న అర్చనా మూర్తియు చంద్రమౌళీశ్వరుడే.

'ఈశ్వరా! నీమౌళిలో - ఏమున్నవి? గంగయు, చంద్రుడును. ఈరెండును చలువచేసెడు వస్తువులే. నీ చేతులకును కాళ్ళకును తొడుగుకొనిన నగలో- అవియు అంటిన జివ్వుమనిపించు చల్లని పాములు. ఇవి చాలవన్నట్లు ఎడమభాగమున మాచల్లని తల్లి, దయచేతనైన తడిసియున్న, మంచుగొండ గారాబుకూతురు - ఆ హైమవతిని తాల్చియున్నావు. ఇంకను ఈశీతలోపచారములు చాలక మార్గశీర్షమాసమున బ్రాహ్మ

ముహూర్తము నాలుగుగంటలనుండి ధారాపాత్రక్రింద బెట్ట వేయుదువు. ఈ చన్నీళ్ళస్నానముతో స్వామికి తృప్తి లేదని కాబోలు నీభక్తులు నీమేన చందన మలందెదరు. చైత్రమాస మయిన చందనమును ధరింపవచ్చును. కాని ఈమార్గశీర్షమున, చిదంబరమున, ఆర్ద్రాదర్శనమని -- నిన్ను ఈ ఉపచారములతో నీభక్తులు నిలువబెట్టుచున్నారు. ఈ ఉపచారములన్నియు అప చారములుగ నున్నవే. పోనీ నీభార్యవలననైన ఏదేని ప్రయో జనమున్నదా యనిన 'ఆమె మంచుకొండకూతురు, దయతో తడిసిపోయినటువంటి చల్లని తల్లి'. అని యొకకవి చమత్కార ముగా శివుని స్తుతించెను

ఆర్ద్రాదర్శనము చిదంబరమున విశేషమైనది. ఆర్ద్ర యనగా బాగుగా తడిసినదని యర్థము. ఆర్ద్రాదర్శనము జటి గెడిరోజు విశేషముగా మంచుకురియును. ఆరోజు పౌర్ణమిగను ఉండును. నక్షత్రము ఆర్ద్ర. చలి! చలి! చలి!

శివునికి ఆర్ద్ర ప్రీతికరమైన, పెరుమాళ్ళకు శ్రవణనక్ష త్రముపై మక్కువ. శ్రవణము, శ్రవణము అని పెరుమాళ్ళకు విశేషించి ఉత్సవములను చేయుదురు. కాని శివుడుమాత్రము ఆర్ద్రాప్రియుడు.

తెనుగువారిపలెనే అరవలు సయితము నక్షత్రములను అశ్వని, భరణి, కృత్తికయని అందురు. 'అరవభాషలో తిరు శబ్దము శ్రేష్ఠవాచకము తిరు అనగా శ్రీ యని అర్థము. కాని ఈ తిరుశబ్దము నక్షత్రములకు చేర్చి తిరుఅశ్వని, తిరుభరణి యని వారును అనుటలేదు. శ్రవణనక్షత్రమునే మళయాళిలు ఓణమని యందురు. కాని అరవమున ఈ శ్రవణనక్షత్రమున

కును, ఆర్ద్రానక్షత్రమునకు మాత్రము శ్రేష్ఠవాచకమగు తిరు శబ్దమునుచేర్చి తిరువాణము, తిరువాదరై అని అనుట వాడుక. ఇట్లు శివ, విష్ణుప్రీతికరములగు ఈ ఆర్ద్రా, శ్రవణములకు మాత్రము శ్రేష్ఠవాచకమును చేర్చుచున్నారు. తక్కినవానికి తిరుశబ్దము లేదు.

చెన్నపట్టణమునకు సమీపమున తిరువాన్మియూర్, తిరువళిక్కేణి, తిరువెట్టియూర్ అనునవి కలవు. ఇవన్నియు తిరుశబ్దయుక్తములు. అరవభాషలో కేణి యనగా కొలను. తిరువల్లిక్కేణిలో ఒక కొలను ఉండెడిదట. అందు అల్లిపూలు పూచెడివట. అందుచే దానికి తిరువల్లిక్కేణి - తిరువల్లికేణి యను పేరు వచ్చినది. మదరాసులోనే తిరువెట్టీశ్వరన్ పేట యని మరొక ప్రదేశ మున్నది. అచట తిరువెట్టీశ్వరుని ఆలయ మున్నది. అర్జునునకు పాశుపత మిచ్చు సందర్భమున కిరాత వేషమున వచ్చిన శివునికిని, తపస్వియగు అర్జునునకును యుద్ధము జరిగి, అర్జునుని వింటిదెబ్బలతిని, ఈశ్వరుడాతని అనుగ్రహించె నని పురాణము. అందుచేత ఇచ్చటి దేవుని తిరువెట్టీశ్వరన్ అని వ్యవహరింతురు. ఇట్లు స్వామి సంబంధముకల పేర్లకు తిరుశబ్దమును చేర్చుట యొక వాడుక. ఇప్పుడు స్వామికి చెప్పి నను చెప్పకపోయినను, ఆసాములకు మాత్రము విరివిగ తిరు శబ్దము వ్యవహారములోనికి వచ్చినది.

దక్షిణాదిన ఒక ఊరు అని అమరినచో, అందొక శివా లయము, ఒక విష్ణ్వాలయము కట్టుట బహుళ ప్రచారములో నున్నది శివుని గుడిలో గర్భగృహమున శివలింగముపైన ఒకధారాపాత్రను వ్రేలాడదీయుదురు. అందుండి శివునితలపైన

సంతతజలధార పడుచునే యుండును. ఉత్తరదేశమునకు వెళ్ళి చూచిన ఈ క్రింది ఆచారము కానవచ్చును. స్నానానంతరము ప్రతియొక్కరును నదినుండియో, గుంటనుండియో యొక చిన్నపాత్రను నీటితో నింపి దానిని శివాలయమునకు తీసికొని వెళ్ళి శివలింగముపై స్వహస్తములతో క్రుమ్మరించిపోవుదురు. దీనికి 'చడానా' యనిపేరు. ఉత్తరదేశమున మరొక విశేషమేమనిన, అంబికాలయము కానీ, రామునికోవెల కానీ, కాళిక గుడికానీ - అది యేకోవెలయైనను సరే - మనవైపు రావిచెట్టు క్రింద నాగలింగ ప్రతిష్ఠలుచేసినరీతిని - ఒక శివలింగమును ప్రతిష్ఠించి యుంతురు. కొన్ని కాళికాలయములలో పండ్రెండు లింగముల (ద్వాదశలింగ) ప్రతిష్ఠ కానవచ్చును. ఈద్వాదశ లింగములను శ్రీ భగవత్పాదులు స్తోత్రము చేసియున్నారు. హిమాలయమునందు కేదారము, సౌరాష్ట్రమందలి సోమనాథము, వారణాసిలోని విశ్వనాథము, గోదావరిలో త్ర్యంబకము.

మహాబలిపురమువలెనే, ఔరంగాబాదు సమీపమున ఎల్లోరా గుహాలున్నవి. అచట కొండనేతొలిచి కోవెలనుకట్టియున్నారు. దీనిని చూచినవారికి మహాబలిపురము పెద్దవింతగ కనుపించదు. తంజావూరు ఆలయప్రాకారమువలె కొండనే మలచి గుడిగా ప్రాకారముగా నిర్మించియుండిరి. దానిని నిర్మించిన శిల్పము అరవదేశమునుండియే వెళ్ళెనట.

అతడు ఎల్లోరా నిర్మాణార్థము ఏ పల్లవ చోళుల కాలముననో వెళ్ళియుండవలయును. ఆలయమున అతడొక సంస్కృత శ్లోకమును చెక్కియున్నాడు. దానిభావము.

"ఈకోవెలను నేను నిర్మించినపిదప చూడగా దీనిని నేనా నిర్మించితిని? అని ఆశ్చర్యము కలుగుచున్నది. ఇట్టి ఆలయమును ఎన్ని జన్మలెత్తినను నేనుకూడా నిర్మింపజాలను. నాలోనుండి ఎవరు దీనిని నిర్మించిరో నాకు అవగతమగుటలేదు. ఇట్టి ఆలయము ఇంతకుపూర్వము కట్టినదిలేదు. ఇక కట్టబోరు కూడా. మరల కట్టుమన్న నేనుసైతము ఈ కార్యమును జేయ నశక్తుడను" అని. ఆ ఎల్లోరాలోనే నాగేశము, భీమేశ్వరము, నర్మదానదీతీరములోని నగరము, బాణలింగము, మహారాష్ట్రమున నున్న ఒంకారము, శ్రీశైలము, రామేశ్వరము – ఇట్లు పన్నెండు క్షేత్రములలోని లింగములు శ్రీ శంకరాచార్యులచే స్తుతింపబడినవి. నాలుగుపాదములతోడి మూడు శ్లోకములలో

"సౌరాష్ట్రే సోమనాథం చ శ్రీశైలే మల్లికార్జునమ్
ఉజ్జయిన్యాం మహాకాల మోంకార మమలేశ్వరే
పరల్యాం వైద్యనాథం చ డాకిన్యాం భీమశంకరమ్
సేతుమధ్యేతు రామేశం నాగేశం దారుకావనే
వారాణస్యాం తు విశ్వేశం త్ర్యంబకం గౌతమీతటే
హిమాలయే తు కేదారం ఘుసృ(గిష)ణేశం శివాలయే॥"

ద్వాదశ జ్యోతిర్లింగములగూర్చి ఆచార్యులు వ్రాసిరి. ఒక్కొక్క క్షేత్రమునను వేర్వేరుగా శ్లోకములు వ్రాసియున్నారు. పల్లవులకాలమున కట్టిన కాంచీనగర దేవాలయమున తాపిన ద్వాదశలింగములను జూడవచ్చును. మనప్రాంతములలో మరెక్కడను ఆవిధముగా లేదు.

శివునిగుడి యనిన నభిషేకమే; శివుని శీర్షమున సంతత జలధారయే. లోకమంతయు మంచుతో తెప్పలదేలుచున్నను శివాలయమున శివునికి మాత్రము అభిషేకముతప్పదు. ఆర్ద్రాదర్శనముచేయు సందర్భమున ముందుచెప్పినశ్లోకము నొక కవి చెప్పెను:-

'ఇత్థం శీతం ప్రభూతం తవ
కనకసభానాథ సోఢుం క్వ శక్తిః.'

ప్రభూతమనగా అధికము. అపరకార్యములను చేయునపుడు, అన్నమును ఎక్కువగావండి చేయు కర్మకు ప్రభూతబలియని వాడుక.

అధికమైన ప్రభూతమైన శీతలమును సోఢుం=సహించుటకు, కనకసభానాధుడ వగు ఈశ్వరా! తవ=నీకు, క్వ శక్తిః= శక్తి యేది?

"ఇంతటి శైత్యమును మరొకడు సహింపజాలడే? శిరసున గంగను చంద్రుని కలిగి, అంగమున శీతలాంగములగు భుజంగములను దాల్చి, వామాంకమున హిమగిరితనయనుంచుకొని ఈప్రభూతశీతలమును ఎట్లయ్యా నీవు సహించుచున్నా" వని కవి ప్రశ్నించును.

ఈప్రశ్నకు స్వామి ఏమి బదులిడును? నిరుత్తరుడై ఆనందమూర్తియై నర్తననిమగ్నుడై యుండును. ఆ నృత్యదర్శనము క్షణమాత్రము చేసిన కవికి బదులు దొరకినది.

"సరి దీనికై నిన్ను ప్రశ్నించడ మెందుకు? నీ శైత్యసహనమునకు మూలకారణము నావద్దనేయున్నది. నీవెక్క

డనూ వెలసిన ప్రభువవు. నీవులేని చోటు లేదందురు. ఎవరో స్వామి యున్నచోటు చూపుమని అడుగగా అతడు స్వామి లేనిచోటు చూపు, అటుపై నీకు నేను స్వామియున్నచోటు చూపెదనని అనెనట. అట్లు సర్వాంతర్యామివై యున్నావు. నీవు నాహృదయమందునూ కలవు. అందొకక్షణముండిన చాలును. ఎట్టిశైత్యమును పరారుకావలసినదే. నాహృదయ మంతటి నిర్వేదతప్తము. తాపములకు నెలవు. దుఃఖములకు ఆలయము. బహుజన్మలను చూచిన నేను అనాదిని. నీవును అనాదివే. నాచిత్తముననున్నచో ఎంత శైత్యమైనను ఓర్చు కొనగలవు'' యని బహుసుందరముగ కవి చమత్కరించును.

జీవుల హృదయ తాపములను బాపెడుశక్తి యొక పరమేశ్వరునకే కలదు. మన హృదయ తాపములను పోకార్ప మనము ఆయనను చల్లని ప్రభువుగభావించి శైత్యోపచారము లను చేయవలెను. ఆయన హృదయస్థుడగుచో సర్వతాప నివృత్తియగును. తాపాధికములుగల మన హృదయముల నాయన వసించుటకు ఆయనకు శైత్యోపచారములు మనము చేయుటయే ఆర్ద్రాదర్శన తత్త్వమని ఈశ్లోకమునుండి మనకు తెలియుచున్నది.

మార్గశీర్ష మాసమున మనము పూజలు చేసిననుసరే, చేయకపోయిననుసరే తెల్లవారుజామున నిదురబోకుండా శివ పూజ చేయుటయేని చూడవలెను. ఉషఃకాలమున కొందరు భజనలను చేయుదురు. చొక్కాలను దొడుగుకొని, మఫ్లరు లను తలకు చుట్టుకొని, సాలువలు కప్పుకొని, భజనగోష్ఠిలో

కలసికొందురు. ఇవన్నియు అనవసరవిషయములు. కష్టకొన్ని కొలది చలి అధికమగుచునే యుండును. దుప్పటులను అవత లకు తీసిపారవేసిన చలియు మనలను వదలి మరొకరిని వెదకి కొనును. మన కందరకును చలి వదలవలయును.

వణకుచూ మాట్లాడెదవేమయ్యా యని ఎవరయినా ప్రశ్నించిన ఆ వణకెడు మనిషి భయంతో మాట్లాడుతున్నా డని అర్థము. భయవిదారకుడు ఈశ్వరుడు. ఆ చల్లనిప్రభువు వేదనాతప్తములగు హృదయముల నొకక్షణము ధ్యానించి నచో చాలును, మనవేదనలన్నీ తొలగి హృదయము చల్ల బడును.

మౌళౌ గంగాశశాంకౌ కరచరణతలే
శీతలాంగా భుజంగాః
వామే భాగే దయార్ద్రా హిమగిరిదుహితా
చందనం సర్వగాత్రే
ఇత్థం శీతం ప్రభూతం కనకసభా
నాథ సోఢుం క్వ శక్తిః
చిత్తే నిర్వేదతప్తే యది భవతి న తే
నిత్యవాసో మదీయే॥



# శ్లోకారములు

పుట 1 'వాగర్థా వివ'

యౌ = ఎవరు, వాగర్థావివ = శబ్దార్థములవలె, సంపృక్తౌ = (సంపర్క) కలసియుండిరో, జగతః = జగతికి, పితరౌ=తలిదండ్రులో. తౌ=ఆ, పార్వతీ పరమేశ్వరౌ= పార్వతిని పరమేశ్వరుని, వాగర్థ ప్రతిపత్తయే = శబ్దార్థములను సరిగా ఎరుగుటకు, వందే = నమస్కరించుచున్నాను.

,, 'మాతా చ పార్వతీదేవీ'

పార్వతీదేవీ = పార్వతి, మాతా చ = తల్లియు, మహేశ్వరః దేవః= పరమేశ్వరుడు, పితా (చ)= తండ్రియు, శివభక్తాః = శివభక్తులు, బాంధవాః చ = బంధువులున్నూ, భువనత్రయమ్=ముల్లోకములు, స్వదేశశ్చ= నా దేశమున్నూ.

గాథ

... ... ...

... ... ...

తల్లి శ్రీమహాలక్ష్మి తండ్రి వాసుదేవుఁడు
ఇల్లు మాకు బ్రహ్మాండ మింతా నిదె
బల్లిదపు హరిభక్తి పాఁడిఁబంటా నాకు
వొల్లము కర్మఫలము లొకటి నేను.

— అన్నమయ్య, వాల్యం. 8-63 సంకీర్తన.

పుట14 ' యద్యపి '

శ్రుతి శిఖర గిరాం = ఉపనిషద్వాక్యములకు, అద్వైత వాద ఏవ = అద్వైతమును చెప్పుటయందే, యద్యపి నిష్ఠా=నిక్కపు తలఁపే ( ఈ 'యద్యపి' కి పై శ్లోకము నందలి 'తథాపి'తో సంబంధము ) సర్వైః పురాణైః సాకమ్ = అన్నియునగు పురాణములతోడను, స్మృతి నికర మహాభారతాది ప్రబంధైః సాకం = ఎల్లస్మృతు లతోడను, మహాభారతాదులతోడను; ఆగమానా మపిచ = ఆగమములకును, నిష్ఠా = నిక్కమైన అభిప్రాయము, విమృశతాం=ఆలోచించి చూచువారికి, బ్రహ్మ సూత్రాణ్యపి= శారీరక మీమాంసాసూత్రములున్నూ, తత్రైవ=ఆ యద్వైతమునందే, భ్రాంతి విశ్రాంతిమంతి = భ్రాంతి విరామము కలవి అనగా జీవజగద్భ్రాంతిని బాపి అద్వైతమందే తాత్పర్యము చెప్పునవి, ప్రత్నైః = తొల్లిటి, శంకరాద్యైః = శంకరుఁడు మొదలగు, ఆచార్యరత్నైః=రత్నములవంటి ఆచార్యులచే, తదేవ = ఆ యద్వైతమే, పరిజగృహే = పరిగ్రహింపఁబడెను.

పుట15 ' తథాప్యనుగ్రహో '

తథాపి=అటులు అయినప్పటికీ, తరుణేందు శిఖామణేః = (బాలచంద్రుఁడే సిగలో మణిగాఁగల) శివునియొక్క, అనుగ్రహాదేవ=అనుగ్రహము వలననే, పుంసాం=పురుషులకు, అద్వైతవాసనా = అద్వైత సంస్కారము, జాయతే = కలుగుచున్నది.

పుట18 'యత్కరోషి'

కౌంతేయ = అర్జునా! యత్ = దేనిని, కరోషి = చేయుచున్నావో, యత్ = దేనిని, అశ్నాసి = తినుచున్నావో, యత్ = దేనిని, జుహోషి = వ్రేల్చుచున్నావో, యత్=దేనిని, దదాసి=ఇచ్చుచున్నావో, (అన్నము ధనము మొ.) యత్ = దేనినిగూర్చి, తపస్యసి = తపస్సు చేయుచున్నావో, తత్=దానిని, మదర్పణమ్ కురుష్వ = నాకు సమర్పించునది. (స్వభావవశమున నడతుము తిందుము. శాస్త్రవశమున హోమదానాదికములను చేయుదుము. నిత్యనైమిత్తికముల నొనరింతుము. అన్యనిమిత్తముగ లౌకిక వైదికకర్మలను చేయుదుము. తెలియకయో పొరపడియో చేసిన పాపములు పోవుటకు చాంద్రాయణాది వ్రతములను చేయుదుము. మనస్సు తన యిచ్చవొచ్చిన తిరుగాడకుండుటకు సంయమము చేయుదుము. వీని నన్నిటిని నా కర్పింపుము. అని మధుసూదన సరస్వతి.)

పుట20 'షట్కర్మాణి'

దినేదినే = ప్రతిదినమునందును, షట్=ఆరు, కర్మాణి= కర్మలు.

పుట21 'సంతాపఘ్నమ్'

త్రిదశ పరిషత్=దేవతా సమాజము, సకల జగతాం= అన్ని లోకములయు, సంతాపఘ్నం = తాపమును (ఎండ-త్రితాప) పోగొట్టు నట్టియు, శార్ఙ్గ చాపాభి

రామమ్=శార్ఙ్గమను ఇంద్రధనుస్సుచే సొగసు చిందు నట్టియు, లక్ష్మి...లసితం = లక్ష్మి అను మెఱుపుచే ప్రకాశించుచున్నట్టియు. అతసీ...కాయం = నల్లగిసె పూగుత్తితో సాటియగు మేనుకలట్టియు, ముని...ణ్యం =మునిజనుల మనస్సులను చాతకములకు శరణమొసగ జాలునట్టియు, వైకుంఠాఖ్యం=వైకుంఠుడు అను పేరు కలట్టియు, కారుణ్యాపమ్ = దయ అను నీరు కల, కాలమేఘం = నల్లని మబ్బును (నల్లనయ్యను), దదర్శ= చూచెను. (కారుమబ్బు తాపమును పోగొట్టును. నల్ల నయ్య తాపత్రయమును పోగొట్టును. ఈ మొద॥ ఊహించునది.)నల్లమబ్బులలో ఇంద్రధనుస్సు ఉండును, ఈమబ్బులో శార్ఙ్గము, మబ్బులో మెఱుపు, ఈ మబ్బులో లక్ష్మి, మబ్బులకు అగిసెపూల రంగు; ఈ మబ్బుకును అదిగనే, నల్లమబ్బుచాతకములకుశరణ్యము, ఈమబ్బు మునిజనమనస్సులకు శరణ్యము, నల్లమబ్బులో నీరుండును, ఈమబ్బులో కరుణ ఈరీతిగా నల్లనయ్యయే నల్లమబ్బుగా ఉన్నాడు.

పుట23 'క్షీరాంభోధేః'

దేహాభాసాం = శరీరము (యొక్క) కాంతులయొక్క, ప్రరోహైః = మొలకలచే, క్షీరాంభోధేః=పాలసము ద్రముయొక్క, జఠరం అభితః = ఉదరమునకు క్రిందను మీఁదను, మరి అంతటనూ; కాల......అద్వైతమ్ = చంద్రోదయ కాలమునందు విచ్చిన నల్ల కలువ రేకు

లతో అభేదమును, ఆపాదయంతమ్=ఒనగూర్చుచున్న ట్టియు, క్షౌమగారే=పట్టు సెల్లావలె తెల్లనైన, భుజగ శయనే=చిలువ పానుపుమీద, నిఖిల...రక్షణే = ఎల్ల లోకములను రక్షించుటయెడ, జాగరూకామ్ = మెల కువగానున్న, కామపి నిద్రాముద్రామ్=యోగనిద్రను, ఆతన్వానమ్=పొందుచున్న (నల్లనయ్యను చూచెను.)

పుట24 'ప్రహ్లాదస్య'

ప్రహ్లాదస్య = ప్రహ్లాదునియొక్క, అమితమ్ = మితి మించిన, వ్యసనమ్ = విపత్తును, దైత్య-స్య = అసుర గణముయొక్క, దంభం = మాయాడంబరమును, స్తంభమ్ = ఇనుప కంబమును, రిపోః = పగతు డగు హిరణ్యకశిపునియొక్క, వక్షః...అసి = వక్షఃస్థలమును గూడా, యోగపద్యేన=ఒకపరిగనే, భేత్తుమ్=భిన్నము చేయుటకు, పురుషవపుషా=నరశరీరముతో, మిశ్రితే= కలిసినది గనుకనే, విశ్వదృష్టే = అందరచే చూడబడిన దియు, దంష్ట్రా...వనే=కోరల కాంతులచే విశదమగు (కడుపులోని) లోకములు కలదియు నగు, సింహవేషే= సింహవేషమునందు, రంహసా = వడిగా, బద్ధశ్రద్ధమ్= శ్రద్ధవహించిన అనగా అతివడితో నరసింహరూప ముతో ఆవిర్భవించిన (నల్లనయ్యను చూచెను.)

పుట28 'అద్య ధారా నిరాధారా'

అద్య = ఇపుడు, భోజరాజే=భోజమహారాజు, దివమ్= స్వర్గమును, గతే (సతి) = పొందగా, ధారా=ధారా

నగరము, నిరాధారా = ఆధారము లేని దాయెను, సరస్వతీ = వాణి, నిరాలంబా = పట్టుగొమ్మ లేని దాయెను, సర్వే పండితాః = పండితులందరూ, ఖండితాః = చెల్లాచెదరై పోయిరి

పుట28 'అద్య ధారా సదాధారా'

భోజరాజే = భోజమహారాజు, అద్య=ఇపుడు, భువం= భూమిని, గతే (సతి) = పొందగా, మరల బ్రతుకగా; ధారా = ధారానగరము, సత్ ఆధారా = ఆధారము కలది (ఆయెను), సరస్వతీ = వాణి, సదాలంబా=ఆలంబము కలది (ఆయెను), సర్వే పండితాః = పండితులందరునూ, మండితాః=మునుపున్న చందముగా ఉండిరి.

పుట29 'నారాయణాయ'

నారాయణాయ=పరమాత్మయు, నలిన...య = తెల్ల దామరలవలె వెడదలగు కనులు గలట్టియు, నామా...య=పేరికిమాత్రము మిగిల్చిన బలిచక్రవర్తియొక్క మహావిభవము గలట్టియు. నానా...య = పలు తెగల చరాచరములనుసృజించు బ్రహ్మకు జన్మస్థానమైన బొడ్డు తమ్మిమొగ్గగల, పరస్మై పురుషాయ = పురుషోత్తమునకు, నమః = నమస్కారము, జోత.

పుట30 'ధనుః పౌష్పమ్'

హిమగిరిసుతే = మంచుకొండ పట్టివగు నో యమ్మా! (యస్య=ఎవనియొక్క), ధనుః = విల్లు, పౌష్పమ్ = పూలచే చేయబడినదో, మౌర్వీ = నారి, మధుకర

మయీః = నీమొదమయమో, విశిఖాః = అమ్ములు, పంచ=ఐదో, సామంతః=ప్రెగడ, వసంతః=ఆమనియో, ఆయోధన రథః = కయ్యపుతేరు, మలయమరుత్ = మలయమారుతమో, తథాపి = అటులయినను, (సః= అట్టి) అనంగః = మన్మథుడు, ఏకః=ఒకడే (అసహాయ శూరుడు అని తా॥) తే=నీయొక్క, కామపి కృపామ్= అనిర్వచనీయమైన దయను, లబ్ధ్వా = పొంది, సర్వ మిదం జగత్ = ఈజగతినెల్ల, విజయతే = జయించు చున్నాడు.

పుట34 'పుండ్రేక్షు'

పుండ్రేక్షు=నామాలచెరకున్నూ, పాశ=పాశమున్నూ, అంకుశ = అంకుశమున్నూ, పుష్పబాణ=పూవుటమ్ము లున్నూ, హస్తే! = చేతగల, జగదేకమాతః = ప్రపం చానికి అంతటికీన్నీ ఓ ఏక-తల్లీ!, తే = నీకు, నమః = నమస్కారము.

,, 'మనోరూప....'

మనోరూప = మనస్సు అనే చెరకువిల్లు కలది, పంచ... యకా = తన్మాత్రలనే అమ్ములు కలది. (చెరకువిల్లు సమిష్టి మనస్సు. తన్మాత్రలు విషయములు.)

పుట37 'అవిఘ్నమ్'

దేవ=ఓ వినాయకుడా! సర్వకార్యేషు=పనులన్నిటను, సర్వదా = ఎల్లపుడును, మే=నాకు, అవిఘ్నంకురు= విఘ్నము లేకుండ జేయుము.

పుట38 'అగజానన'

భక్తానాం=తన్ను గొలుచువారికి, అనేకదం=అన్నియు ఒసగువాడును, ఏకదంతం = ఒంటికొమ్ము వాడును, అగజా...ర్కం=పార్వతి మోముదమ్మికి సూర్యుడును అగు, తం = ఆ, గజాననమ్ = ఏనికమోము సామిని, ఉపాస్మహే = తలంచుచున్నాము.

పుట41 'పశ్యేయమ్'

ఏకస్య= ఒక, కవేః = కవియొక్క, కృతిం= కబ్బమును, పశ్యేయంచేత్ = చూతునేని, సారస్వతమ్= వాణికి సంబంధించిన, కోశమ్ = నిఘంటువును అనగా పదజాలమును, ధనకోశమును; రిక్తమ్=శూన్యమయినదానిగా, అవైమి = అరయుచున్నాను, అంతః ప్రవిష్టః = లోపల చొరబడినవాఁడై, ఆయం = ఈ వినాయకుఁడు, అవేక్షితః చేత్ = చూడఁబడిన యెడల, ఏషా = ఈ, కవికోటిః = కవుల సముదాయము, కోణే = ఒకమూల, ప్రవిష్టా=అడగియున్నది.

పుట43 'ఆత్మానమ్'

ఆత్మానం=నన్ను, మానుషం=మానవునిగా, మన్యే= తలతును.

,, 'కరలగ్న'

కర...గః = చేత లగ్నమయిన జింకకల (జింకతాల్పు) కరి...గో=గజాసురుని భంజించిన, ఘన...నః=వ్యాఘ్రా

సురుని చీల్చిన, అస్త జంతుః = కాపాడిన జీవరాశికల, గిరిశః=కైలాసమున శయనించిన, విశద=తెల్లని రూపు కల, పంచముఖః=ఐదు మోములదేవర యగు శివుఁడు, మే=నాయొక్క, చేతః కుహరే=మనోగుహాలో, అస్తి= కలఁడు, భీః=భయము, కుతః=ఏల? ఇచట 'పంచముఖః' అను పదమునకు సింహామనియు అర్థము, శివుఁడే సింహ ముగా రూపింపఁబడెను. కాగా. కర...గః=చేజిక్కించు కొన్న జింకలు కలదియు, కరి...గో = మేటి ఏనుఁగుల చంపిన, ఘన...నః = పెద్దపులుల చీరివైచిన, అస్త= జంతువులనన్నిటిని నిరసించిన, గిరిశః=కొండలలో పండు కొనిన, విశద...తిః=తెలుపురూపు కల, పంచముఖః= (శివుఁడను)సింగముఅను అర్థముగూడ అనుసంధేయము.

పుట43 ' చంచలం '

కృష్ణ = కృష్ణుడా!. మనః = మనస్సు, చంచలంహి = చలించునది కదా!.

పుట48 ' త్రైగుణ్య '

వేదాః=కర్మను చెప్పు వేదములు, త్రైగుణ్య విషయాః =సత్త్వము రజస్సు తమస్సు అను గుణముల వలస కలుగు పుణ్యాపాపకర్మలు, వాని ఫలము : ఇవి, విషయ ముగా గలవి, అర్జున=ఓ అర్జునుడా (నీవు) నిస్త్రైగుణ్యు డవు, భవ=అగుము.

పుట56 'నిత్యమేవ'

సర్వజ్ఞేన=సర్వము నెరుగు, ఈశ్వరేణసహ= ఈశ్వరుని తోడ, నిత్యమేవ వర్తతే= ఎల్లయపుడు ఉండును.

పుట57 'శ్రుతీనాం'

మాతః = అమ్మా! తవ = నీయొక్క, యౌ = ఏ, చరణౌ = అడుగులను, శ్రుతీనాం = వేదములయొక్క, మూర్ధానః = తలలు అనగా వేదాంతములు, ఉపనిషత్తులు; శేఖరతయా = కిరీటముగా, దధతి=తాల్చుచున్నవో, ఏతౌ = ఆయీ అడుగులను, మమ అపి = నాయొక్కయు, శిరసి = తలమీాద, దయయా = దయతో, ధేహి = ఉంపుమా!, యయోః = ఏయడుగుల పాదోదకము. పశు...తటినీ=శివుని జడల యడవి యందలి ఏరు, (యయోః=మరి ఏ యడుగుల), లాక్షా లక్ష్మీః=పారాణిసిరి, అరుణ...శుచిః=హరి తల మానికపు టెఱుపుడాలు, ఉపనిషద్వేద్యములును హరిహరారాధ్యములు నగు నీ యడుగులను నాతలపై మోపుము అని తాత్పర్యము. అమ్మ యడుగులు వేదాంతములకంటెను, శివ విష్ణువుల కంటెను దొడ్డ వని ధ్వని. నీకు దయ కలిగినచో నీ భక్తుడును, వారితో పాటగుననియు ధ్వని.

పుట58 'స్నపయ'

శివే = ఓయమ్మా!, మా మపి = నన్నును, కృపయా స్నపయ = దయతో స్నానము చేయింపుము. చల్లగా చూడుము.

పుట59 'సాధారణే'

నిటల... ధే=నొసటి కంటిచే పొందదగిన, స్మరజయే= మన్మథుని జయము, సాధారణే (సతి)=ఉమ్మడికాగా, భాగీ = భాగము కల, శివః = శివుడు, సమగ్రం = నిండు, యశః = యశస్సును, భజతు నామ = పొందనీ, జనని!=అమ్మా!, త్వదీయే=నీకుసంబంధించిన, వామ.. తే =ఎడమకాలుచేతనే జరిగిపోయిన, కాలజయే=మృత్యు జయమునందు, పురారే = శివునకు, కావాప్రసక్తిః = ఏటి జోలి? అమ్మా! నొసలికన్ను మీ యిరువురకును ఉమ్మడి. ఆకన్ను తెరచినంతనే మన్మథుడు సమసెను. ఆజయము న్యాయ్యముగా మీ యిద్దరది. అటులయి నను శివుడు నేనే జయించితి నని అనుకొన్నయెడల అనుకొనుగాక! ఎడమకాలు నీదనినచో నీదేకాని శివు నకు దాన భాగము లేదు. దాని తాపుచే కాలుడు పోకాలెను. ఆ కాలజయములో భాగము అడుగుటకు శివున కేమి అధికారము?

పుట69 'వేదవేద్యే'

వేదవేద్యే=వేదముచే తెలియదగిన, పరే పుంసి=పరమ పురుషుడు, దశరథాత్మజే జాతే (సతి) = దశరథునకు కొడుకుగా అవతరింపగా, వేదః = వేదము, సాక్షాత్ రామాయణాత్మనా = సాక్షాత్తు రామాయణముగా, ప్రాచేతసాత్ = వాల్మీకి వలన, ఆసీత్ = ఆయెను. అవతరించెను

పుట70 'తం విద్యాత్' (గీత. 6-23)

తం=ఆ, దుఃఖ సంయోగ వియోగం=దుఃఖములతోడి కలయిక యొక్క యెడబాపునే, యోగసంజ్ఞితం = యోగమను పేరు కలదానినిగా, విద్యాత్ = తెలియునది (బాహ్యోపరమము మొదలగువానితో గూడిన అంతఃకరణావస్థా విశేషమునకు అనగా దుఃఖసంయోగ రాహిత్యమునకు యోగమనిపేరు), సః=ఆ యోగము, నిశ్చయేన = నిశ్చయముతో - నిక్కచ్చిగా, అనిర్విణ్ణ చేతసా=విసుపీకు లేని - వంత లేని చిత్తముతో, యోక్తవ్యః=సమకూర్పదగినది.

పుట71 'యం లబ్ధ్వా' (గీత. 6-22)

యం = ఏ యాత్మలాభమును, లబ్ధ్వా=పడసి, అపరం= మరొకలాభమును, తతః = ఆ యాత్మలాభముకంటె, అధికం=ఎక్కువ అయినది (కలదని), న మన్యతే = తలపడో, యస్మిన్ = దేనియందు- లబ్ధమైన ఆత్మయందు, స్థితః=ఉన్నవాడై, గురుణాపి దుఃఖేన = ఎంతటి వంతచే నయినను, న విచాల్యతే= చలింపజేయబడడో (దానిని యోగమని అరయునది).

పుట 73-74

శైశవేఽభ్యస్త విద్యానాం యౌవనే విషయైషిణామ్,
వార్ధకే మునివృత్తీనాం యోగే నాంతే తనుత్యజామ్॥
(రఘు - ౧ స)

శైశవే = శైశవమునందే, పసితనమునందే; అభ్యస్త విద్యానాం = నేర్చిన చదువులు కలట్టియు, యౌవనే =

పరువపు ప్రాయమున, విషయైషిణాం= కావలయువానిని కోరునట్టియు, వార్ధకే=ముదిమిలో, మునివృత్తీనాం = మునివర్తనము కలట్టియు, అంతే=తుదిని, యోగేన = యోగముచే అనగా సుఃఖసంయోగమును లేకుండ జేసి కొని. ఆనందముతో; తనుత్యజాం = శరీరమును రాల్చి వేయునట్టి. (రఘూణాం=రఘువులయొక్క, అన్వయం= వంశమును, వక్ష్యే= చెప్పగలను)

పుట77 'వేదోఽఖిలో'

అఖిలః వేదః=వేదమంతయు, ధర్మమూలమ్=ధర్మమందు (ధర్మము విషయమై), మూలమ్=మూలముగాఁ గలది.

,, 'రామో విగ్రహవాన్'

రామః=రాముడు, విగ్రహవాన్=రూపముకల అనగా రూపముదాల్చిన, ధర్మః=ధర్మము.

పుట79 'వేదాంతకృత్'

అహం=నేను, వేదాంతకృత్= వేదాంతములను చేసిన వాడను, అహం వేదవేదేన చ = వేదమును ఎరిగిన వాడనుకూడా నేనే.

పుట80 'యో వేదాదౌ'

వేదాదౌ=వేదము మొదట, యః=ఏ, స్వరః = అచ్చు అనగా ఓమ్ అనునది, ప్రోక్తః=చెప్పబడెనో, వేదాంతే చ=వేదముల తుదియందుగూడ, ప్రతిష్ఠితః=ప్రతిష్ఠింప బడెను - వ్రాయబడెను.

పుట83 'దూరాత్'

దూరాత్ = దూరముకంటెను. దూరే = దూరముకందును, అంతికే చ = సమీపమునందును - అనగా అతిదూరమునను, అతిసమీపమునను భగవంతుడున్నాడు. తన కంటిలో, హృదయములో ఏమున్నదో తనకు తెలియదు. అటులు తెలియకపోవుటే అతిదూరమునందుండుట.

పుట87 'అవిభక్తం చ' (గీత. 13-16)

అవిభక్తం చ=ఒకొక దేహమునందొకొక ఆత్మచొప్పున విభజింపబడకున్నను, విభక్త మివ చ స్థితమ్=విభజింపబడిన చందముగా నున్నది (అన్ని దేహములందును ఆకాశమువలె ఒకటిగా ఉండియు, ప్రాణులన్నిటియందును విడివిడిగా ఖండఖండములుగానున్నటులు ఉన్నది), తత్ -ఆత్మ, భూతభర్తృ చ=(స్థితికాలమున) భూతములను భరించునదనియు, గ్రసిష్ణు చ=(ప్రలయకాలమున) సంహరించునదనియును, ప్రభవిష్ణు చ = (ఉత్పత్తికాలమున త్రాడు మొదలగునవి భ్రాంతి కల్పించిన పాము మొదలయిన వానివలె) ప్రసవించు స్వభావము కలదనియును, జ్ఞేయమ్=ఎరుగదగినది.

,, 'అనన్యాః'

యే జనాః = ఎవరు (ఏ సన్న్యాసులు), అనన్యాః = వేరుకానివారై పరమాత్మను ఆత్మరూపముగ తెలిసినవారై, మాం = నన్ను, చింతయంతః=ధ్యానించుచు,

పర్యుపాసతే = ఉపాసింతురో, తేషాం = ఆ, నిత్యాభియుక్తానాం=నిత్య సమాహిత చిత్తులయొక్క, యోగక్షేమం = వలసినదానిని లభించునటులును, లభించిన దానిని ఉండునటులును; వహామి=చేయుదును. (యోగమనగా నిత్యాభియుక్తుల బ్రహ్మనిష్ఠ. క్షేమమనగా దానికి ఆధ్యాత్మికాద్యుపద్రవము గాకుండ జేయుట అని శంకరానందులు.)

పుట87 'యదా యదా'

భారత = అర్జునా!, యదా యదా = ఎప్పుడెప్పుడు, ధర్మస్య = (వర్ణాశ్రమముల చేతను వాని ఆచరణముల చేతను తెలియదగిన) ధర్మమునకు (ఇది అభ్యుదయమునకు నిశ్రేయసమునకును సాధనము), గ్లానిః=వాడుదనము, భవతి = కలుగుచున్నదో, తదా (తదా) = అప్పుడు అప్పుడు, అహం = నేను, ఆత్మానం = నన్ను, సృజామి = సృజించుకొందును (మాయానిబద్ధమగు దేహమును తాల్తును).

పుట88 'ఈశ్వరః' (గీత. 18-61)

ఈశ్వరః = దేవుడు, సర్వభూతాని = ప్రాణులన్నిటిని, యంత్రరూఢానీవ = చెక్కతో చేసిన ఆడు మగ రూపులు కల బొమ్మలను గారడివాండ్రు ఆడింతురు. అటులేయంత్రారూఢములగు వానినివలె; మాయయా= మాయచే, భ్రామయన్ = కదలించుచు, సర్వభూతా

నాం=ప్రాణు లన్నిటియొక్కయు, హృద్దేశే=హృదయ
స్థలమున, తిష్ఠతి = ఉండును.

పుట89 'అతఏవ చోపమా సూర్యకాదివత్'(బ్ర.సూ.3-2-18)

అత ఏవ చ = కావునను, సూర్యకాదివత్ = సూర్య ప్రతిబింబము మొదలగు దానివంటి, ఉపమా=దృష్టాంతము. (బ్రహ్మమును దెలుపుట కుపయోగింపబడిన దృష్టాంతములబట్టి బ్రహ్మము రూపములేని వస్తువని తెలియునది. ఆ దృష్టాంత మేది? ప్రకాశస్వరూపుడగు సూర్యుడు పెక్కు చెరువులలో ఏరులలో ప్రతిబింబించి పలువురుగా కనబడినటులు బ్రహ్మము పెక్కు ఉపాధులలో పెక్కు రూపులుగా కనబడును. కాని ఆ వస్తువునకు రూపము లేదు.)

పుట93 'అనంత'

అనంత...రవం = శేషుడును, అతని తలమీది నవరత్నములును, వీనిచే తంతలలాడు కాలికడియమున చిరుగంటల (శేషుడే పాదాంగదము. రత్నములే కింకిణులు) ఝుళం ఝుళ ఝుళం ఝుళధ్వని కలట్టియు; ముకుంద... పదం = హరి బ్రహ్మ - వీరి చేతిని పొందిన (హరియు బ్రహ్మయు వాచిన) మద్దెల కనుగుణమగు ధిమి ధిమిత యనుచు ఆడు పాదములు కలట్టియు; శకుంతరథ... కటం = విష్ణు, కుమార, నంది, గణపతి, భృంగిరిటుల సంఘము సమీపమున కలవాడు; సనంద...పదం = సనందనుడు సనకుడు మొదలగువారిచే నమస్కరింపబడిన

పాదములు కలవాడు నగు; పర...నటం = పరమశివుని, చిదంబర మహానటుని; హృది = ఎదలో, భజ = కొలువుమా !

పుట94 'హరం త్రిపుర'

హరం = తాపత్రయాదికమును, మనస్సును హరించు వాడును, త్రిపుర భఞ్జనం = త్రిపురములను, స్థూల సూక్ష్మ కారణ శరీరములను సమయించువాడును; అనంత...ణం = శేషునిచే చేయబడిన ముగుగు గలవాడును, అఖండదయం = కొలది లేని కరుణకలవాడును, అంత=అంతములేనివాడును; విరించి...పదం=బ్రహ్మ, సురగణము, ఇంద్రుడు వీరిచే చింతింపబడు పదములు కలవాడును; తరుణ...టం = లేజందురుడే కిరీటముగా గలవాడును; పరం=పరముడును; పద...మం=కాలిచే తాచిన యముడు కలవాడును, భసిత=బూడిదచే కయి సేసిన మేనివాడును, మదన...రం=మన్మధుని వంచన చేయుటలో వట్టు వట్టువాడును, చిరంతనం = సదా తనుడును (ఎల్లకాలము ఉండువాడును), ప్రణత ... నిధిం=భక్తులు దాచుకొనిన నిధియు అగు, అముం=ఈ, పర...టం = చిదంబర మహానటుని, హృది = ఎదలో, భజ = భజింపుమా.

పుట100 'యస్యాంగం'

యస్య = ఎవని, అంగం = మేను, కనకాభ కాయ సదృశం=కనక చంపక సమానమో, ఫాలం=నుదురు,

త్రి...తం = మూడు నామములతో తీర్పబడినదో, వాణీ = పలుకు, సకృద్ధారయా = ఏకధారగా ప్రవహించు, శ్రీరము...యా=శ్రీరామనామామృతముచే, అపి ఆర్ద్రా=తేమ యయినదియో, చేతసి=చిత్తమున, రాధయా=రాధతో, అంబుజలోచనః=తామరలవంటి కనులుగల, యదుపతిః=శ్రీకృష్ణుడు, అలం=మిగుల, ఖేలతి=నృత్య మొనర్చునో; తం, వేంకటరామ దేశిక వరం, వై=ఆ వేంకటరామ గురువును, తప్పక; అహం=నేను, సర్వాత్మనా=త్రికరణశుద్ధిగా. భజే=ధ్యానింతును.

## పుట101 'వేదో నిత్యమ్'

నిత్యమ్=ఎల్లప్పుడును, వేదః=వేదము, అధీయతామ్ = అధ్యయనము చేయబడుగాక ! (అనగా అధ్యయనము చేయుము), తదుదితం=వేదముచే చెప్పబడిన, కర్మ = కర్మము, సు + అనుష్ఠీయతామ్ = చక్కగా నిర్వహింపబడుగాక (నిర్వహింపుము), తేన = ఆ వేదము చెప్పిన కర్మచే, ఈశస్య=ఈశ్వరునికి, అపచితిః = పూజ, విధీయతామ్ = చేయబడుగాక ! (చేయుము).

## పుట104 'చిత్రం'

వటతరోః మూలే = మఱ్ఱిమాని మొదట, శిష్యాః = శిష్యులు, వృద్ధాః = ముసలివారు, గురుః = గురువు, యువా = యువకుడు, గురోః = ఆ గురువు యొక్క, వ్యాఖ్యానంతు=ప్రవచనమో, మౌనమ్=మాటాడకుండుట ('మౌనవ్యాఖ్యానం' అనియు పాఠము. మౌనమే

ప్రవచనము అని అర్థము), శిష్యాః తు = శిష్యులో, ఛిన్నసంశయాః = పటాపంచలై పోయిన సందియములు కలవారు, చిత్రమ్ = ఆశ్చర్యము !.

పుట112 'మౌనవ్యాఖ్యా'

మౌనవ్యాఖ్యా=మౌనమే వ్యాఖ్యచే (మాటాడక అంతర్ముఖుడై యుండును. ఆ యంతర్ముఖత్వమే శిష్యులకు తెలియవలసినది. అది మాటలతో కంటె చేతలతోడనే తెలియును. కావున మౌనవ్యాఖ్య అని అనుట), ప్రకటిత= తెలుపబడిన, పరబ్రహ్మతత్త్వమ్ = పరబ్రహ్మము యొక్క యాథార్థ్యము కలిగినట్టియు, యువానం = యువకుడైనట్టియు, బ్రహ్మనిష్ఠైః=బ్రహ్మతత్పరులును, వర్షిష్ఠ=వయసున పెద్దలును, అంతేవసత్ = శిష్యులును అగు, ఋషిగణైః=ఋషుల సమూహముచే, ఆవృతమ్ = పరివేష్టింపబడినట్టియు. ఆచార్యేంద్రం = గురువులకును గురువయినట్టియు, కర కలిత చిన్ముద్రం = బొటన వ్రేలు, చూపుడు వ్రేలు - వీనిచే చూపబడిన చిన్ముద్ర గలట్టియు; ఆనందమూర్తిం= మూర్తీభవించిన ఆనందమయినట్టియు, స్వాత్మారామం = తన ఆత్మలోనే సుఖించునట్టియు, ముదిత వదనం=సంతుష్టముఖముగల, దక్షిణామూర్తిం=దక్షిణామూర్తిని, ఈడే= స్తుతించుచున్నాను.

పుట116 'నాఽహం ప్రకాశః'

యోగమాయా సమావృతః = యోగ మనగా చేరిక. దేనిచేరిక ? త్రిగుణములయు చేరిక. ఇచట అది యోగము. అదియే మాయ. గుణత్రయసంయోగమే మాయ. దానిచే కప్పబడిన; అహం=నేను, సర్వస్య = అందరకును, న ప్రకాశః = తెలియబడువాడను కాను అనగా కానరాను, మూఢః = మోహము చెందిన, అయం=ఈ, లోకః=లోకము, మాం=నన్ను, అజం= పుట్టుక లేనివానిగా. అవ్యయం = చావు లేనివానిగా, న అభిజానాతి = ఎరుగదు.

పుట120 'చయ స్త్విషామ్'

పురా = తొలుత, త్విషాం చయః ఇతి=కాంతిపుంజము అని, అవధారితమ్ = అవధరింపబడెను, తతః = పిదప, విభావిత ఆకృతిం = భావింపబడిన రూపముకల, అముం = ఇతనిని, శరీరి ఇతి=దేహి అనియు, తతః=పిదప, విభక్తావయవమ్ = ఏ అవయవమున కా అవయవము వేర్వేరు తెలియబడిన, అముం=ఇతనిని, పుమానితి = పురుషుడనియు, క్రమాత్=సారిదిని - వెనుక సామాన్యాకారముగానూ, విశేషాకారముగానూ చెప్పబడిన క్రమమున; నారద ఇతి = నారదుడని, సః విభుః = ఆ శ్రీకృష్ణుడు, అబోధి = తెలిసికొనెను.

పుట121 'అజస్రమ్'

అజస్ర...యా=ఎల్లయప్పుడును మీటుటచే (పొడము) వీణతంతెల రాపుచే మెరయు బొటవ్రేలిగోళ్ల కాంతులతో కలసిపోయినది కనుకనే; పురః=ముందు. ప్రవాళైః = పగడములతో. పూరితార్థ యేవ = సగపాలు పూరింపబడినదో యననొప్పు, అచ్ఛ...యా= తెల్లని స్ఫటికమాలచే, విభాన్తం=ప్రకాశించు, అముం = ఇతనిని (నారదుడని శ్రీకృష్ణుడు తెలిసికొనెను).

పుట123 'నర్మదాయై'

ప్రాతః = ప్రాతఃకాలమునందు, నర్మదాయై = నర్మద (కొరకు) కు, నమః=మ్రొక్కు, నిశి=రేయిని, నర్మదాయై =నర్మదకు, నమః=మ్రొక్కు, నర్మదే = ఓ నర్మదా !, తుభ్యం=(నీ కొఱకు) నీకు, నమః అస్తు = నమస్కారమగుగాక.

పుట.132 'శివస్య'

శివస్య = శివునియొక్క, హృదయం = హృదయము, విష్ణువు; విష్ణోః చ = విష్ణువు యొక్కయు, హృదయం= హృదయము, శివః = శివుడు. శివుడే విష్ణువు; విష్ణువే శివుడు. పేరు వేరుగాని స్వరూప మొకటియే యని తాత్పర్యము.

పుట134 'రామశ్చాసౌ'

రామాభిన్నుడగు ఈశ్వరు డని యర్థము.

పుట134 'విష్ణుస్తత్పురుషం'

విష్ణుః = విష్ణుమూర్తి, తత్పురుషం = (రామేశ్వర పదమును) తత్పురుషసమాసముచే సిద్ధించినదానినిగా చెప్పుచున్నాడుః రామస్య+ఈశ్వరః = రామేశ్వరః = రామునకు ప్రభువు అని అర్థమగును; మహేశ్వరః = శివుడు. బహువ్రీహిం=(ఈ రామేశ్వరపదమునే) బహువ్రీహి సమాసముచే సిద్ధించినదానినిగా, బ్రూతే = చెప్పుచున్నాడు, రామః + ఈశ్వరః + యస్య సః = రామేశ్వరః = ఎవనికి రాముడు ప్రభువో అతడు రామేశ్వరు డని అర్థమగును, లేక రాముడు ప్రభువుగా గలవాడని అర్థమగును; ఉభయోరపి = ఇరువుర వలనను అనగా హరిహరుల వలనను, అతృప్తానాం = తృప్తిచెందని - ఈయిరువురును చెప్పిన అర్థములకు సందియము తీరని (దేవతలకు); ఆత్మభూః = బ్రహ్మ, కర్మధారయం = కర్మధారయ సమాసముచే సిద్ధించినదానినిగా, రామశ్చ+అసౌ ఈశ్వరశ్చ=రాముడైన యీశ్వరుడు అనగా రాముడును ఈశ్వరుడును ఒకరే అని అర్థము అగును, బ్రూతే = చెప్పుచున్నాడు.

పుట135 'విష్ణు ర్యస్య'

విష్ణుః = విష్ణువు, సహస్రనామ నియమాత్ = వేయి పేరుల నియమము వలన (వేయి పేరులు చెప్పుచు వేయి తామర పూవులతో పూజచేయుట యను నియమము పెట్టుకొని), యస్య = ఎవనియొక్క, పాదద్వయం =

రెండు పాదములను, అంభోరుహైః = పద్మములచే, అర్చయన్ = అర్చించుచు, ఏకేన = ఒక పద్మముతో, (తేషు) అపచితేషు (సత్సు) = అవి తగ్గగా (పొంపాటున వేయికి బదులు తొమ్మన్నూట తొమ్మిదే ఉండుటచే), నైజం = తనదైన, నేత్రపద్మం = కనుదమ్మిని (తో), సంపూజ్య = పూజించి, అసురసంహతిం = అసురుల గుంపును, విదళయన్ = విదలించుచు, త్రైలోక్యపాలః = ముల్లోకములకును ఏలిక యాయెనో, తస్మిన్ = ఆ, సాంబే పరబ్రహ్మణి = శివపరబ్రహ్మమునందు, మే = నా, హృదయం = హృదయము, సుఖేన = సుఖముగా, రమతాం = క్రీడించుగాక.

పుట144 'ఆపూర్యమాణమ్'

యద్వత్ = ఎట్లు, ఆపూర్యమాణం = నీటిచే అన్ని వైపులనుండియు నిండింపబడుచున్నట్టియు, అచలప్రతిష్ఠం = అచలముగనుండునట్టి, సముద్రం = మున్నీటిని, ఆపః = నీళ్లు, ప్రవిశన్తి = ప్రవేశించునో, తద్వత్ = అట్లు, సర్వే కామాః = ఎల్లకోరికలు, యం = ఎవనిని, ప్రవిశన్తి = ప్రవేశించునో, సః = అతడు, శాంతిం = శాంతిని, ఆప్నోతి = పొందుచున్నాడు, కామకామీ = కోరికలు కోరువాడు, న = పొందడు.

పుట145 'యత్సౌఖ్యాంబుధి'

యత్ = ఎవనియొక్క, సౌఖ్య = ఆనందము అను, అంబుధి = మున్నీటియొక్క, లేశ = బొట్టుయొక్క,

లేశతః = చిదురవలన, ఇమే = ఈ. శక్రాదయః = ఇంద్రాదులు, నిర్వృతాః = సంతుష్టులో.

పుట147 'ప్రత్యగ్వస్తుని'

నిస్తరంగ. ధౌ=అలలులేని సహజానందానుభవసముద్ర మగు, ప్రత్యగ్వస్తుని = ఆత్మవస్తువునందు, 'అయం విప్రః' = 'ఇతడు బ్రాహ్మణుడు', 'అయం శ్వపచః'= 'ఇతడు చండాలుడు', ఇతి అపి=అని, మహాన్=దొడ్డ, అయం విభేదగ్రహః = ఈభేదజ్ఞానము, కః = ఎట్టిది?, అంబరమణౌ = (మింటి మతనమయిన) సూర్యుడు, గంగాంబుని వా = గంగోదకములోనేని, చండాల వీథీ పయఃపూరే వా = మాలవాడలోని నీటిలోనేనియు, బింబితే = ప్రతిబింబించినయెడలను. (అట్లే) అంబరే = ఆకాశము, కాంచనఘటీమృత్కుంభయోః వా = బంగారపుకుండలోనేని మట్టికుండలోనేని, బింబితే=ప్రతిబింబించినయెడల, అంతరం అస్తి కిమ్=భేదము కలదా ఏమి?

పుట149 'యజ్ఞార్థాత్' (గీత. 3-9)

యజ్ఞార్థాత్ = పరమేశ్వరుని కొరకైన, కర్మణః=కర్మకంటె, అన్యత్ర=వేరుకర్మచే. అయం=ఈ, లోకః= లోకము, కర్మబంధనః = కర్మబంధము కలది (ఆ కర్మ లోకమును బంధించును), కౌంతేయ=అర్జునా', ముక్త సంగః = విడిచిన సంగము కలవాడవై (సక్తిని విడనాడి), తదర్థమ్ = పరమేశ్వరుని కొరకు. కర్మ=కర్మ మును, సమాచర = చేయుము.

పుట149 'తస్మాత్' (గీత. 16-24)

తస్మాత్ = కాన, కార్యాకార్య వ్యవస్థితౌ=ఏదిచేయ వచ్చును ఏది చేయరాదు అను ఏర్పాటులో, తే=నీకు, శాస్త్రం = శాస్త్రము, కుర్యాత్='చేయుము' 'చేయకుము' అని చెప్పు; ప్రమాణం = జ్ఞానసాధనము.

పుట153 'స్వే స్వే కర్మణి' (గీత. 18-45)

స్వే స్వే కర్మణి = తన తన కర్మలో (41 వ శ్లోకము కడనుండి 44 వ శ్లోకము వఱకును బ్రాహ్మణాదులకు స్వభావసిద్ధములగు కర్మలు చెప్పబడెను.), అభిరతః = తత్పరుడై, నరః=మనుష్యుడు (ప్రతివాడు), సంసిద్ధిం= (తమ తమ కర్మ చేయుటచే అశుద్ధి తొలగగా, శరీరమును ఇంద్రియములును జ్ఞాననిష్ఠకు పనికివచ్చును. అట్టి) సిద్ధిని, లభతే = పొందును, స్వకర్మ నిరతః = తన తన కర్మనే చేసికొనువాడు, యథా = ఎటులు సిద్ధిని, విందతే=పొందునో, తత్=ఆమాట, శృణు= విను. (తన పనిలో తానున్నమాత్రముననే సిద్ధి కలుగదు. మరి యేమిచేయువలయును? 'స్వకర్మణా తమభ్యర్చ్య (18-46)' = తన తన కర్మచే ఈశ్వరారాధన మొనర్చియే జ్ఞాననిష్ఠకు యోగ్యతను సంపాదించును.)

పుట155 'సిద్ధిం ప్రాప్తః'

సిద్ధిం = స్వకర్మచే ఈశ్వరు నారాధించి ఆ యీశ్వరానుగ్రహముచే శరీరమునకును ఇంద్రియములకునుగల

అశుద్ధిపోయి జ్ఞాననిష్ఠచేయుగల యోగ్యతను, ప్రాప్తః= పొందినవాడై, యథా = ఎట్లు, బ్రహ్మ = పరమాత్మను, ఆప్నోతి = పొందునో, తథా=అటులు అనగా ఆవిధమును (జ్ఞాననిష్ఠారూపముగు సిద్ధిచే ఆత్మ నెటులు పడయునో ఆవిధమును), జ్ఞానస్య=ఎరుకయొక్క, యా= ఏ, పరా నిష్ఠా = పర్యవసానము 'అ బ్రహ్మజ్ఞాననిష్ఠ ఎట్టిది? ఆత్మజ్ఞానమెట్టిది? ఏది బ్రహ్మము? ఏయది ఆత్మ? ఉపనిషద్వాక్యములచే, న్యాయముచే నీచే చెప్పబడిన యాతడెట్టివాడు?' అను ట్టి దెల్ల; సమాసేనైవ = సంగ్రహముగనే, మే=నావలన, నిబోధ=ఎరుగుము.

పుట156 'భక్త్యా మామ్'

యావాన్ = ఎంతవాడనో (సృష్టిలోని ఉపాధులు ఎన్నియో. అవన్నియు ఆత్మవే. కావున ఇట్లనుట), తత్త్వతః=నైజముగా, యశ్చ అస్మి=ఎవడనో (ఉపాధి భేదములు లేక ఆకాశమువంటివాడు కావున), భక్త్యా= భక్తిచేత – ఆర్తుడు జిజ్ఞాసువు అర్థార్థి : వీరల భక్తికంటె నాలుగవదగు పరభక్తిచేత – ఏభక్తిచే ఈశ్వరక్షేత్రజ్ఞ భేదబుద్ధి పోవునో అట్టి పరభక్తిచే; మాం = నన్ను, అభిజానాతి = తెలిసికొనును, తతః = ఆ యెరుకచే, తత్త్వతః జ్ఞాత్వా తదనంతరమ్ = నిక్కమెరిగిన పిదప బ్రహ్మభూతుడై. మాం విశతే = నన్ను చొచ్చును, అనగా బ్రహ్మభూతుడగును.

పుట158 'ఆపః సముద్రమ్'

'సముద్ర మాపః ప్రవిశంతి యద్వత్' అని ఉపనిష ద్వాక్యము. 'ఆపః సముద్రమ్' అనునది అర్థానుగుణ ముగా పదక్రమము చెప్పబడినది. యద్వత్=ఎటులు, ఆపః=నీళ్లు, సముద్రం=మున్నీటిని, ప్రవిశన్తి=పొందు చున్నవో - సముద్రములో పడుచున్నవో.

పుట164 'యావాన్' ⌈గీత. 2-34⌉

ఉదపానే = (దేనియందు ఉదకము త్రావుదురో అది ఉదపానము) నూతియందేని. చెరువునందేని; యావాన్ =ఎంత. అర్థః=ప్రయోజనమో. సర్వతః సంప్లుతోదకే = తెప్పలదేలు వెల్లువయందు, తావాన్ = అంతటి, అర్థః = ప్రయోజనము (ఎటులు కలుగునో అటులు), సర్వేషు=అన్ని, వేదేషు=వేదములందును, యావాన్ =ఎంతటి, అర్థః=ప్రయోజనమో, తావాన్=అంతటి, అర్థః=ప్రయోజనము, విజానతః=జ్ఞానియగు, బ్రాహ్మ ణస్య = బ్రాహ్మణునకు కలదు.

పుట165 'అన్వీక్షికీ'

అన్వీక్షికీ=తర్కవిద్య-(దండనీతి), ఐక్షి=చూడబడెను, కాపిలే = కపిలుడు చెప్పిన, తన్త్రే = శాస్త్రమునందు అనగా సాంఖ్యమునందు. అతులా = పోలికలేని, కాఽపి = ఒకానొక (గొప్ప). పరిచితిః = పరిచయము, లేభే=పొందబడెను, పాతంజలాంభః = పతంజలి చెప్పిన శాస్త్రరూపమైన; ఉదకము; పీతం = గ్రోలబడెను

(యోగశాస్త్రము, మహాభాష్యము అనునవి గడగడ నీరు త్రావినంత చులకనగా పఠింపబడెను), పరమపి = కష్టమయినదయినను, భాట్టఘట్టార్థత త్త్వమ్=భట్టపాదులొనర్చిన వార్త్తికముల(యొక్క) గట్టిసంగతుల (కఠిన విషయముల) అర్థ సత్యము, విదితం = తెలిసికొనబడియెను. తైః = ఆ దండనీతిచేగాని, తర్కశాస్త్రముచేగాని, మిగులుశాస్త్రములన్నిటిచేగాని (కలిగిన); యత్ = ఏ, సౌఖ్యం = సుఖము (కలదో), తత్=అది, అస్య= శంకరులకు, అస్మిన్= ఈ, అమలాద్వైత విద్యాసుఖే = నిర్మలమగు అద్వైతవిద్యాసుఖమునందు, అంతరభవత్ = అంతర్భావము చెందెను, కూపే = నూతియందు, యః = ఏ, అర్థః = ప్రయోజనమో (నీరు త్రావుట, స్నానముచేయుట మొదలగునది), సః = ఆ ప్రయోజనము, సుపయసి=మంచినీరు కలట్టియు, వితతే = విశాలమయినట్టియు, తీర్థే = గంగ గోదావరి మొదలగు తీర్థమందు, కిమంత ర్నభవేత్ = అంతర్భవింపదా?

దేవగాంధారి.

... ... ...

ఒకడు దప్పికిఁ ద్రావు నొకఁడు కడవ నించు
నొకఁ డీఁదులాడు మడు గొకటియందే
చక్క జ్ఞానియైనవాఁడు సారార్థము వేదమందు
తక్క చేకొనుఁగాక తలకెత్తుకొనునా?
యిది భగవద్గీతార్థ మిది యర్జునునితోను,
యెదుటనే వుపదేశ మిచ్చెఁ గృష్ణుఁడు

వెదికి వినరో శ్రీ వేంకటేశు దాసులాల
బ్రదుకుద్రోవ మనకు పాటించి చేకొనరో.

—అన్నమయ్య - వాల్యం 6-186 సంకీర్తనము.

పుట168 ' శివ శివ '

శ్రీకామాక్షీ కటాక్షితాః పురుషాః=శ్రీకామాక్షిచే కటాక్షింపబడినవారు, భువనం=ప్రపంచమును, విపినం = అడవిని, సమం=ఏకముగానూ (అనగా ప్రపంచమూ అడవీ ఒకటే అని), అమిత్రం = శత్రువును, మిత్రం = స్నేహితుని, సమం=ఒకటిగానూ, లోష్ఠం=మట్టిగడ్డను, యువతి బింబోష్ఠం = పడతి కెమ్మోవిని, సమం = ఒకటిగానూ, పశ్యంతి = చూతురు, శివశివ = అయ్యో! అయ్యో!, మేలు మేలు!, ఇటులుచూచుట విరుద్ధముగాన; శివశివ = అయ్యో అయ్యో! అనియు, ఇటులు చూడగలుగుట యే పరమార్థముగాన; శివశివ = మంగళము మంగళము! మేలు మేలు! అనియు అర్థము. ('లోష్టాని లేష్టవః పుంసి' అని, అమరమున 'లోష్ట' అనియు, కొన్ని నిఘంటువులలో లోష్ఠ అనియు కలదు.)

పుట168 ' సమం పశ్యన్ '

సర్వత్ర = ఎల్లభూతములందును, సమవస్థితమ్ = తుల్యముగా నున్న అనగా ఆకాశమువలె ఒక్కడుగా ఉన్న ఈశ్వరుని, సమం = సమముగా, పశ్యన్ హి = సరిగా చూచువాడు అనగా ఎల్లభూతములందును ఈశ్వరుడుండెగాన ఏకత్వమును చూచువాడు, ఆత్మనా=తనచే,

ఆత్మానం = తనను, న హీనస్తి తతః = చంపుకొనక, పరాం గతిం యాతి= పరమ గతిని పొందును.

పుట171 ' అంకోలమ్ '

ఇహ = ఇచట, నిజబీజ సంతతిః = తనగింజల సంతతి, అంకోలం=ఊడుగుచెట్టును, సూచికా=సూది, అయస్కాంతోపలం=సూదంటురాతిని, సాధ్వీ=సాధువయిన యాడుది, నైజవిభుం = తన మగనిని, లతా = తీగ, క్షితిరుహాం = చెట్టును, సింధుః = నది, సరిద్వల్లభం = సముద్రుని, యథా=ఎటులు, ప్రాప్నోతి = పొందునో (ఇవి యన్నియు తమకు బదులు చెప్పకుండగనే జరగుచుండును), తథా=అటులు, చేతోవృత్తిః=చిత్తవృత్తి, పశుపతేః = ఈశ్వరునియొక్క, పాదారవిందద్వయమ్= అడుగుదమ్మిల జంటను, సదా=ఎప్పుడును, ఉపేత్య= పొంది, తిష్ఠతి (ఇతి యత్) = ఉండుట (అనునది ఏది కలదో), సా = అది, భక్తి రితి = భక్తి అని, అభిధీయతే = చెప్పబడుచున్నది.

పుట175 ' యాచే నాభినవం తే '

చంద్రకలోత్తంస=జాబిలిరేక తలపూవుగాగల ఓ పరమశివా !, తే = నీ, అభినవం = సరిక్రొత్తదయిన, వస్తు= వస్తువును, కించిదపి = కొంచెమేని, న యాచే=కోరను, భగవన్! = భగవానుడా!, మదీయం స్వరూప మేవ = నా స్వరూపమే యగు, ఆనందం = ఆనందమును, మహ్యాం = నా (కొర) కు, దేహి = ఇమ్ము !

పుట185 'శక్నోతి'

యః = ఎవడు, కామ క్రోధోద్భవం = కోరికలవలనను క్రోధమువలనను కలుగు, వేగం=వడిని, శరీర విమోక్షణాత్ ప్రాక్ = శరీరమును విడుచుముందే, సోఢుమ్= ఓర్చుకొనుటకు, ఇహైవ = ఈలోకమునందే (బ్రతికియుండగనే), శక్నోతి=సమర్థుడో, సః నరః=అల్లతడు, యుక్తః = యోగి, సుఖీ = సుఖి.

పుట190 'మౌళౌ గంగా'

కనకసభానాథ = కనకసభాపతీ! చిదంబరమున వెలసిన చంద్రమౌళీశ్వరుడా!, మౌళౌ = సిగలో, గంగా శశాంకౌ = గంగయు చంద్రుడును, కరచరణ తలే = కరతలమందును పాదతలమునందును, శీతలాంగాః = చల్లని మేనుకల, భుజంగాః=పాములు, వామే=ఎడమ, భాగే = వైపున, దయార్ద్రా = దయచే చల్లని (తల్లియగు), హిమగిరిదుహితా = మంచుకొండ కూతురు, సర్వాగ్రతే=ఒడలియందెల్ల, చందనం=మంచిగంధము, ఇత్థమ్ = ఇటులు, ప్రభూతమ్ = ఎక్కుడయిన. శీతమ్= చలువదనమును, సోఢుమ్=ఓర్చుకొనుటకు, నిత్యతప్తే= ఎల్లకాలమునందును, నిర్వేదతప్తే=నిర్వేదముచే సలసలకాగు, మదీయే చిత్తే= నా చిత్తమునందు, తే = నీకు, నిత్యవాసః = నిత్యనివాసము, యది న భవతి = లేని యెడల, శక్తిః = శక్తి, క్వ = ఎచట? అనగా నీకు శక్తి ఉన్నదా? నీవు ఓర్వగలవా?

# అకారాది శ్లోకానుక్రమణిక

# స వ ర ణ

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 4 | 20 | తన్ని వేసి | తన్ని వేసినాడట |
| 9 | 23 | మైకంటుల | శ్రీకంఠుల |
| 27 | 16 | భ్రష్టుస్య | భ్రష్టస్య |
| 30 | 12 | విశిఖే | విశిఖా |
| 35 | 15 | జాలవు | జాలదు |
| 39 | 4 | సింతును | సింతుము |
| ,, | 9 | ... నని | ... మని |
| ,, | 18 | గౌగువము | గౌరవము |
| 40 | 16 | చతురంగులః | చతురంగులాః |
| ,, | 17 | ఆరగ్వద | ఆరగ్వధ |
| 41 | 21 | శేషాః | శేషా |
| ,, | 24 | డోల్లి | డోల్ల |
| 57 | 3 | భూనభో | భూనభః |
| ,, | 8 | శృతీనాం | శ్రుతీనాం |
| 65 | 8 | కోయల | కోవెల |
| 67 | 24 | యొక | ఒక |
| 68 | 14 | చెప్పచున్నారు | చెప్పుచున్నారు |
| ,, | 17 | వారి వారి | వారు వారు |
| 74 | 8 | వయిసయిన | వయసయిన |
| 81 | 24,25 | దేనినిగూర్చి | ఏది |
| 93 | 9 | దీర్ఘనుల | దీర్ఘములగు |
| ,, | 10 | ——కాళ్లు | —— వాటికొమ్ములు కాళ్లు |
| 94 | 4 | మద్దల | మద్దెల |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 99 | 15 | ఆళ్వార్లునయి | ఆళ్వార్లు నయితము |
| 101 | 6 | దేశికవవరం | దేశికవరం |
| 105 | 3 | సత్తనోద్ధృతము | సత్తనోద్ధతి |
| 108 | 24 | వటతారో | వటతరో |
| 116 | 16 | యని | అని |
| 117 | 19 | తెలసి | తెలిసి |
| 121 | 2 | ఇత్యబోధీ | ఇత్యబోధి |
| 123 | 15 | గౌతమ | కౌధుమ |
| ,, | 20 | ,, | ,, |
| 124 | 16 | పైనసే | పై సే |
| 130 | 20 | పూర్ణమ | పూర్ణిమ |
| 131 | 4 | హాల్ | ల్ |
| ,, | 5 | ల్ | హా+ల్ |
| ,, | 10 | మహేశ్వర | మాహేశ్వర |
| ,, | 14 | అల్ అను అక్షరము | అల్ అను ప్రత్యాహారము |
| 135 | 5 | రంభోరుహాణ్యర్చ్యయ | రంభోరుహైరర్చ్యయ |
| 138 | 11 | చెప్పినది | చెప్పినవి |
| 139 | 5 | కౌమారి | కామారి |
| 148 | 12 | వస్తువులెక్కడి | వస్తువుల కెక్కడి |
| 149 | 7 | నరవేర్చ | నెరవేర్చ |
| 153 | 5 | కటక వాక్యములని | ఘటక వాక్యములని |
| 154 | 4 | వినుము యని | వినుము అని |
| ,, | 7 | స్వరూపముతో | స్వరూపము |
| 155 | 2 | యద్ధా | యథా |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 155 | 2 | తదా | తథా |
| 163 | 8 | ప్రాప్తియును యొక | ప్రాప్తియును నొక |
| 164 | 23 | స్సంప్లుతోదకే | సంప్లుతోదకే |
| 165 | 22 | కోఽపి | కాఽపి |
| 166 | 11 | | |
| 168 | 14 | అమిత్రం లోష్ఠంచ | అమిత్రంమిత్రంలోష్ఠంచ |
| ,, | 23 | దృషి | దృష్టి |
| 173 | 5 | శబ్దముగా | సశబ్దముగా |
| 174 | 13 | అనుమాత్ర | అణుమాత్ర |
| ,, | 16 | నిన్ను | నీకు |
| ,, | 17 | వస్త్రముతో | వస్త్రము |
| ,, | 21 | దానిను | దానిని |
| 177 | 23 | ఒక్కొక మతమున | మతములన్నిటియందును |
| 179 | 22 | తరువాతది | పైగా |
| 181 | 9 | తరగతి చెడినదే | తరగతికి చేరినదే |
| ,, | 10 | వజ్రాలనగలు | ఇక వజ్రాలనగలు |
| 182 | 6,7 | అవసరములగు | అనవసరములగు |
| 188 | 16 | రాధించ | ఆరాధించ |
| 189 | 7 | జ్ఞానవయస్సు | జ్ఞానపయస్సు |
| 193 | 20 | శిల్పము | శిల్పులు |
| 194 | 10 | ఒంకారము | ఓంకారము |
| 197 | 8 | ఆ చల్లని ప్రభువు | ప్రభువును |
| ,, | 9 | హృదయములనొకట | హృదయములొకట |





# ద్వితీయ సంపుటము.

(అచిరకాలములో వెలువడ నున్నది.)

## ఇందలి వ్యాసములు.

1 అంబికా తత్త్వము
2 దక్షిణమును చూచెడి రాజులు
3 మహిమాన్వితములైన మన ప్రాచీనశాస్త్రములు
4 కార్తికదీపము
5 అవతారమూర్తి - ఆదిశంకరులు
6 ఎట్లు, ఎందులకు ప్రార్థించవలెను?
7 కళ - సంస్కృతి
8 మతములు - మతాచార్యులు
9 వేదవ్యాసులు - ఆదిశంకరులు
10 శంకరభగవత్పాదులు
11 దైవభక్తి - గురుభక్తి
12 అనన్యభక్తి - ఆత్మార్పణ
13 భగవద్గీత
14 పార్థసారథి
15 దేవ్యుపాసనా ఫలము
16 చంద్రమౌళీశ్వరి
17 శివభక్తి
18 స్వామి అంటే?
19 అహమే లేని ఆదిశంకరులు.

*
* *